

# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

బుద్ధజయంతి సంచిక

దుర్ముఖి - వసంతం

13

ఒక రూపాయ

ఏప్రల్, మే 1956

# అనుక్రమణిక



---

## కృతజ్ఞత


ఈ సంచికలోని భదంత ఆనంద కౌసల్యాయన గారి వ్యాసం (శ్రీ ఆలూరి బైరాగిగారు అనువదించినది), శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వ్యాసం రేడియో ప్రసంగాలు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి వ్యాసం వారు రచించిన 'సిద్ధార్థచరిత్ర' లోని భాగం. వారికి కృతజ్ఞులం.

—సంపాదకులు.

సంపుటి 3. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్త సంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య | సంచిక 1.



బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి

# బుద్ధుని భవ్యజీవితం

శ్రీమతి టి. సుబ్బరత్నమ్మగారు

—:o:—

[illegible]ద్ధాంతంతో, 'పంచశీల' ప్రవచనంతో ఆసియావాసులకే కాక అనంత విశ్వానికి, అనంతకాలాలకు అమృతసందేశం అందించిన తథాగతుని ధర్మం ఒక్కటే ఈ అణ్వస్త్రయుగంలో అఖిలప్రపంచవాసులకు అమృతభిక్ష అంటే అతిశయోక్తి కాదు. కపిలవస్తులో కన్ను తెరచి కుశీనగరంలో కన్ను మూసిన ఆ కరుణామూర్తి అవతారపరిసమాప్తి అయి నేటికి రెండువేల అయిదువందల సంవత్సరాలు గడచినా నేటికీ ఆయన మూర్తి మాసిపోలేదు. వాణికి వన్నె తగ్గలేదు. కోటానుకోట్లకాయన యిప్పటికీ తెన్ను చూపుతూనే ఉన్నారు. మిన్నువాకకంటె మిన్నగా ఆయనలోని కారుణ్యసింధువు అనంత జీవితక్షేత్రాలలో ప్రవహించి బంగారు పండిస్తున్నది. అనంతకోటి మానవహృదయాలపై అధికారాన్ని ప్రతిష్ఠాపింపజేసుకొన్న ధర్మసామ్రాజ్యానికే అధినేత ఆయన!

ఆయన అవతరించిననాటి భారతసంఘం క[illegible]ర మైనదీ, కృత్రిమమైనదీ. సంఘంలో దయకు తావు లేదు. ధర్మానికి స్థానం లేదు. క్రతుకలాపం విపరీతంగా పెరిగి మహాయజ్ఞాలపేర మారణహోమాలు కొనసాగుతుండిన ఆ దినాలలో అగ్రవర్ణాల అధికారదర్పం మానవతకే మచ్చగా పరిణమించింది. అజ్ఞానం ప్రోదిచేస్తూ, అవివేకం పెంచుకుంటూ అలనాటి బ్రాహ్మణుడు సంఘంలో అగ్రస్థానం అధిష్ఠించినాడు. సమతలేని అలనాటిసంఘంలో సామాన్యమానవుడికి సహృదయసామ్రాజ్యపట్టాభిషేకం చేసినధర్మమూర్తి తథాగతుడు! క్రౌర్యం కరుడుగట్టిన కఠోరహృదయవల్లరులపై కారుణ్యం చిలికిన కరుణామూర్తి గౌతముడు!

రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితం బుద్ధభగవానుడు ఈ పుడమిపై అవతరించిననాటి ఆర్థిక సాంఘిక రాజకీయపరిస్థితులెట్టివో, అలనాటి ధార్మికజీవనం ఏవిధంగా ప్రవర్తిల్లేదో మనకు స్పష్టంగా తెలియదు.

భారతదేశంలో ఆర్యుల పరిపాలన ఆరంభమైననాటినుండీ భౌతికసంపద అభివృద్ధి జరిగినమాట సత్యమే. వాణిజ్య వ్యాపారములవల్లా, పరిశ్రమలవల్లా ఆనాడు విశేషంగా సంపదుత్పాదనం జరిగింది. దానితో ప్రజలకు ఎక్కువ విశ్రాంతి చేకూరి, అది విజ్ఞానాభివృద్ధికీ, సంస్కృతివికాసానికీ దారి తీసింది. బహుశః ఈ ధనధాన్యసమృద్ధివల్లనే క్రీస్తుపూర్వం ఆరు, ఏడు శతాబ్దాలలో భారతదేశంలో భౌతికవాదం ప్రారంభమయి ఉండవచ్చు. సంపత్సమృద్ధి గల కాలంలో మతం వర్ధిల్లదు. [illegible] వర్ధిల్లవు. సంయమాన్ని, నిగ్రహాన్ని నిర్దేశించే ధర్మసంప్రదాయాలనుండి తప్పించుకొని తన అధర్మాచరణలను, అన్యాయప్రవర్తనలను సమర్థించుకోడానికి అవసరమయిన తత్త్వసిద్ధాంతాలను మానవుడు తయారు చేసుకోనే తీరుతాడు! దానితో అప్పటి కున్న మతసంప్రదాయాలు నికృష్టంగా పరిణమించినఫలితంగానే ఆనాడు భారతావనిలో జైనబౌద్ధమతాలు ఆవిర్భవించినాయి.

విశ్వమానవకోటికి వెలుగుబాట తీర్చిన ప్రజ్ఞానిధి పవిత్రజీవితఘట్టాలు పాఠకులకు భవ్యస్ఫూర్తిదాలవడంలో తప్పు లేదు.

హిమాలయశ్రేణికి దిగువన, మగధకు వాయవ్యాన ఉన్న భూప్రాంతానికి శాక్యవంశజుడైన శుద్ధోదనుడు రాజు. కపిలవస్తు అతనికి రాజధాని. అతని భార్య మాయాదేవి. ఆపుణ్యదంపతుల కడుపుపంటగా అవతరించాడు కరుణామూర్తి బుద్ధుడు. అది జరిగింది క్రీ. పూ. 563 ప్రాంతంలో.

ఒకసారి కపిలవస్తులో పూర్ణిమోత్సవం జరిగింది. పూర్ణిమకు ఏడురోజులుముందుగా మాయాదేవి ఆ ఉత్సవాన్ని అత్యంతభక్తిశ్రద్ధలతో, అతివైభవంగా జరిపింది. ఏడవరోజున పన్నీట పరిమళస్నానం చేసి ఆమె నాలుగులక్షల దీనారాలను దానం చేసింది. తరువాత అలంకారభూషిత యై, మృష్టాన్నం భుజించి, శయ్యా

మందిరం ప్రవేశించి శయనింపగానే ఆమెకు ఒక మధురస్వప్నం వచ్చింది. ప్రథమపాల బోధిసత్వుడు వెల్ల యేనుగురూపంలో ఆమె గర్భంలో ప్రవేశించినట్లు ఆయిల్లాలు కలగని లేచింది.

శుద్ధోదనుడు తనరాణి స్వప్నవృత్తాంతం విని బ్రాహ్మణులను పిలిపించి స్వప్నఫలం అడిగినాడు. అప్పుడు వారు 'రాజా! మీరేమీ ఆందోళనపడ నక్కరలేదు. రాణీ గర్భం ధరించింది. మీకు అచిరకాలంలో పుత్రోదయం కలగనున్నది. అతడు గృహస్థుగానే ఉంటే ప్రపంచానికంతకూ ప్రభువవుతాడు. గృహపరిత్యాగం చేసి పరివ్రాజకధర్మం చేపట్టితే అజ్ఞాన యవనికను ఛేదించి పరిపూర్ణబుద్ధుడవుతాడు' అన్నారు.

తొమ్మిది నెలలు గడచిన పిమ్మట పదవ నెలలో మాయాదేవి తన పుట్టింటికి వెడతానన్నది. రాజు అందుకు ఆమోదించి కపిలవస్తు నుండి 'దేవదహ' వరకూ మార్గాన్ని చక్కచేయించి బంగారుపల్లకీలో పరివారసమేతంగా పంపినాడు. మధ్యమార్గంలో ఉన్న లుంబినీవనంలో మాయాదేవి కొంత విశ్రాంతి తీసుకో దలచి అక్కడే ఉన్న ఒక సాలవృక్షంవద్దకు వెళ్లి దాని కొమ్మనొక దానిని చేత పట్టుకొని నిలబడగానే ఆమెకు పురిటినొప్పులు ప్రారంభమయినవి. ఇంతలో నిలబడి ఉండగానే ఆమె పుత్రశిశువును ప్రసవించింది. ఆశిశువు ధర్మబోధ చేస్తున్న ప్రవక్తవలెనే కరచరణాలను ముందుకు చాచి సోపానపరంపరను అవరోహిస్తున్న వ్యక్తివలె జన్మించాడు. జన్మించగానే లేచి యేడడుగులదూరం నడచి 'జననమరణాలవల్ల లోకంలో సంభవిస్తున్న దుఃఖాన్ని నిర్మూలం చేస్తాను' అన్నాడట! అప్పుడు ఆకాశంలో ఒక దివ్యజ్యోతి వెలిగిందని, చెవిటివారికి మాటలు వినబడినాయని, మూగవారు మాటలాడగలిగారని, కుంటివారు నడిచారని చెబుతారు.

శుద్ధోదనుడు తన కుమారునికి సిద్ధార్థుడని నామకరణం చేసి అల్లారుముద్దుగా, అతిగారాబంగా పెంచాడు. మాయాదేవి అతడు జన్మించిన యేడవనాడే ఆ ఆనందాతిరేకాన్ని భరించలేక పరమపదించింది. అప్పటినుండి శుద్ధోదనుడి రెండవభార్య గౌతమి కడుపులో పెట్టుకుని కాపాడింది గౌతముణ్ణి.

మహారాజు అతనిని బయటకు ఎక్కడికీ పోనివ్వకుండా రాజప్రాసాదంలోనే ఉంచి అతనికి వినోదం కల్పించేనిమిత్తం నలభైవేలమంది నట్టువరాండ్రను నియమించాడు. పరిణతవయస్కుడు కాగానే తనదేశంలోని అయిదువందలమంది క్షత్రియరాజకన్యలను రప్పించి వారిలో తనకు నచ్చినకన్యను వివాహమాడవలసిందని కోరాడు. అప్పుడు సిద్ధార్థుడు మహామంత్రి మహానాముని కుమార్తె యశోధరను వరించాడు. మహానాముడు శాక్యధర్మప్రకారం పరివిక్రమ విహారంలో సర్వరాజకుమారులను జయించినవానికే తన కుమార్తె నీయ సంకల్పించినానని చెప్పగా సిద్ధార్థుడు వివిధ క్షత్రియవిద్యలలో తనకు గల కౌశలాన్ని ప్రదర్శించి యశోధరను చేపట్టాడు. వివాహితుడై గార్హస్థ్యజీవితంలోని మాధుర్యం అనుభవించిన కొన్నాళ్లకతనికి రాహులుడని ఒక కుమారుడు కూడా కలిగాడు.

ఒకరోజున అతడు వాహ్యాళికై రాజమందిరంనుండి వెలుపలికి వచ్చి ఒక వృద్ధుని చూచాడు. మఱొకరోజున ఒక రోగినీ, ఇంకొకరోజున ఒక మృతకళేబరమునూ చూచాడు. తనకు కూడా ముసలితనం వస్తుందని, తాను కూడా రోగి కావచ్చుననీ, తాను కూడ ఒకనాటికి చనిపోతాడనే తెలియగానే గౌతమునికి యౌవనసుఖాలపట్ల విముఖభావం ఏర్పడ్డది. అంతకు ముందుండిన వ్యామోహం తొలగింది. లోకంలోని ఈ అనంత దుఃఖానికి కారణం ఏమిటి? అది తొలగడం ఎలాగ? జననమరణాల రహస్యం ఏమిటి? అని తెలుసుకోవడానికి అతని హృదయం అఱులు చాచింది. ఆ రాత్రే అతడొక నిశ్చయానికి వచ్చినాడు. తన అర్ధాంగినీ, అనుంగుపుత్రునీ విడనాడి అర్ధరాత్రిలో అతడు అంతఃపురం విడిచి అడవులకు బయలుదేరాడు. తానెక్కి వచ్చినకంటకాశ్వాన్ని చన్నుని అధీనం చేసి అతణ్ణి వెనక్కు పంపి కాషాయవస్త్రాలు ధరించి పరివ్రాజకవృత్తి నవలంబించాడు. ఇదే బుద్ధుడి జీవితంలోని మహాభినిష్క్రమణం.

అంతట దారిలో మారుడు కనబడి సామ్రాజ్యాలు కట్టబెడతాననీ, అష్టైశ్వర్యాలు అనుభవింపజేస్తాననీ సిద్ధార్థుని ప్రలోభపెట్టాడు. కాని అతడు నిరాకరించి ముందుకు ముందుకు సాగి

పోయాడు. ఒక నిబిడారణ్యంలో కఠోరతపస్సు ప్రారంభించాడు. శరీరాన్ని విపరీతంగా శుష్కింపచేసుకొన్నాడు. కాని ఆత్మహింస తరణోపాయం కాదని తెలిసి ఆ వైరాగ్యసాధనకు స్వస్తి చెప్పి బుద్ధగయకు పోయి అక్కడ బోధివృక్షంకింద జ్ఞానోదయం కలిగే వరకు అక్కడినుండి కదలనని తీర్మానించుకొని కూర్చున్నాడు. ఒకనాడు హఠాత్తుగా అతనికి ఒక దివ్యానుభూతి కలిగింది. దుఃఖానికి మూలకారణ మయినసత్యం అతనికి అవగతమయింది. తాను సత్యాన్వేషణ ప్రారంభించిన యేడు సంవత్సరాలకు అతడు వెలుగును కనుగొన్నాడు. ఇదే అతని సమ్యక్సంబుద్ధి. అక్కడనుండి తన సోదరప్రజకు తాను కనుగొన్న నిర్వాణపథం బోధించడానికని పాదయాత్ర ప్రారంభించినాడు.

తనతోబాటు కృచ్ఛ్రవ్రతాలు చేసిన అయిదుగురు ఋషులకూ మొదటగా ధర్మబోధ చేయ సంకల్పించుకొని అతడు మృగదావంలో తపస్సు చేసుకొంటూన్న వారిదగ్గరకుపోయి వారికిధర్మోపదేశం చేశాడు. నిరసనభావంతో మొదట వాళ్లు ఇతన్ని ఆదరించ దలచుకోలేదు. కాని అతని దివ్యతేజస్సుకు ముగ్ధులై వారికే తెలియక వారు అతనికి అర్ఘ్యపాద్యాలిచ్చి ఆదరించారు. చతురార్య సత్యాలను, తాను కనుగొన్న అష్టాంగమార్గమును వారికి బోధించాడు. ఇదే అతని ధర్మచక్రప్రవర్తనం. మృగదావంలోనే అతనికి నలభైమంది శిష్యులేర్పడినారు. వారితో తొలి బౌద్ధసంఘం నిర్మించి అతడు బౌద్ధధర్మప్రచారసంకల్పంతో ముందుకు సాగి మగధకువచ్చి అక్కడ బింబిసారునికి బౌద్ధదీక్ష ప్రసాదించినాడు. బింబిసారుడు రాజగృహప్రాంతంలో బౌద్ధభిక్షువులనివాసంకోసం రమణీయ మైన గొప్ప విహారం ఒకటి కట్టించి యిచ్చినాడు. మహారాజులు, సార్వభౌములు, సామంతులు, ఎందరో ఆనాడు బౌద్ధధర్మదీక్ష నవలంబించినారు. పాదచారియై సంచరిస్తూ అతడు ప్రజల భాష అయిన ప్రాకృతాలలోనే ధర్మబోధ చేశాడు. తన జనకు డయిన శుద్ధోదనుడి కోరికపై కపిలవస్తుకు పోయి అక్కడ తన జనకుడికీ, సోదరు డయిననందుడికీ, కుమారుడురాహులుడికీ ధర్మదీక్ష ననుగ్రహించినాడు. యశోధర లౌకికవాసన విడనాడి అతని పాదాల నాశ్రయించింది. సంఘంలో తన్ను కూడా చేర్చుకోవలసిందని ప్రార్థించింది. మహాప్రజాపతి గౌతమికూడా సంఘంలో చేరతానన్నది. తనసంఘంలో స్త్రీలను చేర్చరాదని బుద్ధుడు మొదట అనుకున్నా ఆనందుడు మొదలయిన శిష్యుల నిర్బంధంవల్ల అతడు వాళ్లను చేర్చుకోక తప్పిందికాదు. అప్పుడు భగవానుడు ఆనందునితో యిలా అన్నాడు.

'స్త్రీలు మనసంఘంలో ప్రవేశించకుండా ఉంటే ఈధర్మం వెయ్యేళ్లకు పైగా వర్ధిల్లేది. కాని వారికీ ఇప్పుడు అనుమతి యిచ్చినందున అయిదువందల యేళ్లవరకే యీధర్మం వర్ధిల్లుతుంది' అని.

ఈ విధంగా నలభై అయిదుసంవత్సరాలపాటు బౌద్ధధర్మప్రచారం చేస్తూ బుద్ధభగవానుడు ఎనభైసంవత్సరాల నిండు బ్రతుకు బ్రతికి తుదకు కుసీనగరంలో ఈశాన శతాబ్దం 148 వ సంవత్సరంలో వైశాఖశుద్ధ పూర్ణిమ మంగళవారంనాడు మహాపరినిర్వాణం చెందాడు.

ఆయన నిర్వాణం చెంది నేటికి రెండువేల అయిదువందల సంవత్సరాలైనా ఆయన నిర్దేశించిన ధర్మచక్రప్రవర్తనం, 'పంచశీల' ప్రవచనం, నేటికీ సకలవిశ్వానికి శాంత్యానందాల భిక్ష పెట్టుతున్నది. ఆయన అయిదువందల సంవత్సరాలపాటే ఉంటుందని ఆశించినా అనంతకాలాలపాటు ఉండేదిగా ఆయనధర్మం నేడు ప్రపంచం అంతటా అలముకొన్నది. బౌద్ధధర్మంలో అతిప్రధాన మయినత్రిశరణాలలో 'సంఘం శరణం గచ్ఛామి' అనలేనిబౌద్ధేతరులు కూడా 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ, 'ధర్మం శరణం గచ్ఛామి' అంటూ నేడు ఆయన చరణసరోజాలనే సమాశ్రయిస్తున్నారు. ఆ కారుణ్యమూర్తికివే మాకయిమోడ్పులు

'నమో భగవతో సమ్మాసంబుద్ధస్స'

# అంతేవాసి ఆనందుడు

## భదంత ఆనంద కౌసల్యాయన

బుద్ధభగవానులవారి శిష్యసముదాయంలో వారి తరువాత అందరికన్నా గొప్ప వ్యక్తిత్వం ధర్మసేనాపతి ఐనసారిపుత్రునిదన్నమాట నిర్వివాదాంశమే. కాని మానవ సహజగుణాలే గీటురాయిగా చూచుకొన్నట్లయితే ధర్మభాండాగారికుడైన ఆనందుని వ్యక్తిత్వం కూడా ఎవరికీ తీసిపోదు.

ఆనందుడు బోధిసత్వుని వెంట తుషితలోకంలో ఉండేవాడని బౌద్ధగాథలు చెబుతున్నవి. అక్కడనుంచి చ్యుతుడై ఆయన అమృతోదను డనే శాక్యునింట జన్మించినాడు. ఆయన జన్మించడంవల్ల చుట్టాలూ, పక్కాలూ, ఇరుగు పొరుగువారూ అంతా ఆనందించారు. అందువల్లనే ఆయనకు ఆనందు డనే పేరు వచ్చింది.

సిద్ధార్థ గౌతముడు గృహం త్యజించి, బుద్ధత్వ లాభ మందినతరువాత, మొదటిసారిగా కపిలవస్తునగరానికి తిరిగి వచ్చినప్పుడు, తదితర శాక్య రాజకుమారు లంతా వారివద్ద ప్రవ్రజ్యా గ్రహణం చేస్తున్నారు. అప్పుడే భద్రియుడు మొదలైనశాక్యకుమారుల తోడుగా ఆనందుడు కూడా ప్రవ్రజించాడు.

ఆనందునిగురించి ఇంకా వ్రాసి ఉంది.....

బుద్ధత్వం లాభించినతరువాత ఇరవై సంవత్సరాలవరకూ బుద్ధభగవానులకు ప్రత్యేకమైన ఉపస్థాపకుడు—అంటే ప్రైవేట్ సెక్రటరీ-ఉండేవాడు కాడు. ఒకప్పుడు నాగసమాలుడు, మరొక్కప్పుడు ఇతరభిక్షువులు, భగవానుల పాత్ర చీవరాదులు వెంట గొని వచ్చేవారు.

ఇలా ఉండగా ఒకరోజున అనాథ పిండకుని జేతవనపు గంధకుటీప్రాంగణంలో పరచి ఉన్న ఉత్తమబుద్ధాసనముపై ఉపవిష్టుడై ఉన్నతథాగతుడు భిక్షువుల నుద్దేశించి ఇలా అన్నాడు. 'భిక్షువులారా! బుద్ధుడనైననేనిప్పుడు ఏభై ఆరు సంవత్సరాల వయస్సు గలవాడనైనాను. కొంతమంది భిక్షువులు ఈమార్గాన్ననుసరించి రండి అంటే మరోమార్గాన పోతారు. మరికొంతమంది నాపాత్ర చీవరాదులు నేలమీదనే పెట్టివేస్తున్నారు. అందువల్ల నాకు పరిచర్యలు చేయటానికి ఎల్లప్పుడూ వెంట ఉండే ఒక భిక్షువు కావాలి.'

ఈపలుకులు విని భిక్షువులకు చాలా ఖేదం కలిగింది. అప్పుడు ఆయుష్మంతుడైనసారిపుత్రుడు లేచి భగవానులకు నమస్కరించి—'భంతే... నేను సేవ చేస్తాను. అనుజ్ఞ ఇవ్వండి' అని విన్నవించాడు.

భగవానులన్నారు 'లేదు, సారిపుత్రా! నీవు పయనిస్తున్న దిక్కున బుద్ధులతో నిమిత్తముండదు. నీధర్మోపదేశము బుద్ధుల ధర్మోపదేశమునకు సమానమైనదే. అందువల్ల నిన్ను పరిచారకునిగా చేసుకోవటం ప్రయోజనకరం కాదు...' అని.

అంతట మహామౌద్గల్యాయనుడు మొదలైన ముఖ్యశిష్యు లందరూ సేవాభాగ్యంకొరకు ప్రార్థించారు. కాని భగవానులవా రంగీకరించలేదు. స్థవిరుడైనఆనందుడు మట్టుకు మెదలకుండా కూచున్నాడు. అంతట ఇతర భిక్షువులు అతని 'ఆనందా! లే. యశస్సంపన్నులైనభగవానులను ఉపస్థాపకపదవి నివ్వమని యాచించు' అని ప్రోత్సహించారు. 'ఆయుష్మంతులారా! అడిగి పుచ్చుకొన్న పదవికి ఏపాటి విలువ ఉంటుంది? భగవానులు నన్నెరుగనివారు కారు. వారికిష్టమైతే, వారే స్వయంగా ఆనందా! నీవే నాకు పరిచర్యలు చేయమని ఆజ్ఞాపించగలరు' అన్నాడు ఆనందుడు. భగవానులవారు ఇదంత విని 'భిక్షువులారా! ఆనందుని మీరు ప్రేరేపించకండి. ఆనందుడు స్వయంగా అన్నీ తెలుసుకొని ముందువెనుక లాలోచించి ఉపస్థాపకపదవి నంగీకరిస్తాడు' అన్నారు. అంతట భిక్షువులు... 'ఇక లే ఆనందా! యశస్సంపన్నులైనభగవానులను ఉపస్థాపకపదవి నడుగు' అన్నారు.

స్థవిరుడైనఆనందుడు ఉపస్థాపక పదవి నంగీకరించేముందు ఎనిమిది షరతులు పెట్టాడు. వాటిలో మొదటి నాలుగింటిని 'ప్రతిక్షేపా' లంటారు. చివరి నాలుగింటిని 'అయాచన' లంటారు. మొదటి నాలుగు షరతులకు

సారాంశ మిది. 'భగవానుల కెక్కడైనా మంచి చీవరం లభించిన ట్లయితే అది వారు నా కివ్వగూడదు. మంచి భోజనం లభించిన ట్లయితే అది నాకు పెట్ట కూడదు. తన గంధకుటిలో నన్ను తనతో బాటు ఉండ నివ్వకూడదు. ఎవరైనా ఆహ్వానించినప్పుడు నన్ను తనవెంట పెట్టుకుని వెళ్ల కూడదు. ఈ నాలుగు షరతులకూ వప్పుకొన్న ట్లయితే నేను భగవానులకు పరిచర్య చేయటానికి అంగీకరిస్తాను' అన్నాడు ఆనందుడు.

'పైన చెప్పిన నాలుగింటిలోనూ ఏ కేలాంటి లాభాలు కనుపించాయి, ఆనందా!' అని భగవానులు అడిగారు.

'భంతే! పైన చెప్పినషరతు పెట్టక పోతే ఆనందుడు ఆ నాలుగింటి ప్రలోభంవల్లనే తథాగతుని పరిచర్య కంగీకరించాడని ఎవ్వరైనా అనవచ్చు.'

చివరి నాలుగు అయాచనలు ఇవి......

"భగవానులవారి పక్షాన నేనే నైనా ఆహ్వానాన్ని అంగీకరించిన ట్లయితే వారు కూడా అంగీకరించిన ట్లవుతుంది. 2. ఇతర జనపదాల నుంచి, ప్రదేశాలనుంచీ దర్శనార్థులు వచ్చినపుడు వారికి భగవానుల దర్శనం చేయించే అధికారం నా కుంటుంది. 3. అవసర మైనప్పుడల్లా భగవానులను సమీపించే హక్కు నా కుంటుంది. 4. నేను లేనప్పుడు భగవానుల వా రేదైనా ధర్మోపదేశం చేసిన ట్లయితే తరువాత నాకూడా ఆ ఉపదేశం వినిపించవలసి ఉంటుంది."

భగవానులు ఆనందుని ఎనిమిది షరతులనూ అంగీకరించారు. తరువాత ఆయన పరినిర్వాణం వరకున్నూ ఆనందుడు నీడలా వెన్నంటి పరిచర్య చేస్తూనే ఉన్నాడు. ఆయన భగవానుల కెంత దగ్గరగా ఉండేవాడో, ఎంత శ్రమపడేవాడో, ఎంత సమ్యకంగా జాగరూకుడై మెలిగేవాడో పాళీవాఙ్మయంలో నిండి ఉన్నతత్సంబంధ మైనకథలు చదివితే తెలుస్తుంది.

ఒకప్పుడు బుద్ధభగవానులు శాక్యదేశపు కపిలవస్తు నగరంలో న్యగ్రోధారామంలో విహారం చేస్తున్నారు. అప్పుడు మహాప్రజాపతి గౌతమి నూతన వస్త్రా లొకజత తీసుకొని భగవానులవా రున్నచోటికి వచ్చి ప్రణమించి ఒక ప్రక్కను కూర్చున్నది. ఈవిధంగా ఆసీనురాలైనమహాప్రజాపతి గౌతమి భగవానులతో ఇలా అన్నది. "భంతే! నాచేతులతో వడికిన, నా చేతులతో నేసిన ఈక్రొత్త బట్టలజత భగవానులవారికి సమర్పిస్తున్నాను. భంతే! భగవాను లనుగ్రహించి వీటిని స్వీకరించాలి."

అంతట భగవానులు మహాప్రజాపతి గౌతమితో ఇలా అన్నారు. "గౌతమీ! వీటిని సంఘాని కివ్వు. సంఘాని కిస్తే నన్ను కూడా గౌరవించినట్లే ఔతుంది. సంఘాన్ని కూడా గౌరవించినట్లు అవుతుంది." రెండవసారి మూడవసారి కూడా మహాప్రజాపతి గౌతమి బలవంతం చేసింది. కాని ప్రతిసారీ భగవానులు అదే సమాధాన మిచ్చారు.

అప్పుడు ఆనందుడు కూడా బలవంతం చేశాడు. "భంతే! భగవానులు మహాప్రజాపతి గౌతమి సమర్పించినబట్టలజతను స్వీకరించాలి. భంతే! భగవానులవారి మేనత్తగారైనమహాప్రజాపతి గౌతమి వారికి చేసినమేలు చెప్ప నలవి కాదు. జనని గతించినతరువాత భగవానులవారికి చాలా మేలు చేశారు. వారివల్లనే మహాప్రజాపతి గౌతమి బుద్ధ, ధర్మ సంఘాల శరణము పొందినది. భంతే! భగవానులు మహాప్రజాపతి గౌతమి సమర్పించినక్రొత్తబట్టల జతను స్వీకరించాలి."

"ఆనందా! నీవు చెప్పినది నిజమే. కాని నేను ఎట్టి పరిస్థితులలోనూ సంఘాని కిచ్చిన దానంకన్నా, వ్యక్తి కిచ్చినదానం గొప్ప దని ఎంచలేను. వ్యక్తి కిచ్చినదానంకన్నా సంఘాని కిచ్చిన దానం వల్లనే ఎక్కువ సత్ఫలితాలు కలుగుతాయి" అన్నారు భగవానులు.

ఈ సందర్భంలో ఆనందుడు భగవానులవారిని మహాప్రజాపతి గౌతమి ఇచ్చినదానం స్వీకరించటానికి ఒప్పించలేక పోయాడు. కాని మునుముందు ఈ మహాప్రజాపతి గౌతమినే నిమిత్తమాత్రురాలినిగా చేసి బౌద్ధ సంఘపు చరిత్రపైనే చెరుపరాని చిహ్నం వదిలిపోయే నటువంటి ఒక మహానిర్ణయానికి అంగీకరించేటట్లు భగవానులవారిని ఒప్పించ గలిగాడు. వినండి.

ఆరోజుల్లో భగవానులవారు శాక్యదేశపు కపిలవస్తునగరంలో న్యగ్రోధారామంలో విహారం చేస్తున్నారు. అప్పుడు మహాప్రజాపతి

గౌతమి భగవానులవారున్నచోటికి వచ్చి, ప్రణమించి అన్నది.

'భంతే! తథాగతుని ధర్మవినయంలో స్త్రీలకు కూడా స్థానం లభిస్తే బాగుంటుంది' అని.

ఈ విషయమై మహాప్రజాపతి గౌతమి మాటిమాటికి బలవంతం చేసినా భగవానులవారంగీకరించ లేదు.

అప్పుడు మహాప్రజాపతి గౌతమి చాలా మంది ఆడవారిని వెంట బెట్టుకొని, ఆనందుణ్ణి తమపక్షాన వాదించటానికి తోడు తీసుకొని భగవానులవారివద్దకు వెళ్ళింది. ఆనందుడు హార్దికావేగాన్ని, తర్కాన్ని ఆధారం చేసుకొని వాదించాడు. అప్పుడు భగవానులవారు భిక్షుణీలకొరకు కొన్ని ప్రత్యేక ప్రతిబంధాలు నియమించారు. భవిష్యద్ భిక్షుణీ సంఘంతరఫున మహాప్రజాపతి గౌతమి ఆ ఎనిమిది ప్రతిబంధాలను స్వీకరించింది.

ఆనందుడు లేకపోతే బహుశా భిక్షుణీ సంఘం స్థాపించబడి ఉండేది కాదు. అందువల్లనే శ్రీమేలు మరువని భిక్షుణీసంఘం జేతవనంలో నున్న ఆనందబోధిక సర్వదా విశేషంగా పూజలూ, అర్చనలూ చేస్తూ వస్తున్నది.

నేడు బుద్ధదేశాలన్నిటిలోను భిక్షువుల చీవరాలు ఏ ప్రకారంగా ఉన్నాయో దానిని మొదటిసారి వాడుకలోకి తెచ్చినది కూడా ఆనందుడే.

ఆ రోజుల్లో భిక్షువులు మామూలు దుప్పటులవంటివే రంగులు వేసిన వస్త్రాలు ధరించేవారు. ఒకప్పుడు భగవానులు రాజగృహంలో సంచారం చేస్తూ చేస్తూ దక్షిణాగిరి చేరుకొన్నారు. అక్కడ భగవానులు మగధదేశపు చేలూ, మడులూ చూచారు. గట్లు చూచారు. చేలమూలల కలయిక చూచారు. చూచి ఆయుష్మంతుడైన ఆనందునితో ఇలా అన్నారు. 'మగధదేశపు చేలు చూచావా? ఇలాంటి చీవరాలు నిర్మించగలవా?'

అంతట ఆనందుడు సరిగ్గా అలాంటివే చీవరాలు నిర్మించి చూపగా భగవానులు భిక్షువులను చూచి ఇలా అన్నారు. 'భిక్షువులారా! ఆనందుడు పండితుడు. భిక్షువులారా! ఆనందుడు మహాప్రాజ్ఞుడు. నేను క్లుప్తంగా చెప్పిన దానిని ఈతడు విస్తారంగా అర్థం చేసుకొన్నాడు.'

భగవానులకు ౫౫ సంవత్సరాల వయసు వచ్చిన తరువాత ఆనందుడు వారికి ప్రత్యేకపరిచారకుడయ్యాడని ముందే తెలుసుకొన్నాం. ఇక ఈ ముందు సన్నివేశం చూడండి; ఎంత సహజంగా ఉందో!

అప్పుడు భగవానులవారు శ్రావస్తీ నగరంలో విహారం చేస్తున్నారు. ఒకరోజున భగవానులు అపరాహ్ణంవేళ ధ్యానం ముగించి, లేచి విహారం వెనుకవైపున ఎండలో కూచున్నారు. అప్పుడు ఆయుష్మంతుడైన ఆనందుడు భగవానులవారున్నచోటికి వచ్చాడు. వచ్చి, కూర్చొని, భగవానుల శరీరాన్ని నిమురుతూ ఇలా అన్నాడు.

'భంతే! మహాశ్చర్యం. భంతే! మహాద్భుతం. భగవానులవారి చర్మపురంగు పూర్వంవలె ఉజ్జ్వలంగా లేదు. ముడుతలు పడినది. శరీరం ముందుకు వంగి పోయినది.'

అప్పుడు భగవానులన్నారు— 'ఔను. ఆనందా! ఇది ఇలాగే జరుగుతుంది. యౌవనంలో వృద్ధాప్యం నిహితమై ఉన్నది. ఆరోగ్యంలో రోగం నిహితమై ఉన్నది. జీవితంలో మృత్యువు నిహితమై ఉన్నది.'

... ... ...

భగవానుల అంత్యకాలంవరకూ ఆయన వెంట నున్న వాడు ఆనందుడొక్కడే నని తెలుస్తున్నది. భగవానులు నడుస్తూ నడుస్తూ హిరణ్యవతిఒడ్డున నున్న మల్లుల శాలవనంలో చేరుకొన్న తరువాత వారు ఆనందుణ్ణి ఇలా ఆదేశించారు.

'ఆనందా! ఈ రెండు శాలవృక్షాలమధ్యనా కొక శయ్య సిద్ధపరచి పెట్టు. చాలా అలసి పోయాను. విశ్రమిస్తాను.'

'అలాగే భంతే!' అని ఆనందుడు శయ్య పరచాడు.

ఉత్తరంవైపు శిరస్సు నుంచి, కుడిప్రక్కకు తిరిగి, చరమశయ్యపైపడుకున్న భగవానులన్నారు.

'ఆనందా! నాలుగు చెరగులనుంచీ శ్రద్ధ గలిగినజనులు లుంబినీ, బుద్ధగయా, సారనాథ్, కుసీ నగరాదుల దర్శనార్థం వస్తారు. అలా వచ్చినవారు ప్రపంచం క్షణిక మని గ్రహించి వైరాగ్యం పొందుతారు.' ఇది విని, ఏ మహావృక్షపు చల్లనినీడలో తాను ఇంతవరకూ విశ్రమిస్తున్నాడో అది మరికొంతసేపటిలో

సంఘం—మతం :

# ఆంధ్రదేశంలో బౌద్ధసంప్రదాయాలు

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

—:o:-

తెలుగుదేశంలో బౌద్ధం ఎప్పటినుండి పరివ్యాప్తమైనదో తెలియదు. కాని, బుద్ధుడు జీవించి యుండగనే ఆ మహామహుని బోధలు దక్షిణాపథవాసుల హృదయాలను ఆకర్షించిన వనుటకు ఆధార మున్నది. దక్షిణాపథనివాసి యైననటు డొకడు బుద్ధుని సమకాలికు డయిన బిందుసారగమహీపతి సమక్షమున మహాసంబోధ వరకు బుద్ధజీవితాన్ని నాటకంగా ప్రదర్శించె ననీ, దక్షిణాపథంనుంచి వెళ్లిన మరికొందరు నటులు శోభావతీనగరాధిపతి సమక్షమున బుద్ధనాటకాన్ని ప్రదర్శించినా రనీ, అందులో సూత్రధారుడే బుద్ధవేషాన్నీ, తదితరులు బౌద్ధ భిక్షుల పాత్రలనీ ధరించా రనీ టిబెట్టుదేశ బౌద్ధగ్రంథాలవల్ల తెలుస్తుంది. బుద్ధుని ప్రధాన శిష్యులలో ఒక డయినమహాకాత్యాయనుడు ఒక అస్సక రాజుకు బౌద్ధదీక్ష యిచ్చినట్లు విమానవత్థువ్యాఖ్యలో ఉంది. అస్సక మన్నది తెలంగాణాలోని యిప్పటి నిజామాబాదుజిల్లా ప్రాంతము. దీనికి పోతన రాజధాని. పోతన ఇప్పటి నిజామాబాదు జిల్లాలోని బోధన్.

బుద్ధుని జీవితకాలంలో కాకపోయినా, బౌద్ధం ఆయన నిర్వాణం పొందిన కొద్దికాలానికే తెలుగుదేశంలోని భాగమైనకళింగదేశంలో వ్యాపించింది. దహనమైనవెనుక చితినుండి బుద్ధుని ఎడమకోరపంటిని తీసి జాగ్రత్త పెట్టి ఖేమాథేరు డనేముని కళింగదేశాధిపతికిస్తే ఆరాజు దాని కొకరత్నకరండం చేయించి దానిలో పెట్టి పూజిస్తూ వచ్చాడు. ఆ రాజు రాజధాని దంతపురం బుద్ధదంత మహిమలవల్ల బౌద్ధవాఙ్మయంలో చాలా ప్రసిద్ధి చెందింది. ఈ దంతధాతువుకోసం కళింగం మీదికి ఎందరు రాజులో దండెత్తి వచ్చారు, దానిని బలిమినైనా తీసుకుపోవాలనేఉద్దేశంతో. చివరకా దంతధాతువు సింహళద్వీపానికి వెళ్లింది. ఇప్పటికీ అది అక్కడుం దంటారు.

బుద్ధుడు తాను జీవించి ఉన్నంతకాలము సాంఘికులలో అభిప్రాయభేదాలవల్ల చీలికలు రాకుండా ఆపు చేశాడు. ఆయన నిర్వాణం పొందిన తరువాత బౌద్ధసాంఘికులలో బుద్ధుడుపదేశించినధర్మాలవిషయంలో అభిప్రాయభేదం కలిగింది. అప్పుడు సప్రమాణంగా బౌద్ధధర్మాన్ని గ్రంథస్థం చేయుటకు అజాతశత్రుని ఆదరణక్రింద రాజగృహంలో ఒక గొప్ప బౌద్ధ మహాసభ జరిగింది. దీనిలో బౌద్ధధర్మం నిర్వచింపబడిగ్రంథస్థంఅయింది. అటుతరువాత బుద్ధుడు

(తరువాయి 71 వ పుటలో)

---

(7 వ పేజీ తరువాయి)

నామావశిష్టమై పోతుం దని ఆనందుడు గ్రహించాడు. అతడు ఏడ్వసాగాడు. అప్పుడు భగవానులవా రిలా ఓదార్చారు.

'ఆనందా! ఈ శోక మెందుకు? ప్రియమైన వస్తువు లన్నీ నాశం చెందక తప్ప దని నే నిది వరకే చెప్పలేదా? వియోగం అనివార్యం. ఆనందా! ప్రియజనులవియోగమే సంభవించకుండా ఉండట మనేది ఎన్నటికైనా జరుగుతుందా? ఆనందా! నీవు దీర్ఘకాలాన్నుంచీ త్రికరణశుద్ధిగా తథాగతునికి సేవ చేసి అపారమైనపుణ్యం సంపాదించావు. ఇకనుంచి ఆనందా! రాగద్వేషాలనుంచీ, మోహపాశాన్నుంచీ ముక్తి చెందేప్రయత్నాలు చెయ్యి.'

కాలం సమీపించింది. భగవానులవా రన్నారు. 'భిక్షువులారా! నేను పోయినతరువాత మన కిక శాస్త ఎవ్వరూ లే రని మీరు భావింపవచ్చు. అలా ఎన్నటికీ అనుకోవద్దు. నేను ఉపదేశించినధర్మాలనే మీరు మీ శాస్తగా, మార్గప్రదర్శకునిగా భావించండి. కనుక నో భిక్షువులారా! ప్రపంచంలోని వస్తువు లన్నీ నిర్మిత మైనవే; అందువల్లనే ఇవి చెడిపోవటం, నాశం కావటం తప్పదు. మీరు మీ లక్ష్యాన్ని సాధించటంలో ప్రమత్తులుకాబోకండి'. ఇవే తథాగతుని కడపటిమాటలు.

అంతట ఆ జగజ్జ్యోతి శాశ్వతంగా ఆరిపోయింది. తథాగతులు మహాపరినిర్వాణ మొందారు.

# లలితవిస్తరము

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు
తిరుమల రామచంద్ర

—: ౦ :—

మొదటి అధ్యాయము

## నిదానపరివర్తము

ఓం నమః సర్వబుద్ధబోధిసత్త్వేభ్యః.

ఓం నమో దశదిగనంతాపర్యంతలోకధాతు ప్రతిష్ఠితసర్వబుద్ధబోధిసత్త్వార్యశ్రావకప్రత్యేక బుద్ధేభ్యో అతీతానాగత ప్రత్యుత్పన్నేభ్యః.

ఒకానొకప్పుడు భగవానుడు శ్రావస్తియందలి జేతవనములో— అనాథపిండదుని యారామమున గొప్ప భిక్షుసంఘముతోను, ద్వాదశ భిక్షుసహస్రములతోను విహరించుచుండె నని నేను విన్నాను. చిరంజీవు లగుజ్ఞానకౌండిన్యుడు, అశ్వజిత్తు, బాష్పుడు, మహానాముడు, భద్రికుడు, యశోదేవుడు, విమలుడు, సుబాహువు, పూర్ణుడు, గవాంపతి, ఉరువిల్వాకాశ్యపుడు, నదీకాశ్యపుడు, గయాకాశ్యపుడు, శారిపుత్రుడు, మహామౌద్గల్యాయనుడు, మహాకాశ్యపుడు, మహాకాత్యాయనుడు, కపిలుడు, కౌండిన్యుడు, చునందుడు, పూర్ణమైత్రాయణీపుత్రుడు, అనిరుద్ధుడు, నందికుడు, కస్ఫిలుడు, సుభూతి, రేవతుడు, ఖదిరవనికుడు, అమోఘరాజు, మహాపారణికుడు, వక్కులుడు, నందుడు, రాహులుడు, స్వాగతుడు, ఆనందుడు—అనువారితోను కలసి విహరించినట్లు విని యున్నాను.

ఇట్టి ప్రముఖు లగుద్వాదశభిక్షు సహస్రములతోను, ఏకజాతి ప్రతిబద్ధులును, సర్వబోధిసత్త్వపారమితోద్భూతులును, సర్వబోధిసత్త్వాభిజ్ఞతావిక్రీడితులును, సర్వబోధిసత్త్వధారణీ ప్రతిభాన ప్రతి లబ్ధులును, సర్వబోధిసత్త్వధారణీప్రతిలబ్ధి కలవారును, సర్వబోధిసత్త్వ ప్రణిధానసుపరిపూర్ణులును, సర్వబోధిసత్త్వ ప్రతి సమ్యజ్ఞానింగతులును, సర్వబోధిసత్త్వసమాధివశిత్వము పొందినవారును, సర్వబోధిసత్త్వవశిత్వము పొందినవారును,' సర్వబోధిసత్త్వక్షాంతిని వెదచల్లువారును, సర్వబోధిసత్త్వభూమిపరిపూర్ణులును అగు ముప్పదిరెండువేల బోధిసత్త్వులతోను కూడి భగవానుడు శ్రావస్తియందు విహరించెను.

వారెవ్వరన—బోధిసత్త్వులును మహాసత్త్వులు నగు మైత్రేయుడు, ధరణీశ్వరరాజు, సింహకేతువు, సిద్ధార్థమతి, ప్రశాంతచారిత్రమతి, ప్రతిసంవిత్ప్రాప్తుడు, నిత్యోద్యుక్తుడు, మహాకరుణాచంద్రి—అనువారు. ఇట్టి ముప్పదిరెండువేలబోధిసత్త్వులతో భగవానుడు విహరించుచుండెను.

ఆసమయమున భగవానుడు శ్రావస్తీ మహానగరప్రాంతమున విహరించుచుండెను. అతడు తన పరిషత్తులు, రాజులు, రాజకుమారులు, రాజమంత్రులు, రాజమహామాత్రులు, రాజపాదమూలికులు, క్షత్రియులు, బ్రాహ్మణులు, గృహపతులు, అమాత్యులు, పౌరద్యులు, పౌరజానపదులు, ఇతర తీర్థక శ్రమణ బ్రాహ్మణ చరక పరివ్రాజకులు- అను వీ రందరివలనను సత్కారములు పొందుచు, గౌరవమర్యాదలను పొందుచు, పూజలను గొనుచుండెను. భగవానుడు ప్రభూతము లైన ఖాద్య, భోజ్యములను, ఆస్వాద్యములను, చీవర—పిండపాత్ర - శయనాసనములను, గ్లానప్రత్యయమును వారించు నౌషధములను పొందుచు, గొప్ప యశస్సును సంపాదించుచుండెను. ఇట్లుండియు భగవానుడు నీటిపై నున్నపద్మమువలె నన్నిటియెడల నిర్లిప్తుడై యుండెను. ఆ భగవానుని కీర్తి లోకమున వ్యాపించెను. అతడు సమ్యక్సంబుద్ధుడై విద్యాచరణసంపన్నుడై సుగతుడై లోకము నెఱిగినవాడై పురుషులను శిక్షించి ఋజుమార్గమున ప్రవర్తింపచేయు సారథియై, దేవ మనుష్యులకు నియంత యైనబుద్ధభగవానుడు పంచచక్షువు లై యవతరించెను.

అతడు దేవ, మారక, బ్రహ్మలతోను కూడిన యిహపరలోకములను, శ్రమణ

బ్రాహ్మణ, దేవమానుషులను స్వయముగా తెలిసికొని సాక్షాత్తుగా గమనించి విహరించుచుండెను. సద్ధర్మమును బోధించుచుండెను. ఆదిమధ్యాంతములందు కల్యాణమోహనమును, యథార్థమును, తగిన పదికగములు కలదియును, కేవలమును, పరిపూర్ణమును, పరిశుద్ధమును, స్వచ్ఛమును నగు బ్రహ్మచర్యమును వెల్లడించుచుండెను.

ఆసమయమున భగవానుడు రాత్రియందు మధ్యమయామమున బుద్ధాలంకారవ్యూహ మను సమాధినిష్ఠుడ డయ్యెను. సమాధినిష్ఠుడైన వెంటనే భగవానుని మీదుగా శిరస్సంధియందు ఉష్ణీష వివరాంతరమునుండి పూర్వబుద్ధానుస్మృత్యసంగ జ్ఞానాలోకాలంకార మనురశ్మి సంచరించెను. ఆ రశ్మి శుద్ధావాసములను దేవభవనములను ప్రకాశింపజేసి మహేశ్వర దేవపుత్రులను ప్రోత్సాహపరచెను. అప్పుడు తథాగతుని రశ్మిజాలమును ప్రస్తుతించుచు కొన్ని గాథలు వెలసినవి. అవి—

జ్ఞానప్రభం హతతమసం ప్రభాకరం
శుభ్రప్రభం శుభవిమలాగ్రతేజసమ్,
ప్రశాన్తకాయం శుభశాన్తమానసం
మునిం సమాశ్లిష్యత శాక్యసింహమ్. 1
జ్ఞానోదధిం శుద్ధమహానుభావం
ధర్మేశ్వరం సర్వవిదం మునీశమ్,
దేవాతిదేవం నరదేవపూజ్యం
ధర్మే స్వయంభుం వశినం శ్రయధ్వమ్. 2
యో దుర్దమం చిత్తమవర్తయద్వశే
యో మారపాశైరవముక్తమానసః,
యస్యాప్యవంధ్యా హి దర్శనశ్రవా
స్తం యాత నతాః శాంతవిమోక్షపారగః. 3
ఆలోకభూతం తమతుల్యధర్మం
తపోనుదం సన్నయవేదితారమ్,
శాన్తక్రియం బుద్ధమమేయబుద్ధిం
భక్త్యా సమస్తా ఉపసంక్రమధ్వమ్. 4
స వైద్యరాజోఽమృతభైషజప్రదః
స వాదిశూరః కుగణప్రతాపకః,
స ధర్మబంధుః పరమార్థకోవిదః
స నాయకోఽనుత్తరమార్గదేశకః. 5

[వీని యభిప్రాయ మిది—

1. జ్ఞానప్రభ కలవాఁడును, చీఁకటికి ప్రభాకరుఁడును, శుభ్ర మగు తేజస్సు కలవాఁడును, శుభమై నిర్మల మగు గొప్ప తేజస్సు కలవాఁడును, ప్రశాంత మగుశరీరము కలవాఁడును, శుభమై శాంత మగుమనస్సు కలవాఁడును, ముని యగువాఁడును, శాక్యసింహము నగుబుద్ధు నాశ్రయింపుఁడు.

2. జ్ఞానసముద్రమును, శుద్ధ మగుమహాత్మ్యము కలవాఁడును, ధర్మేశ్వరుఁడును, సర్వజ్ఞుఁడును, మునీశ్వరుఁడును, దేవతలను మించిన దేవతయు, దేవమనుష్యులకుఁ బూజ్యుఁడును, ధర్మమునందు స్వయంభువును, వశియు నగు బుద్ధు నాశ్రయింపుఁడు.

3. లొంగుబాటునకు రాని మనస్సును లొంగఁదీసినవాఁడును, మారుని పాశములకుఁ జిక్కువడని మనస్సు కలవాఁడును, వ్యర్థము కాని దర్శనశ్రవణములు కలవాఁడును, శాంత మోక్షముల పారమును జూచినవాఁడు నగుబుద్ధు నాశ్రయింపుఁడు.

4. తేజోరూపుఁడును, సాటి లేనిధర్మము గలవాఁడును, తపస్సును బోఁగొట్టువాఁడును, నీతివేత్తయు, శాంతక్రియుఁడును, అమేయ మగుబుద్ధి కలవాఁడు నగు బుద్ధుని, సమస్త జనులును భక్తితో సేవింతురు గాక!

5. అతఁ డమృతౌషధము నొసఁగు వైద్యరాజు; కుగణాలను (చెడ్డవారిగుంపులను) తపింపఁజేయు వాదిశూరుఁడు; ధర్మబంధువు; పరమార్థము నెఱిఁగిన గొప్ప విద్వాంసుఁడు; అనుత్తరమార్గము నుపదేశించు నాయకుఁడు.]

ఆ వెంటనే శుద్ధావాసకాయిక లగుదేవపుత్రులు సృజింపఁబడిరి. బుద్ధానుస్మృత్యసంగజ్ఞానాలోకరూప మగునారశ్మిచేతను, పైరీతి నున్న గాథలచేతను సంచోదితు లయి, అంతటను ప్రశాంతు లయి, వారు సమాధినుండి లేచి, బుద్ధానుభావమున నప్రమేయులు, నసంఖ్యేయులు, గణనాతిక్రాంతులు, కల్పాతిక్రాంతులు నగు భగవాను లగుబుద్ధులను స్మరించుచుండిరి. భగవాను లగుబుద్ధులయొక్క క్షేత్రములను, గుణవ్యూహపర్షన్మండలములను, ధర్మాదేశములను — సర్వమును స్మరించుచుండిరి.

ఆరాత్రి గడవఁగా, ఈశ్వరుఁ డనుశుద్ధావాసకాయికుఁ డగుదేవపుత్రుఁడును, మహేశ్వరుఁడు, నందుఁడు, సునందుఁడు, చందనుఁడు, మహితుఁడు, ప్రశాంతుఁడు, ప్రశాంతవినీతుఁడు, చేరుఁడు—మున్నగునితరు లగుశుద్ధా

వాసకాయికు లగుదేవపుత్రులును అతిక్రాంతా తిక్రాంతవర్ణములతో సర్వాంత మగుజేతవన మును దివ్యతేజస్సుతోఁ బ్రకాశింపఁజేయుచు భగవానునిపాదములకు శిరస్సులతో నమస్క రించి యేకాంతమున నుండిరి. అటుల నేకాంత మున నుండి శుద్ధావాసకాయికు లగునా దేవ పుత్రులు భగవానునిగూర్చి యిట్లు పలికిరి.

'భగవన్ ! సుత్రాంతము, మహావైపుల్య నిచయము నగులలితవిస్తర మనుధర్మపర్యా యము కలదు. అది బోధిసత్త్వకుశల, మూల సముద్భావన, తుషితవరభవన, విక్రమణ, సంచింత్యావక్రమణ, విక్రీడన, గర్భస్థాన విశేష సందర్శనమును, అభిజాత జన్మభూమి సంపన్న నము, సర్వబాలచర్యా గుణవిశేష సమతిక్రమ, సర్వలౌకిక శిలాస్థాన-కర్మస్థాన, లిపిసంఖ్యా, ముద్రాగణన, అసిధనుకలాప యుద్ధసాలంభ, సర్వసత్త్వ ప్రతివిశిష్ట సందర్శన, అంతఃపుర విషయోపభోగసందర్శనము, సర్వబోధిసత్త్వ పరినిష్పంద, నిష్పత్తి, ఫలాధిగమ పరికీర్తనము, బోధిసత్త్వ విక్రీడితము, సర్వమారమండల విధ్వంసనము, తథాగతబలవైశారద్య - అష్టా దశావేణిక సముచ్ఛయము. అప్రమాణ బుద్ధ ధర్మనిర్దేశము ననువిషయములు కలది. అది పూర్వు లగుతథాగతులచే భాషితపూర్వమే కాని క్రొత్త కాదు. ఎట్లన - భగవాను లగు పద్మోత్తరుఁడు, ధర్మకేతువు, దీపంకరుఁడు, గుణకేతువు, మహాకరుఁడు, ఋషిదేవుఁడు, శ్రీతేజుఁడు, సత్యకేతువు, వజ్రసంహతుఁడు, సర్వాభిభువు, హేమవర్ణుఁడు, అత్యుచ్చగామి, ప్రబాడసాగరుఁడు, పుష్పకేతువు, వర రూపుఁడు, సులోచనుఁడు, ఋషిగుప్తుఁడు, జినవక్త్రుఁడు, ఉన్నతుఁడు, పుష్పితుఁడు, ఊర్ణ తేజుఁడు, పుష్కరుఁడు, సురశ్మి, మంగళుఁడు, సుదర్శనుఁడు, మహాసింహతేజుఁడు, స్థితబుద్ధి దత్తుఁడు, వసంతగంధ, సత్యధర్మవిపులకీర్తి, తిష్యుఁడు, లోకసుందరుఁడు, విస్తీర్ణభేదుఁడు, రత్నకీర్తి, ఉగ్రతేజుఁడు, బ్రహ్మతేజుఁడు, సుఘోషుఁడు, సుపుష్పుఁడు, సుమనోజ్ఞ ఘోషుఁడు, సుచేష్టరూపుఁడు, ప్రహసిత నేత్రుఁడు, గుణరాశి, మేఘస్వరుఁడు, సుందర వర్ణుఁడు, ఆయుస్తేజుఁడు, సలీలగజగామి, లోకాభిలాషితుఁడు, జితశత్రువు, సంపూజి తుఁడు, విపశ్యి, శిఖి, విశ్వభువు, క్రకుచ్ఛం దుఁడు, కనకముని, కాశ్యపుఁడు-అనువారి చేతను, సమ్యక్సంబుద్ధుఁడగు తథాగతునిచేత నగున్యది భాషితపూర్వమై యున్నది. ఆ గ్రంథము నిపుడు భగవానుఁడును ప్రకాశింపఁ జేయవలెను.'

పిదప బహుజనహితముకొఱకును, బహు జన సుఖముకొఱకును, లోకానుకంపకొఱకును, గొప్పజననికాయముయొక్క ప్రయోజనము కొఱకును, దేవమనుష్యుల సుఖముకొఱకును, మహాయానోద్భవనార్థమును, సర్వమారుల నవమానించుటకును, సర్వబోధిసత్త్వయాని కుల యొక్కయు, పుంగవులయొక్కయు, వీర్యారంభసంజననార్థమును, సద్ధర్మమును పరిగ్రహించుటకును, త్రిరత్నవంశపరిగ్రహము నకును, త్రిరత్నవంశ మవిచ్ఛిన్నముగ నుండుట కును, బుద్ధకార్యపరిసందర్శనార్థమును భగ వానుఁడా దేవపుత్రుల తూష్ణీంభావమున దేవతలతోఁ గూడినలోకముపై దయ గల్గి చిత్తైకాగ్రతను వహించెను.

పిదప దేవపుత్రులు భగవానుని తూష్ణీం భావమువలన అధివాసన పొందె నని తెలిసికొని తుష్టులు నుదగ్రులును, సీమనస్కులును, ప్రమోదము పొందినవారును, ప్రీతివలని సౌమ నస్యమును పొందినవారు నయి భగవానుని పాదములపై శిరస్సుల నుంచి నమస్కరించి, భగవానునికి ముమ్మాఱు ప్రదక్షిణ మొనర్చి, దివ్యము లగుగురుచందనములచేతను పూజించి యచ్చటనే అంతర్ధాన మొందిరి.

పిదప నారాత్రి యతిక్రమింపఁగా భగ వానుఁడు కిరీటియు, మండలమాత్ర వ్యూహము కలవాఁడు నయి ప్రజ్ఞప్తుఁడై యాసనమునఁ గూర్చుండి బోధిసత్త్వగణముచేతను, శ్రావక సంఘముచేతను పురస్కృతుఁడై భిక్షుల నా మంత్రించుచుండెను.

ఆరాత్రి గడవఁగా ఈశ్వరుఁ డనుశుద్ధావాస కాయికుఁ డగుదేవపుత్రుఁడును, మహేశ్వ రుఁడు, నందుఁడు, సునందుఁడు, చందనుఁడు, మహితుఁడు, ప్రశాంతుఁడు, వినీతుఁడు, చరుఁడు మున్నగుశుద్ధావాసకాయికు లగుదేవ పుత్రు లందఱును వెనుకటివలె నచ్చటనే యంతర్ధాన మొందిరి. పిదప నా బోధిసత్త్వ లును, మహాశ్రావకులును భగవానునికిఁ జేతులొగ్గి యిట్లు పలికిరి—'భగవన్! ఆలలిత

## రెండవ యధ్యాయము

## సముత్సాహపరివర్తము

ఓ భిక్షువులారా! లలితవిస్తర మనుధర్మపర్యాయము సూత్రాంతమును మహావైపుల్యమును కలదియు నయి యున్నది. తుషిత భవనావసితుఁడును, పూజ్యపూజితుఁడును, అభిషేకప్రాప్తుఁడును, దేవశత సహస్రస్తుతులచే స్తుతింపఁబడియు, వర్ణింపఁబడియు, ప్రశంసితుఁడైనవాఁడును, ప్రణిధానసముద్గతుఁడును, సర్వబుద్ధధర్మసముద్గతబుద్ధియు, సువిపుల పరిశుద్ధ జ్ఞానసమానుఁడును, స్మృతి-మతి-గతి-ధృతులచేఁ బరిపక్వ మగువిపులబుద్ధి కలవాఁడును, దాన-శీల-క్షాంతి-వీర్య-ధ్యాన-ప్రజ్ఞా-మహోపాయ-కౌశల్య-పరమ పారమితా ప్రాప్తుఁడును, మహామైత్రీ కరుణా ముదితోపేక్షా బ్రహ్మపథకోవిదుఁడును, మహాభిజ్ఞాసంగజ్ఞా వరణ జ్ఞానసందర్శనాక్షేమ భూషితుఁడును, స్మృత్యుపస్థాన - సమ్యక్ప్రహాణ - ఋద్ధిపాదేంద్రియ బలబోధ్యంగ మార్గసత్యబోధి పక్ష ధర్మ సుపరిపూర్ణకోటి ప్రాప్తుఁడును, అపరిమిత పుణ్యసంభారలక్షణాను వ్యంజన సమలంకృతకాయుఁడును, దీర్ఘానుపరివర్తియు, యథావాది తథాకారి - వితథవాక్కర్మసముదాహరణుఁడును, ఋజు-మృదు-అకుటిలము - అశంకితము - అప్రతిహతము నగు మానసము కలవాఁడును, సర్వమానమదదర్ప భయవిషాదరహితుఁడును, సర్వసత్వసమచిత్తుఁడును, అపరిమిత బుద్ధకోట్యయుత శతసహస్ర పర్యుపాసితుఁడును, బహుబోధిసత్వకోట్యయుత శతసహస్రావలోకితులచే సవలోకితవదనుఁడును, శక్ర - బ్రహ్మ - మహేశ్వర - లోకపాల - దేవ-నాగ-యక్ష - గంధర్వ - అసుర - గరుడ - కిన్నర - మహోరగ - రాక్షసగణములచే సభినందింపఁబడిన యశస్సు కలవాఁడును, సర్వపదప్రభేద నిర్దేశాసంగ ప్రతిసంవిదవతార జ్ఞానకుశలుఁడును, సర్వబుద్ధభాషితధారణస్మృతి భాజనాపిత్తే పానంతాపర్యంత ధారణీ ప్రతిలబ్ధుఁడును, మహాధర్మ, నైస్పృత్యుపస్థాన, సమ్యక్ప్రహాణ, ఋద్ధి, పాదేంద్రియ బలబోధ్యంగ మార్గ పారమితోపాయ కౌశల్య ధర్మరత్న పుణ్య సముదానీత మహాసాగ వాహ్యుఁడును, చతురోఘ పారగామి నాభిప్రాయుఁడును, నిహతమాన విరోధియు, సర్వపరప్రవాదిసునిగృహీతుఁడును, సంగ్రామశీర్ష సుప్రతిష్ఠితుఁడును, క్లేశరిపుగణనిషూదనుఁడును, జ్ఞానవర వజ్రదృఢ ప్రహారణుఁడును, బోధిచిత్తమూల మహాకరుణాదండాధ్యాశయోద్గతుఁడును, గంభీరవీరసలిలాభిషిక్తుఁడును, ఉపాయకౌశలము కర్ణిక (దుద్దు) యు - బోధ్యంగ ధ్యానము కేసరములును - సమాధి యనుకింజల్కములును కలిగి గుణగణము లనెడినిర్మలసరస్సునం బుట్టి - విగతము లగు మద, మానపరివాహము, చంద్రునికై నిర్మలములై విస్తీర్ణములగు దళములు కలిగి, శీల, శ్రుతి, ప్రసాదములచే దళదిశలయందు ప్రతిహత మగుపరిమళము గలిగి - మహాపురుషపద్మమై యున్నవాఁడును, లోకమున జ్ఞానవృద్ధుఁడైనవాఁడును, అష్టలోకధర్మములచే ననుపలిప్తుఁడును, పుణ్యజ్ఞానసంభారములచే వ్యాప్త మగుసుగంధము కలవాఁడును, ప్రజ్ఞాజ్ఞానసూర్యకిరణములచే వికసితము గు విశుద్ధ శతపత్రపద్మమునకుఁ దపనుఁడును, చతుర్విధసమ్యగృద్ధిపాదపరిమజసజవితయు, చతురార్యసత్యసుతీక్ష్ణనఖదంష్ట్రలు కలవాఁడును, చతుర్బ్రహ్మవిహారముచేఁ బరిక్రమించిన దర్శనము కలవాఁడును, చతుస్సంగ్రహవస్తుసంగృహీత శిరస్కుఁడును, ద్వాదశాంగ ప్రతీత్యసముత్పాదానుబోధానుపూర్వసముద్గతకాయుఁడును, సప్తత్రింశద్బోధిపక్షధర్మ సంప్రతిపూర్ణ సువి[illegible] జ్ఞానకేసరియు, త్రివిమోక్షముఖ విజృంభితుఁడును, సమథవిదర్శనాసువిశుద్ధనయనుఁడును, ధ్యానవిమోక్ష సమాధి సమాపత్తిగిరి దరీగుహానివాసియు, చతురార్యపథ వినయోపవన సంపరితతగురువును, దశబల వైశారద్యభ్యాస భావిత బలుఁడును, విగతభయవిభవభయరోమహర్షుఁడును, అసంకుచితపరాక్రముఁడును, తీర్థిక శశమృగగణ సంఘమథనుఁడును, నైరాత్మ్యఘోష మహాసింహనాదనాదియు, కావున నే పురుషసింహుఁ డగువాఁడును, విముక్తధ్యానమండల ప్రజ్ఞాప్రభారశ్మి స్ఫురితకర ఖద్యోతగణ నిష్ప్రభంకరుఁడును, అవిద్యాతమోంధకార తమఃపటలమును బోఁగొట్టువాఁడును, ఉత్తప్తబలవీర్యుఁడును, దేవమనుష్యులయందు పుణ్యతేజస్సును దీపింపఁజేయువాఁడును - కావున నే మహాపురుష దిన

కరుఁడగువాఁడును, కృష్ణపక్షాపగతుఁడును, శుక్లపక్షప్రపూర్ణుఁడును, ప్రియదర్శనుఁడును, అప్రతిహతచక్షురింద్రియుఁడును, దేవశతసహస్రజ్యోతిర్గణ మండితుఁడును, ధ్యాన మోక్షజ్ఞానమండలుఁడును, బోధ్యంగ సుఖ రశ్మిశశికరుఁడును, బుద్ధనిబుద్ధమనుజకుముద విబోధకుఁడును, మహాపుణ్యబుద్ధ చంద్ర సమ చతుష్పథ దీప్తప్రాణపరీతుఁడును, సప్తప్రయోగుఁడును, అప్రతిహతబుద్ధియు, దశకుశలకర్మ పథవ్రతతపస్వియు, సుసమృద్ధి ప్రపూర్ణ విశేష గమనాభిప్రాయుఁడును, అప్రతిహత ధర్మ రాజవర ప్రవరధర్మ రత్నచక్రప్రవర్తకుఁడును, చక్రవర్తి వంశకులోదితుఁడును, గంభీర దురవగాహ ప్రతీత్య సముత్పాద సర్వధర్మ రత్నపరిపూర్ణుఁడును, అత్యంతప్రసృత విపుల విస్తీర్ణ గంభీర జ్ఞానశీల వేలానతిక్రమణుఁడును, మహాపద్మగర్భేక్షణుఁడును, సాగరవరధర విపులబుద్ధియు, పృథివ్యప్తేజో వాయు సమచిత్తుఁడును, మేరుకల్ప దృఢబలాప్రకంప్యమానుఁడును, అనునయ ప్రతిఘాపగతుఁడును, గగన తలవిమల విపులాసహ్య విస్తీర్ణబుద్ధియు, అధ్యాశయసుపరిశుద్ధుఁడును, సుదత్తదానుఁడును, సుకృతపూర్వయోగుఁడును, సుకృతాధికారుఁడును, దత్తసత్యంకారుఁడును, సర్వోషిత సకల కుశలమూలుఁడును, వాసితవాసుఁడును, నిర్వాణమునకై సర్వకుశలములను మూలమైన వాఁడును, సప్తసంఖ్య కల్పములందును సముదానీతము లగుమూలకిరణములు కలవాఁడును, సప్తవిధదానములు కలవాఁడును, పంచవిధపుణ్యక్రియా వస్తుసేవితుఁడును, కాయికముగా త్రివిధమును, వాక్కుచేఁ జతుర్విధమును, మనస్సుచే త్రివిధమును నగుసుచరిత్రము కలవాఁడును, దశకుశలకర్మ పథాదానసేవితుఁడును, చత్వారింశ దంగ సమన్వాగత సమ్యక్ ప్రయోగము నాసేవించినవాఁడును, చత్వారింశ దంగ సమన్వాగత సమ్యక్ ప్రణిధాన ప్రణిహితవంతుఁడును, చత్వారింశ సమన్వాగత సమ్యగధ్యాశయ ప్రతియత్న వంతుఁడును, చత్వారింశ దంగ సమన్వాగత సమ్యగ్విమోక్ష పరిపూరితవంతుఁడును, చత్వారింశదంగ సమన్వాగత సమ్యగధిముక్తి మాత్రీకృతుఁడును, నలువది యైన బుద్ధకోటీనియుత శతసహస్రములం దనుప్రవ్రజితుఁడును, ఏఁబదియైదు బుద్ధకోటీనియుత శతసహస్రములందు దానము లొసర్చినవాఁడును, అర్ధచతుర్థము లగుప్రత్యేక బుద్ధకోటీశతములం దధికారము కలవాఁడును, అప్రమేయాసంఖ్యేయము లగుసత్వములను స్వర్గమోక్షములను పొందించువాఁడును, అనుత్తర మగుసమ్యక్సంబోధ నభిసంయోగకాముఁడును, ఏకజాతి ప్రతిబద్ధుఁడును, ఇగ దివిని తుషితవర భవనమున నున్నవాఁడును, శ్వేతకేతు వనుదేవ పుత్రోత్తముఁడును, సర్వదేవ సంఘములచే సంపూజ్యమానుఁడును, అందుండి జారి భూలోకమున నుత్పన్నుఁడైనబోధసత్త్వుఁడు శీఘ్రకాలముననే లోకోత్తర మగుసమ్యక్సంబోధని బొందఁగలఁడు.

ద్వాత్రింశద్భూమి సహస్ర ప్రతిసంస్థితమును, వితర్ది నిర్యూహ తోరణ గవాక్ష కూటాగార ప్రాసాదతల సమలంకృతమును, ఉన్నతచ్ఛత్రధ్వజపతాక రత్నకింకిణీ జాల వితానవ్యాప్తమును, మాందారవ మహామాందారవ పుష్ప సంస్తరణ విస్తృతమును, అప్సరః కోటి నియుత శత సహస్ర సంగీతి సంప్రచలితమును, అతి ముక్తక - చంపక - పాటల - కోవిదార - ముచిలింద - మహాముచిలింద - అశోక - న్యగ్రోధ - తిందుక - సన - కర్ణికార - కేసర - సాల రత్నవృక్షసశోభితమును, హేమజాల సంఛన్నమును, పెద్ద పూర్ణకుంభములతో శోభించు చున్నదియును, సమతల వ్యూహహోపశోభితమును, జ్యోతిర్మాలికా సుమనోవంతమును, దేవకోటీ నియుత శత సహస్రాక్షిముఖ నయనావలోకితా లోకమును, మహా విపుల ధర్మసంగీతి - సర్వకామ - రతి - క్లేశ - చ్ఛేదనమున వ్యపగతము లగునఖిల క్రోధమాన మదదర్పాపనయము కలదియు, ప్రీతి - ప్రసాద - ప్రమోదులచే నుత్తప్త మగు విపులస్మృతిని కలిగించునదియు నగు మహా విమానమున సుఖోపవిష్టుఁడై, మహా ధర్మసంకథనమునఁ బ్రవృత్తము కాఁగా, చతురశీతి తూర్య సంగీతి సహస్రధ్వనులచే పూర్వశుభ కర్మోపచయములచే నాబోధిసత్త్వునకీ సంచోదనా గాథలు వెలువడినవి - అవి—

స్మరవిపులపుణ్యనిచయ [కారికె,
స్మృతిమతిగతి మనంత ప్రజ్ఞాప్రభా
అతులబలవిపులవిక్రమ
వ్యాకరణం దీప సహోనాస్తి.

స్మరవిపులనిర్మలమన
త్రిమల మల ప్రహీణ శాంతమదదోషం,
శుభవిమలశుద్ధచిత్తా
దామచరీ యథాపూర్వశాతి పురే. 2
స్మర కులకులీనా శమథం
శీలవ్రతం క్షమా దమం చైవ,
వీర్యబల ధ్యాన ప్రజ్ఞా
నిషేవితా కల్పకోటీ నియుతాని. 3
స్మర స్మర అనన్తకీర్తే
సంపూజితా యేతి బుద్ధనియుతాని,
సర్వాన్ కరుణాయమానః
కాలోఽయం మా ఉపేక్షస్వ. 4
చ్యవ చ్యవ హి చ్యుతి విధిజ్ఞా
జరామరణక్లేశసూదనా విరజా,
సముదీక్షస్వ బహవో
దేవాసురనాగయక్షగంధర్వాః. 5
కల్పసహస్ర రమిత్వా
తృప్తిర్నాస్త్యంభసీవ సముద్రే,
సాధు భవ ప్రజ్ఞాతృప్త
తర్పయసు జనతాం చిరతృషార్తామ్. 6
కిం చాప్యనిందితయశ
స్త్వం ధర్మరతిరతో న చాసి కామరతః,
అథ చ పునరమలనయనా
అనుకంపా సదేవకం లోకమ్. 7
కిం చాపి దేవనయుతాః
శ్రుత్వా ధర్మం న తే నితృప్యంతే,
అథ చ పునరక్షణగతా
నపాయ సంస్థానపేక్షస్వ. 8
కిం చాపి విమలచక్షో
పశ్యసి బుద్ధాన్ దశదిశి లోకే,
ధర్మం శృణోషి చ తతః
తం ధర్మవరం విభజ లోకే. 9
కిం చాపి తుషితభవనం
తవ పుణ్యశ్రియాభిశోభతే శ్రీమాన్,
అథ చ పున కరుణమానస
ప్రవర్ష జంబుధ్వజే వర్షమ్. 10
సమతీత్య కామధాతుం
దేవా యే రూపధాతుకా నేకే,
సర్వే త్వభినందంతే
స్పృశేయ సిద్ధివ్రతో బోధి. 11
నిహతాతిమారకర్మా
జితా స్త్వయాన్యే కుతీర్థికా నాథా,
కేన సకలగతతిబోధి
కాలోఽయం మా ఉపేక్షస్వ. 12
క్లేశాగ్నినా ప్రదీప్తే
లోకే త్వం వీర! మేఘవద్వ్యాప్య,
అభివర్షామృతవర్షం
శమయస్క్లేశాన్నరమరూణాన్. 13
త్వం వైద్యధాతుకుశల
చిరాతురాన్ సత్యవైద్య సత్యవాన్,
త్రివిమోక్షగదయోగై
ర్నిర్వాణసుఖే స్థపయ శీఘ్రమ్. 14
అశ్రుత్వా సింహనాదం
క్రోష్టుకనాదం నదం త్యన్యత్రస్తాః,
నద బుద్ధసింహనాదం
త్రాసయ పరతీర్థకశృగాలాన్. 15
ప్రజ్ఞా ప్రదీపహస్తో
బలవీర్యబలోదితో ధరణిమండే,
కరతలవరేణ ధరణీం
పరాహనిత్వా జినహి మారమ్. 16
సముదీక్షనే పాలా
శ్చతురో యేతుభ్య దాస్యతే పాత్రమ్,
శక్రాశ్చ బ్రహ్మ నయుతా
యే జాతం త్వాం గ్రహీష్యంతి. 17
వ్యవలోకయాభియుశా
కులరత్నకులోదితా కులకులీనా,
యత్ర స్థిత్వా సుమతే
దర్శేష్యసి బోధిసత్త్వచరితమ్. 18
యత్రైవ భాజనేస్మిన్
మణిరత్నం తిష్ఠతే భవతి శ్రీమాన్,
మణిరత్నం విమలబుద్ధే
ప్రవర్ష జంబుధ్వజే వర్షమ్. 19
ఏవం బహుప్రకారా
సంగీతి రవాను నిశ్చరా గాథా,
చోదేంతి కరుణామనసం
అయం స కాలో మా ఉపేక్షస్వ. 20

[వీని యభిప్రాయ మిది—

1. విపులపుణ్యనిచయము గలవాఁడా! స్మృతి, మతి, గతి, అనంత మగుప్రజ్ఞ, తేజస్సు కలిగించువాఁడా! అతుల మగుబలము కలవాఁడా? దీపసహాయముననే విశేషకార్య కరణము జరుగును. ఇది తలంపుము.

2. విపుల మైన నిర్మల మగుమనస్సు కలవాఁడా! త్రిమలముల మాలిన్యమును నశింప

జేయువాఁడా! శాంతించిన మదదోషము కల వాఁడా! శుభవిమలశుద్ధచిత్తము కలదియు, దామచరియు నగుదానిని స్మరింపుము.

3. ఉత్తమకులమునఁ బుట్టుట, అశిల సడచుట, శీలవ్రతము శమదమములు, వీర్య - బల - ధ్యాన - ప్రజ్ఞలు, కల్పకోటి నియుతసంఖ్యము లై సేవింపఁబడుచున్నవి. ఇది తలంపుము.

4. సాటి లేనికీర్తి కలవాఁడా! బుద్ధనియుతములు పూజింపఁబడినవి. అన్నింటియెడఁ గరుణ కలవాఁడవై కాలమును గమనింపుము. దీనిని తలంపుము. ఉపేక్షింపకుము.

5. ఓ మ్యతివిధజ్ఞుఁడా! సౌమ్య. సౌమ్య. దేవాసురనాగ యక్షగంధర్వులు పెక్కుఁరు జరామరణ క్లేశములను నశింపఁజేయు విరజనాతురతతోఁ జూచుచున్నారు.

6. కల్పసహస్రములు భోగముల ననుభవించినను, సముద్రమునందు నీటికైవలె తృప్తి యుండదు. ఓ మదనా! మంచివాఁడవు కమ్ము. ప్రజ్ఞాతృప్తుఁడవై చిరకాలము దప్పిచేఁ బాధపడుచున్న జనసమూహమును తృప్తిని పొందించుము.

7. మఱియు, అనింద్యత మగుయశస్సు కల నీవు ధర్మాభిరతియందు దాంతుఁడవై, శరీరమునందాసక్తిని విడిచి, నిర్మలదృష్టి కలవాఁడవై దేవతలతోఁ గూడినలోకముపై దయ చూపుము.

8. మఱియు, దేవయుతు లగులోకు లందఱును ధర్మమును విన్నమాత్రమునఁ దృప్తిని పొందరు. రక్షణ పొందియే తృప్తు లగుదురు. కావున వారి యనపాయసంఘల నపేక్షింపుము.

9. నిర్మలదృష్టి కలవాఁడా! లోకమున దశదిశలందును నీవు బుద్ధులను చూచుచున్నావు. వారివలన ధర్మమును లోకమున వివరింపుము.

10. మఱియు, సంపదలతో వెలయుతుషిత భవనము నీ పుణ్యసంపదచే శోభించును. మఱియు దయాయుత మగుమనస్సుకలవాఁడా! జంబూధ్వజమున దయావర్షమును వర్షింపుము.

11. అనేక శైలదేవతలు కామధాతువు నతిక్రమించి, రూపధాతుకు లయి యున్నారు. వారు నిన్ను కొనియాడుచున్నారు. సిద్ధవ్రతుఁడవయి బోధిని స్పృశింపుము.

12. నిహత మైనమారకర్మ కలవాఁడా! ఇతరు లగుకుతీర్థిక సాధులు నీచే జయింపఁబడిరి. ఎవరివలన సకలగతులను తెలిసికొందువు? ఈ కాలము నుపేక్షింపకుము.

13. ఓ. వీరుఁడా! క్లేశము లనునగ్నిచే బాగుగా తప్త మైనలోకమునందు నీవు మేఘమువలె వ్యాపించి, అమృతవర్షము నభివర్షింపుము. నరులయొక్కయు, దేవతలయొక్కయు క్లేశములను శాంతింపఁజేయుము.

14. నీవు వైద్యధాతుకుశలుఁడవు. సత్యవంతుఁడవు. నిజమైనవైద్యుఁడవు. మువ్విధము లగు రోగనాశకయోగములచే శీఘ్రముగా నిర్వాణసుఖములను కల్గింపుము.

15. సింహగర్జనము వినినంతసేపు నక్కలు నిర్భీకములు లయి యఱచుచుండును. నీవు బుద్ధసింహగర్జన నొనర్చి పరు లగుతీర్థికశృగాలములను భయపడఁజేయుము.

16. ధరణీమండలమునందు ప్రజ్ఞ యను గొప్ప దీపము హస్తమునందుఁ గలవాఁడా! బలవీర్యములతోఁ బ్రకాశించువాఁడా! కరతలమున ధరణిని కొట్టి మారుని జయింపుము (?)

17. బ్రహ్మేంద్రాదులతోఁ గూడిన నలుగురు లోకపాలురును నిన్ను నిరీక్షించుచున్నారు. నీకు పాత్రము నీయఁగలరు. జాతుఁడ వైన నిన్ను గ్రహింపఁగలరు.

18. గొప్పకీర్తి కలవాఁడా! రత్నమువంటి కులమున నుద్భవించినవాఁడా! కులీనుఁడా! బాగుగా నవలోకింపుము. ఓ సుమతీ! అచట నుండి బోధిసత్త్వుని చరిత్రమును దర్శింపఁగలవు.

19. మణిరత్నమున్న యీ భాజనమునందు సంపదలు వెలయుచుండును. విమల మైనబుద్ధి కలవాఁడా! నీవు జంబుధ్వజమునందు మణిరత్నవర్షమును వర్షింపుము.

20. ఈ విధముగా బహుప్రకారము లైన సంగీతిధ్వనులతోఁ గూడినగాథలు వెలసినవి. అది దయామానసుని ప్రోత్సహించుచున్నవి. ఇదియే సరి యైనకాలము. దీని నుపేక్షింప రాదు. (సశేషము)

# పాలీ భాషా వాఙ్మయాలు

శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారు

ప్రాచీనార్యులు హిందూదేశమునకు వచ్చి స్థిరపడినతరువాత వారి భాషయొక్క పరిణామచరిత్రను పరిశీలించినచో దానిని మూడు యుగములుగ విభజింపవచ్చునని తెలియుచున్నది. మొదటిది ప్రాచీనార్యభాషా యుగము, రెండవది మధ్యార్యభాషా యుగము, మూడవది ఆధునికార్యభాషాయుగము అని పేర్కొనవచ్చును. ఈ యుగభేదములు ఆర్యభాషలలో కాలక్రమమున ధ్వని సంప్రదాయములలోను, వ్యాకరణ రీతులలోను గలిగిన మార్పులను బట్టి యేర్పడుచున్నవి. మొదటి యుగమునకు సంస్కృతము, రెండవయుగమునకు ప్రాకృతములు, మూడవ యుగమునకు ఆధునికార్యభాష లగు హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ మొదలగు భాషలు నిదర్శనములు. పాలీ వీటిలో మధ్యయుగమునకు చెందిన ఒక ప్రాకృతభాషాభేదము.

హిందార్యు లీ దేశమునకు వచ్చినప్పుడు వారు ఋగ్వేదమునకు మూలమైన వైదిక సంస్కృతమును వ్యవహరించుచుండెడివారు. ఆనాటికే వారి భాషలో కొన్ని అవాంతర భేదము లేర్పడి యుండెనని ఆధునికవిమర్శకుల యభిప్రాయము. ఋగ్వేదభాష కొంత పరిణామమును పొంది లౌకిక సంస్కృతముగా నేర్పడినది. పాణిని కాత్యాయన పతంజలు లీభాషకు లక్షణ మేర్పరచిన తరువాత కొంత కాలమున కిది గ్రాంథికభాషగా స్థిరపడి పోయెను. ఇతర వైదిక మాండలికభాషలు సంస్కృతముకంటె విశేషతర పరిణామమునకు లోనై ప్రాకృతభాషలుగా మారినవి. లౌకిక సంస్కృతము ప్రాచీనార్యభాషావస్థయందే యుండగా ప్రాకృతభాషలు మధ్యార్యభాషావస్థను చెందుచున్నవి.

ప్రాచీనార్యభాషలు మధ్యార్యభాషలుగ మారుటలో అనార్యభాషాసంపర్కము కూడ ఎక్కువ పని చేసిన దనుటకు సందేహము లేదు, ఆర్యులు హిందూదేశ వాయవ్యదిశనుండి తూర్పువైపునకు వ్యాపించినకొలది అనార్య జనులతో సంపర్కము ఎక్కువగుచు వచ్చెను. ఋగ్వేదమే వ్రాత్యులని పిలువబడిన అవైదికార్యుల భాషలో ప్రాకృతభాషా సంప్రదాయములు హెచ్చుగా కనబడజొచ్చినవి. ప్రాకృతభాషారూపములు యజురథర్వవేదములలోను బ్రాహ్మణములలోను అక్కడక్కడ కనబడుచున్నవి. రేఫముతో కూడినశబ్దములందు మూర్ధన్యీకరణము ప్రాకృతములో సహజము: సం. గ్రంథ — ప్రా. గంఠ; సం. వృద్ధ — ప్రా. వుడ్ఢ; సం. వృద్ధి — ప్రా. వడ్ఢి. ప్రాచీనార్యభాషలోను ఇట్టి మార్పుతో కూడినరూపములు గలవు: వికట < వికృత; దండ < * దంద్ర (పోల్చి చూడుము. గ్రీకు డెంద్రోన్); √ పఠ్ < √ ప్రథ్, సంయుక్త హల్లుల సమీకరణము ప్రాకృతభాషా ప్రధాన లక్షణములలో నొకటి. ప్రాచీన కాలములో నీ ధ్వనిపరిణామమున కుదాహరణముగా మ్లేచ్ఛ (< * మ్లిచ్ఛ) మొదలగు రూపములు కలవు.

బ్రాహ్మణముల కాలము నాటికి వ్రాత్యులను వారు మగధదేశమున విస్తారముగా నుండిరి. ప్రాచ్యదేశపు జనుల యుచ్చారణ పరిపాటిని గురించి తాండ్య బ్రాహ్మణ మిట్లు చెప్పుచున్నది. 'అదురుక్తవాక్యం దురుక్తమాహుర్ ......అదీక్షితా దీక్షిత వాచం వదన్తి.' వీరి భాషతో పోల్చి చూచినప్పుడు ఉత్తర (వాయవ్య) దిశ నున్నవారిభాష ఎక్కువ పరిశుద్ధమైనదిగా తలంపబడుచుండెడిది. 'తస్మాద్ ఉదీచ్యాం దిశి ప్రజ్ఞాతతరా వాగుద్యతే, ఉదంచ ఉ ఏవ యంతి వాచం శిక్షితుం యో వా తత ఆగచ్ఛతి, తస్య వా శుశ్రూషంత ఇతి' (కౌశీతకీ బ్రాహ్మణము). ఇట్లు వైదికమాండలిక భాషలలో కాలక్రమమున స్వతస్సిద్ధము గను అనార్యభాషా సంపర్కమువలనను గల్గి

గిన మార్పుల మూలముగా ప్రాకృతభాష లేర్పడినవి. ప్రాకృతభాషా సంప్రదాయములు చాలవరకు ద్రావిడభాషాసహజలక్షణములతో సరిపోవుచుండుట మనము గమనింపదగి యున్నది.

అశోకుని శిలాశాసనములందలి భాష, హీనయాన బౌద్ధమత గ్రంథములలోని పాలిభాష ప్రాకృతభాషలలో మిక్కిలి ప్రాచీనము లైనవి. ఇందు అజ్మధ్యస్థము లైనపరుషము లింకను సరళములు కాలేదు. తరువాతి ప్రాకృతములలో పదమధ్యమం దున్నపరుషవర్ణములు నాదత్వమును బొందుటయే గాక కొంతకాలమునకు పూర్తిగ లోపించెను. పాలీభాష క్రీస్తుపూర్వము సుమారు 5 శతాబ్దములు వ్యవహారములో నుండెనని తలంపబడుచున్నది. బుద్ధుడు సామాన్యజనముల కందుబాటులో నున్న యీ వ్యావహారికభాషలోనే స్వమతమును బోధించెను. ప్రాచీన దక్షిణ బౌద్ధమత గ్రంథములయం దీ భాషకు మాగధ యనుపేరు కానవచ్చుచున్నది.

పాలీ శబ్దమునకు పంక్తి యని యర్థము. దక్షిణమం దుండుబౌద్ధులు తమ పవిత్రమత గ్రంథములకు పాలీ యని పేరిడిరి. ఈ సంజ్ఞ మొదట వారి వేదములకే వర్తించి కొంతకాలమునకు తరువాత వ్యాఖ్యానగ్రంథములకు కూడ వ్యాపించెను. ఇప్పుడు భాషాపరముగా వాడబడుచున్నది.

ప్రాచీనార్యభాషనుండి పాలీ ఎట్టి మార్పులను పొంది రూపొందినదో ఈ క్రింద తెలుపబడినలక్షణములను బట్టి గ్రహింపవచ్చును.

అచ్చులు :

1. ప్రాచీనార్యభాషలోని ఋకారము, ఐ ఔలు ఇందు లోపించినవి. ఋ సాధారణముగ అకారముగ (కొన్ని పదములలో ఇ ఉ లు గను) మారినది. ఈ మార్పు తరువాతి ప్రాకృతములలోవలె పదమధ్యమందే గాక పదాదిని కూడ గాననగును. సంస్కృత ఋక్ష శబ్దము పాలీలో అచ్ఛ అయినది. వృక వక అయినది.

2. ఐ, ఔలు, అయ, అవలుకూడ ఏ ఓ లుగా మారినవి. సం. జయతి పా. జేతి; సం. * త్రయదశ - పా. తేరస,

3. సంయుక్తాక్షరములు, ద్విత్వాక్షరములు, అనుస్వారము, వీటికి ముం దున్న దీర్ఘాచ్చులు హ్రస్వత్వమును బొందినవి. సం. కాంతామ్ - పా. కంతమ్. ఈ మార్పుచేత సం. చంద్రః, చాంద్రః అను రెండు భిన్నపదములును పొందుటచే అందలి అర్థభేదమును గుర్తించుట కవకాశము పోయినది.

4. ఒకప్పుడు సంయుక్తాక్షరమునకు ముందున్న హ్రస్వాచ్చు దీర్ఘత్వము నొంది సంయుక్తవర్ణములో నొకదానిని లోపింపజేయును. సం. సర్షప > పా. సస్సప > సాసప; సం. దంష్ట్రా > పా. దఠ > దాఠ; సం. వింశతి > పా. వీసతి, సం. సింహః > పా. సీహో.

హల్లులు :

5. ఇతర ప్రాకృత భాషలలోకంటె పాలీలో ప్రాచీనార్య భాషలోని హల్వర్ణములు ఎక్కువగా నిలిచియున్నవి. అసంయుక్తము లగుహల్వర్ణములకు మార్పు రాలేదు. పాలీ, ప్రాకృతములలో పదాంత హల్లులు జారిపోయినవి.

6. శషసలు మూడింటిలోను ఒక్క సకారము నిలిచినది.

7. అజ్మధ్యస్థము లైన డఢలు ళళ్హలుగా మారెను. సం. ఆపీడా - పా. ఆవేళా; సం. మీఢ - పా. మీళ్హ.

8. అక్కడక్కడ పరుషములకు సరళములు వచ్చుట. అల్పప్రాణములకు మహాప్రాణములు వచ్చుటయుకూడ కలదు. సం. మృదంగ- పా. ముతింగ; సం. సుకుమార-పా. సుఖుమాల; సం. కుబ్జ-పా. ఖుజ్జ.

9. సంయుక్త హల్లులు అనేక విధములుగా మార్పుపాటు నొందినవి. సాధారణముగా పూర్వపు హల్లు పరహల్లుతో పెనయుచుండును. సం. సప్త-పా. సత్త; సం. దుగ్ధమ్- పా. దుద్ధ.

యరలవస కారములు వెనుకటి హల్లుతోకాని ముందటి హల్లుతోగాని సమీకరణము పొందును. సం. అర్కః - పా. అక్కో; సం. అగ్నిః - పా. అగ్గి.

సంయుక్తాక్షరములలో సకార మున్నప్పుడది హకారముగా మారుచుండును. సం. అస్తి.పా.

అత్థి ; సం. వత్స - పా. వచ్ఛో ; సం. అక్షి - పా. అచ్ఛి.

సంయుక్త వర్ణము లీ విధముగా సవర్ణీకరణము పొందుట పరిపాటియైనను కొన్ని తత్సమ శబ్దములలో స్వరభక్తిచే సంయుక్తములు విడగొట్టబడుచున్నవి. స్వరభక్తి మూలముగా సంయుక్తముల నడుమ సాధారణముగా ఇకారము, క్వాచిత్కముగా అకారము కాని ఉకారము కాని చేర్చబడు చుండును. సం. గర్హతి - పా. గరహతి; సం. ప్రాప్నోతి - పా. పాపునాతి.

**నామవిభక్తి :**

10. పాలీలో ద్వివచనము అంతరించినది.

11. సంస్కృతములోవలె ఇందును లింగము శబ్దగతము. స్త్రీ పుం నపుంసక లింగములు మూడును కలవు. కాని యీ లింగ వివక్షు పట్టు తప్పుచున్నట్లు స్పష్టము. ఉదా. సఖినో తీణిజనియో అని ఒక ప్రాచీన గ్రంథమున కలదు. ఇందు తిస్సో (< తిస్రః) అని వాడుటకు బదులు 'తీణి' అను నపుంసకలింగశబ్దము వాడబడినది.

12. చతుర్థీ విభక్తి స్థానమున షష్ఠీవిభక్తి వాడుకలోనికి వచ్చినది.

13. వైదికభాషలో 'అసస్' ప్రత్యయముతో కూడిన ప్రథమా బహువచన రూప మిందు గానవచ్చుచున్నది. ఉదా. దేవాసః.

14. వైదికభాషలోని తృతీయైకవచన 'ఆ' ప్రత్యయ మిందును గలదు. ఉదా. ధమ్మేన, ధమ్మా.

15. సప్తమీ విభక్తిలో ప్రాచీన మగు 'స్మిన్' ప్రత్యయము వాడుకలో నుండెను. ఇది ప్రాకృతములలో 'మ్మి, మ్హి, స్సిమ్' అను రూపములను పొందినది. స్సిమ్ రూపము కూడ పాలీలో నున్నది.

16. పాలీలో ధ్వనులయందు గలిగిన మార్పుల మూలముగా చాలవరకు విభక్తి ప్రత్యయములు ఏకరూపతను పొందినవి. దీని కుదాహరణముగా అకారాంత స్త్రీలింగ కఞ్ఞా (= కన్యా) శబ్దమును గ్రహింపవచ్చును. ఈ శబ్దము తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమీ విభక్తులందు కఞ్ఞాయ అను ఒక్క రూపమే వాడబడుచున్నది.

**క్రియావిభక్తి :**

17. ఆత్మనేపదము క్రమముగా లోపించుచుండెను. వైదికభాషలోని ఆత్మనేపద - ప్రథమ పురుష బహువచన ప్రత్యయ మగు 'అరే' అనునది కొన్నిచోట్ల పాలీలో గనబడుచున్నది. పా. లభరే (= సం. లభంతే)

18. ప్రాచీనార్య భాషలోని లేట్ రూపము కూడ పాలీలో కొంతకాలము నిలిచియుండెను. ప్రాకృతములలో నిది పూర్తిగ లోపించెను.

19. సంస్కృతములోని లిట్ రూపము వ్యవహారమునుండి తొలగిపోయెను. మిగిలిన భూతకాలికము లగు లఙ్ లుఙ్ రూపములు రెండును కలిసి పోయినవి.

20. క్రియారూపములకు బదులు క్తాంత రూపముల వాడుక బహుళ మయ్యెను.

21. వైదికభాషలోని కృదంత నామము యొక్క చతుర్థ్యేక వచనరూపమే ఈ భాషలో తుమున్నంత రూపముగా వాడబడుచున్నది. పా. దస్సనాయే = సం. ద్రష్టుమ్.

**పాలీవాఙ్మయము :**

బుద్ధనిర్వాణానంతరము కొంతకాలము గడచినపిదప అతని శిష్యపరంపరలో గలిగిన అభిప్రాయభేదములనుబట్టి బౌద్ధమతము రెండు శాఖలుగా నేర్పడినది. అందొకటి మహాయాన మనునది. ఇది నేపాలు, టిబెత్తు, చైనా మొదలగు దేశములందు వ్యాప్తిగాంచినది. రెండవది హీనయానము. ఇది దక్షిణమున సింహళము, బర్మా, సయాము మొదలగుదేశముల వ్యాప్తిగాంచుటచే నిది దక్షిణబౌద్ధ మని పేరు గాంచినది. మహాయానమునకు చెందిన గ్రంథములు సంస్కృతములో వ్రాయబడగా ఈ దక్షిణబౌద్ధమునకు చెందిన గ్రంథజాలమంతయు పాలీభాషలో వ్రాయబడుట తటస్థించినది.

పాలీవాఙ్మయములో ప్రాచీనభాగములు- బౌద్ధమతధర్మములను తెలుపు గ్రంథములను తిపిటకము = (త్రిపిటకము) లందురు. వానిని బౌద్ధవేదము లనవచ్చును. త్రిపిటకము అనగా మూడుగంపలని యర్థము. అవి వినయ పిటకము, సుత్తపిటకము, అభిధమ్మ పిటకము అనునవి. బుద్ధుని తరువాత రాజగృహములో

జరిగిన మొదటి బౌద్ధమతసభలో ఈ బౌద్ధధర్మ గ్రంథముల రచన జరిగినదని చెప్పుదురు. మరల నూరుసంవత్సరములకు తరువాత వైశాలీపట్టణములో జరిగినరెండవసభలో ఇవి విస్తృతము లయ్యెను. అశోకుని ఆధిపత్యమున జరిగిన మూడవ మతసభలో త్రిపిటకములు సరిగా దిద్దబడి వాని స్వరూపమును గూర్చిన తుదినిర్ణయము చేయబడెను. ముఖ్యముగా ఈ సభలో అభిధమ్మ పిటకముయొక్క స్వరూపము నిరూపింపబడినట్లు తెలియుచున్నది. ఇందులో బుద్ధుని బోధనలను గురించిన తప్పు అభిప్రాయములు కొన్ని తొలగింపబడినవి. మరియు విదేశములకు బౌద్ధప్రచారకులను పంపవలసిన దనుతీర్మానము కూడ ఇందే చేయబడినది. ఈ తీర్మానము ననుసరించియే అశోకుని కుమారుడగు మిహిందు డనువాతడు బౌద్ధధర్మప్రచారమునకై సింహళదేశమున కేగెను.

బుద్ధభగవానుని అభిభాషణములు, అతనిని గూర్చిన కథలు, ధర్మనియమములు, వానిని గూర్చిన వ్యాఖ్యానములు ఇవన్నియు త్రిపిటకములలో ప్రోగు చేయబడి యున్నవి. వినయపిటకము బౌద్ధమతగురువుల నియమములను గూర్చియు, సుత్తపిటకము బుద్ధుని యుపదేశములను గూర్చియు, అభిధమ్మము బౌద్ధవేదాంతమునుగూర్చియు తెలుపును.

**వినయపిటకము :**

బౌద్ధసన్యాసుల ఆశ్రమధర్మములను, నియమములను వివరించును. సంఘములో క్రొత్తవారిని చేర్చుకొనువిధానము, ఆయాకాలము లందు చేసినపాపములను ఒప్పుకొనుట, వైద్యసహాయముచేయుపద్ధతులు, వారిలో వారిక వివాదములు, వైషమ్యములు గలిగినప్పుడు ఆనరింపవలసినరీతులను గురించియు ఇందు వివరింపబడి యున్నది.

**సుత్తపిటకము :**

బౌద్ధవేదములలో సుత్తపిటకము చాల ముఖ్యమైనది. బుద్ధబోధనలను తెలిసికొనుటకీ గ్రంథము చాల ఉపకరించును. ఇందు 5 భాగము లున్నవి. వీనికి దీఘనికాయము, మజ్ఝిమనికాయము, సంయుత్తనికాయము, అంగుత్తనికాయము, ఖుద్దకనికాయము అని పేర్లు. నికాయము లనుటకు బదులు ఆగమము లనుపేరులో (దీఘాగమము...అని) కూడ వీనిని వ్యవహరింతు రట! ఈ అలవాటు ఉత్తర బౌద్ధశాస్త్రయమున ఎక్కువగా కలదు. సుత్తపిటకము మొదటి నాలుగుభాగములు బుద్ధ ప్రవచనములతోను, అతని శిష్యుల అభిభాషణములతోను, వాదములతోను కూడి యున్నవి. రచన చాలవరకు గద్యములో నున్నది. అచ్చటచ్చట పద్యరచనయు గలదు. దీఘనికాయములోని 16 వ సూత్రమునకు మహాపరినిర్వాణ సూత్ర మని పేరు. ఇందు బుద్ధదేవుని అంత్యదినములలో జరిగినవిషయముల వర్ణన గలదు. సంయుత్తనికాయములో ముఖ్యమైనది ధర్మచక్ర ప్రవర్తన సూత్రము. ఇందు బుద్ధుని ప్రథమ ధర్మోపన్యాసము గలదు. సుత్తపిటకముయొక్క 5 వ భాగ మగు ఖుద్దక నికాయములో ఈ గ్రంథములు ప్రధానమైనవి.

1. ఖుద్దకపాఠము. ప్రతిదినము బౌద్ధులు చేయుప్రార్థనలతో కూడినది. 2. ధమ్మపదము.

ఇది 423 ధర్మోపదేశకము లగుపద్యముల సంకలన గ్రంథము. ఇందు సగము పైగా పద్యములు బౌద్ధవేదములలోనివే. ఇవి గాక దేశమున వ్యాప్తి గాంచియున్న మరికొన్ని పద్యములు కూడ నిందు చేర్చబడి యున్నవి. 3. ఉదానగ్రంథము. బుద్ధుని అభిభాషణము లిందు పద్యరూపమున నున్నవి. 4. ఇతివుత్తక. బుద్ధుడు చెప్పిన నీతిసూక్తు లిందు గలవు. 5. సుత్తనిపాత. ఇందలి ఐదు భాగములలో పారాయణ వగ్గ మనునది ఒకటి. ఈ వగ్గములో బవేరి అను నాతని పదునారుగురు శిష్యులు బుద్ధుని అడిగినప్రశ్నలు వాని కాతడు చెప్పిన ఉత్తరములు గలవు. 6. విమానవత్థు. జీవితమున నొనర్చిన సత్కార్యముయొక్క ఫలితముగా దేవతలు నివసించుస్వర్గప్రాసాదముల వైభవమును వర్ణించునది. 7. పేతవత్థు-జీవితమున నొనర్చిన పాపపరిహారార్థముగా ప్రేతములు అనుభవించు దుఃఖస్థితిని వర్ణించును. 8—9. థేరగాథలు, థేరీగాథలు-బౌద్ధ సన్యాసులు, సన్యాసినులు చెప్పిన సంకలన గ్రంథములు. 10. జాతకములు. బుద్ధుని పూర్వజన్మవృత్తాంతములను తెలుపుకథ లిందు గలవు. ఇవి గద్యపద్యాత్మకములు. వీనిలో

పద్యభాగములు గద్యభాగములకంటె మాత్ర సంప్రదాయము కలవి.

ఇవి గాక ఖుద్దక నికాయములో బుద్ధుని పూర్వజన్మకథలను వర్ణించు మరికొన్ని భాగములు కలవు.

అభిధమ్మపిటకము :

ఇందు ధర్మవివరణమే గాని వేదాంత తత్త్వమేమియు గానరాదు. ఇందు నీతి, మనస్తత్వము, జ్ఞానస్వరూపము మొదలగు వివిధ విషయముల వివరణలు గలవు. రచన శాస్త్రపద్ధతిని నడచినది. అభిధమ్మమునకు బర్మాదేశమున నెక్కువ గౌరవప్రచారములు కలవు.

బౌద్ధధర్మములను బోధించు గ్రంథములకు కాలక్రమమున ననేకము లగువ్యాఖ్యానములు బయలు దేరినవి. మహేంద్రుడు క్రీస్తుకు ముందు 307 వ సంవత్సరములో సింహళమునకు బోయినప్పుడు పిటకములనే గాక వానికి వ్యాఖ్యానమగు 'అట్ఠకథ' యనుగ్రంథమును కూడ తీసికొని వచ్చెను. సింహళములో బుద్ధఘోషుడు రచించిన వ్యాఖ్యానములు దీపవంశము మొదలగు చారిత్రిక గ్రంథములు దీనిపైనే ఆధారపడి రచింపబడినట్లు తెలియుచున్నది.

బుద్ధఘోషుడు క్రీ. శ. 5 వ శతాబ్దములో నుండిన ప్రసిద్ధ వ్యాఖ్యానకర్త. అతనికి పూర్వము సింహళములో వ్యాప్తి గాంచియుండిన పాలీగ్రంథములలో నెత్తిప్పకరణము, పెటకోపదేశము అనునవి ముఖ్యములు. బౌద్ధధర్మమును తెలిసికొనుట కవి మార్గోపదేశికలు. వీనిని బుద్ధుని శిష్యులలో నొకడగుమహాకచ్చాయనుడు రచించినట్లు చెప్పుదురు.

మిళిందపన్హ అనునది మరియొక ప్రాచీన గ్రంథము. ఇది మిళిందునకును థేర నాగసేనునకు బౌద్ధధర్మములను గురించి జరిగిన సంభాషణరూపముగా రచింపబడినది. ఈ మిళిందుడు క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దాంతమున ఇండో బాక్ట్రియన్ రాజగు మినాండరని నిర్ణయింపబడినది. ఇతడు బౌద్ధధర్మమునం దాదరము కలవాడు.

బౌద్ధవేదములకు వ్యాఖ్యానము వ్రాసిన వారిలో బుద్ధఘోషుడు ప్రసిద్ధుడు. ఈతడు హిందూదేశమున బుద్ధగయ సమీపములో బ్రాహ్మణవంశమున జన్మించెను. క్రీ. శ. 413 ప్రాంతమున సింహళమును పరిపాలించిన మహానాము డను రాజు కాలములో నితడు సింహళమునకు వచ్చెను. అచ్చట బౌద్ధమతమును స్వీకరించి యనేక గ్రంథములను వ్రాసెను. అనూరాధపురములోని మహావిహారములో నివసించుచు అక్కడనుండియే తన ప్రసిద్ధగ్రంథము విసుద్ధి మగ్గము, జాతక కథలపై వ్యాఖ్యానములు రచించెను. బుద్ధఘోషునితో పాటు చెప్పదగిన ప్రసిద్ధవ్యాఖ్యాతలు బుద్ధదత్తుడు, ఆనందుడు, ధమ్మపాలుడు. వీరందరు ఇంచుమించు సమకాలికులు. ఇంకను వీరిశిష్యులలో వ్యాఖ్యానములను రచించినవా రనేకులు కలరు.

పండ్రెండవ శతాబ్దము మొదటి పరాక్రమబాహు కాలములో సింహళమున మరల గొప్ప సాహిత్యసంచలనము గలిగినది. ఈమహారాజు ఆధిపత్యమున అట్ఠకథలకు వ్యాఖ్యానములు వ్రాయించుటకై మహాకస్సపుడనువాని ఒక మహాసభను సమావేశపరచెను. దీనిమూలముగా నీకాలమున టీకారచనమునకు విశేషప్రోత్సాహము కలిగినది. టీకాగ్రంథముల నీకాలమున రచించినవారిలో సారిపుత్తుడు, నాతని శిష్యులు ప్రధానులు. సారిపుత్తుని శిష్యులు మతచరిత్రనుగూర్చియు దాఠావంశము, థూపవంశమువంటి గ్రంథములను వ్రాసిరి.

పదునేనవ శతాబ్దమునుండి బర్మాదేశమునందలి బౌద్ధసన్యాసుల రచనలు ప్రాముఖ్యము జెందినవి. వారు ప్రధానముగా అభిధమ్మమును గూర్చి పరిశ్రమ చేసిరి. నరపతి రాజుకాలము (1442-68) నం దుండిన అరియవంస అను నాతడు అభిధమ్మత్థవి భావనీ అను నొక టీకయు, జాతకకథలను గూర్చి జాతక విశోధన మనుగ్రంథమును రచించెను.

పదునారవ శతాబ్దమున వగిరు ధమ్మసత్తమను తెలాంగ్ భాషలో నున్నగ్రంథము మనుసార మనుపేర పాలీలోని కనువదింపబడెను. వగిరు ధమ్మసత్తము 13 వ శతాబ్దమున అంతకు పూర్వము ధమ్మవిలాసుడు వ్రాసిన గ్రంథముపై ఆధారపడి రచింపబడినట్లు తెలియుచున్నది. మనుసారము బర్మాదేశమున న్యాయశాస్త్రమునకు మూలాధారమైనగ్రంథము.

చరిత్రగ్రంథములు: సింహళదేశ చరిత్ర గ్రంథములలో ప్రధానమైనవి దీపవంశము, మహావంశము అనునవి. మొదటిది బుద్ధఘోషునికి పూర్వము రచింపబడెను. ఇది క్రీ. శ. 325-352 మధ్య పాలించిన మహాసేనుని రాజ్యకాలముపరకు గల చరిత్రను చెప్పుచున్నది. మహావంశమును మహానామ డనువాడు రచించెను. ఇందు చాలవరకు దీపవంశములోని కథా విషయములే పద్యరూపమున వర్ణింపబడినవి.

బర్మా సింహళదేశములలో మతగ్రంథములే గాక పాలీభాషకు సంబంధించిన లక్షణ గ్రంథము లనేకములు రచింపబడినవి.

పాలీభాషయొక్క లక్షణ గ్రంథముల చరిత్ర మహాకచ్చాయను డనువాని కాలము నుండి ప్రారంభ మగును. అతడే ఈభాషకు ప్రథమ వ్యాకరణకర్త. ఈ కచ్చాయనుడు బుద్ధుని ముఖ్యశిష్యులలో నొకడగు కచ్చాయనుడే నని చెప్పుదురు గాని ఆధునిక పండితులు దానిని వాస్తవముగా నెంచరు. ఈతడు 5 వ శతాబ్దములో నున్న బుద్ధఘోషునికి తరువాతి వాడని తలంచుచున్నారు.

పాలీ వ్యాకరణమునకు మూడు భిన్న శాఖలు కలవు. వానికి కచ్చాయన, మొగ్గల్లాన, సద్దనీతి యనువ్యాకరణమును వ్రాసిన అగ్గవంస అనువారు మూలపురుషులు. మొదటిశాఖ హిందూదేశమున పుట్టినను సింహళమున కాతంత్ర వ్యాకరణసంప్రదాయము ననుసరించి వర్ధిల్లినది. రెండవది పాణిని, చంద్ర, కాత్యాయనుల వ్యాకరణ పద్ధతుల ననుసరించి సింహళములోనే బయలుదేరినది. మూడవశాఖ బర్మాదేశమున వృద్ధి నొందినది. వీనిలో కచ్చాయనుని అనుసరించినశాఖయే ప్రాచీనము. మిగిలిన రెండింటిలో సద్దనీతి శాఖ మొగ్గల్లాన శాఖకంటె ప్రాచీనము. ఈమూడు శాఖలలోను అనేకము లైనగ్రంథములు వ్యాకరణ ఛ్ఛందోలంకారములకు సంబంధించినవి కలవు. ఈ గ్రంథజాల మంతయు ఇంకను ప్రకటితము కాలేదు. పోయినవి పోగా తక్కినవి కొంత వరకు సిలోను బర్మా దేశములలో ప్రకటింపబడినవి. ప్రకటితము లైనగ్రంథములలో ప్రధానము లైనవి కొన్ని క్రింద సూచింపబడుచున్నవి.

కచ్చాయనగంధ లేక కచ్చాయన వ్యాకరణము. జంబూద్వీప నివాసి యగుకచ్చాయనుడు వ్రాసినది. ఇందు 8 భాగములు గలవు. అందొక్కొక్కభాగములోను సూత్రము, వృత్తి, ప్రయోగము, న్యాసము అనుప్రకరణములు గలవు. కచ్చాయనభేద మనుగ్రంథమునుబట్టి దీనిలో సూత్రభాగము కచ్చాయనుడు, వృత్తి సంఘనంది, ప్రయోగము బ్రహ్మదత్తుడు, న్యాసము విమలబుద్ధి అనువారు రచించినట్లు తెలియుచున్నది. కచ్చాయనుని సూత్రములు శర్వవర్మ కాతంత్రము, పాణినీయవ్యాకరణము ననుసరించి యున్నవి.

కచ్చాయన భేదము లేక కచ్చాయన భేద దీపికా పైవ్యాకరణమున కొక ముఖ్య మైన వ్యాఖ్యానగ్రంథము. ఇది ధర్మానందకృత మని గంధవంశమున కలదు. కాని కొందరు 14 వ శతాబ్దములో మహాయసు డనునాతడు దీనిని రచించెనని తలంతురు. కచ్చాయన భేద మహాటీకా, సారత్థవికాసినీ అని యీగ్రంథమునకు రెండు టీకలు గలవు.

మొగ్గల్లాన వ్యాకరణము: సింహళమున థేరమొగ్గల్లానునిచే రచితము. దీనికి సద్దలక్ఖణ మని పేరు. కచ్చాయన వ్యాకరణము కంటె కొంత భిన్నస్వరూపము గలది. ధాతువర్గీకరణ విషయమునను, వ్యాకరణ సంజ్ఞల విషయమునను కచ్చాయన వ్యాకరణముకంటె ప్రశస్త మైనది. మొగ్గల్లానుడు 12 వ శతాబ్ది రెండవ భాగమున అనూరాధ పురములో నివసించి యుండెను.

పయోగసిద్ధి - మొగ్గల్లానుని శాఖకు జెందిన వ్యాకరణములలో గొప్పది. సమగ్ర మైనది. దీనిని సింహళదేశీయు డగు మేధంకరుడు 13 వ శతాబ్దములో రచించెను.

పదసాధన- మొగ్గల్లానుని వ్యాకరణమునకు సంగ్రహరచన. ఇందు శబ్దము, సంధి, సమాసము, క్రియ, ఉపసర్గలు, పరసర్గలు అను విషయములను వివరించు ఆరు ప్రకరణములు గలవు. ఇదియు సింహళమున రచింపబడెను. మొగ్గల్లానుని శిష్యు డగుపియదస్సి 12 వ శతాబ్దములో రచించెను.

సద్దనీతి: బర్మాదేశములలో రచింపబడిన వ్యాకరణ గ్రంథములలో నిది మిక్కిలి ప్రధాన మైనది. క్రీ. శ. 1154 లో అగ్గవంసుడు దీనిని 'రచించెను. ఇత డా కాలమున నరపతి సిథు డనుబర్మారాజునకు మతబోధకుడు గా

# ఆంధ్రవాఙ్మయంలో బౌద్ధసాహిత్యం

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

—: ० :—

ఆంధ్రదేశములో మతసంస్కారములు, వాని పరిణామములు అవగాహన చేసికొనుటకు, తెలుగుభాషయొక్క పుట్టుపూర్వోత్తరాలు తెలిసికొనుటకు బౌద్ధమతగ్రంథాలే ఆధారాలుగా నున్నవి. మతాలకీ, భాషాపరిణామాలకి అవినాభావ సంబంధమున్న దనీ, భిన్నభిన్నమత సంప్రదాయాలు, ప్రవర్తిల్లే సమయములో భాషాపరిపాటి ఆయామత సంప్రదాయాల సాంకేతికతనుబట్టి, ప్రభావాన్నిబట్టి మార్పు చెంది, నూతనపదాలంతో పరిపుష్టమవుతుం దని మన పరిశోధకు లింకను గుర్తింపలేదు. వేదమతంతోపాటు వైదిక సంస్కృతము. బౌద్ధమతంతోపాటు పాళీభాష తెనుగుభాషలో అతిప్రాచీనకాలమునందే ప్రవేశించి దాని పరిణామానికి తోడ్పడినవి.

ఆంధ్ర అట్టకథ :—

ప్రస్తుతము మనకు కావలసినది బౌద్ధవాఙ్మయము. ఈ వాఙ్మయములోనే మనకు తెలుగునకు పాళీభాషకును గలసంబంధం తెలియుడమున కవకాశ మున్నది.

సుప్రసిద్ధ బౌద్ధపదాచార్యుడు బుద్ధఘోషుడు క్రీ. శ. 5 వ శతాబ్దినాటివాడు. బౌద్ధపాళీభాషావాఙ్మయములో బహుగ్రంథరచయితగా ప్రసిద్ధి కెక్కినవాడు. ఆతడు వినయపిటకమునకు వ్రాసిన 'సమంత పసాదిక' అనే వ్యాఖ్యానములో 'అంధకాట్టకథ' అను నొక గ్రంథమును పేర్కొన్నాడు. దాని మూలవాక్యము లివి. 'యంపన అంధకట్ట కథాయమ్ అపరిఖిత్తేపముఖే, అనాపత్తి, భూమియంవినా జగతీయాపముఖం సంధ్యాకథితం తోవట్టమ్ తమ్ అంధకరట్ఠే పాటేక్కమ్ సన్నివేశా ఏకచ్చదనాగభపాలీయ సంధాయవట్టమ్.'

"Yam pana Andhakatta kathayam aparikhitte pamukhe anapattibhumiyam vina jagatiya pamukham sandhyaya kathitam tovattam tam Andhaka ratthe patekkam sannivesa ekaccha dana gabhapaliya sandhaya vattaṃ" (Dictionary of Pali Proper names. Page 110).

త్రిపిటకములలో ప్రధాన మగు వినయపిటకమును వ్యాఖ్యానించుచు చెప్పిన పైసందర్భమును బట్టి చూడగా, ఆంధ్రదేశమున నాయాఘట్టములను నా దేశభాషలో వివరించుచుండిరనియు, నట్టి వివరణములకు, * ఆంధ్ర అట్ట

---

(22 వ పేజి తరువాయి)

నుండెను. సద్దనీతి పాళీభాషకొక సమగ్రమైన వ్యాకరణము. ఇందు పదమాలా, ధాతుమాలా, సుత్తమాలా అను 3 భాగములు కలవు. మొత్తము 27 అధ్యాయముల గ్రంథము.

ఛందోసారత్థ వికాసినీ - ఇది వుత్తోదయ మను ప్రసిద్ధ పాలీ ఛందోగ్రంథమునకు వ్యాఖ్యానము. దీనిని సద్ధమ్మఞాణ రచించెను. బర్మాదేశసుడు, ఇతడు కాతంత్ర వ్యాకరణమును పాళీలోనికి అనువదించెను.

సుబోధాలంకారము. ఇది ఛందోలంకారములను గూర్చిన రచన. 12 వ శతాబ్దమున సింహళీయు డగు థేరసంఘరక్షితునిచే రచింపబడెను. ఇతడే వుత్తోదయమును కూడ రచించెను.

*Bibliography.*


2. Pali language and literature by Wilbelm Geiger authorised English translation by Bata Krishna Ghose. Calcutta University Publication.

3. History of Pali literature by B.C. law.

4. A History of Indian literature. Vol, II by Winternitz

1. ప్రాకృతభాషోత్పత్తి - శ్రీ మాన్ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు, ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రకటితము.


---

* ఆంధ్రఅట్టకథనుగూర్చి - నా తెనుగుకవుల చరిత్రలో అవతారికలో దిఙ్మాత్రముగా సూచించితిని. ఈ విషయమంతయును. డాక్టరు వి. రాఘవన్‌గారి ఆంధ్ర అట్ట కథ అను వ్యాసమునుండి గైకొనబడినది. వారికి నా కృతజ్ఞత.

కథ' పేరున్నట్లును తెలియుచున్నది. మఱియు నీ అట్టకథ బౌద్ధమతమునకు స్థానమైన కాంచీపురమున సంప్రదాయానుసారముగ గ్రహించి బౌద్ధభిక్షుకులు ప్రచారము చేసిరని తెలియుచున్నది.

ఈ వ్యాఖ్యానములు క్రీస్తునకు పూర్వము 3 వ శతాబ్దినాటివి. కాబట్టి యిప్పటికి రెండువేల రెండువందలయేండ్ల క్రిందటివి. వానిలో నుదాహృతమైన ఆంధ్ర అట్టకథ అంతకు కొంచెము ముందుగా ప్రచారములోనికి వచ్చియుండవలెను.

ఇక నీయట్టకథలోని భాష యేది యను ప్రశ్న. పాళీ భాషావాఙ్మయ చరిత్రలో, 'విమలచరణలా' అనువిద్వాంసు డిట్లు వ్రాసియున్నాడు.

**"Presumably it (the Andhakatta katha) was written in some native dialect of the Deccan."**

ఆంధ్ర అట్టకథ దక్కనులోని యొక స్థానిక దేశభాషాభేదములో రచితమై యుండునని యూహింపదగియున్నది.

ఓల్డెన్‌బర్గ్ అను నొక పాశ్చాత్యపండితుఁడు బుద్ధుడు తన మతధర్మముల నాయా దేశభాషలలో నేర్చుకొనవలయునని శాసించియున్నాడు. కాబట్టి ఆంధ్ర అట్టకథ ఆకాలమున నాంధ్రదేశమున ప్రచారమున నున్న పాళీభాషలో వ్రాయబడియుండవచ్చునని వినయ పిటక గ్రంథావతారికయం దుల్లేఖించియున్నాడు.

టిబెట్టుదేశమందలి బౌద్ధమత సంప్రదాయ చరిత్రము ననుసరించి, థేరగాథ యనుమత గ్రంథ మంతయు, పైశాచి భాషలో వ్రాయబడియున్నదనియు నది పాళీభాషకు సన్నిహితమనియు, నదియు నొక ప్రాకృత భేదమే యనియు 'పిషెల్' అనుపండితుడు వ్రాసియున్నాడు. స్టెన్‌కొనో మొదలగు భాషావేత్తలు పై యభిప్రాయము నంగీకరించియున్నారు - వారియభిప్రాయానుసారము దీనియందలి భాష 'పైశాచీపాళీ' అని చెప్పవలెను.

కాని పై పాశ్చాత్యపండితుల యభిప్రాయములు సరి కాదని గుణాఢ్యపండితునిచే రచితమయిన బృహత్కథ నిరూపించుచున్నది. ఈ అట్టకథ క్రీ. పూ. 3 వ శతాబ్దికి కొంచెము ముందుగా రచితమైనదని మున్ను చెప్పియున్నాను. ఆ కాలమునకు అనగా క్రీ. పూ. 320 నాఁడు బృహత్కథా రచనము జరిగినది. గుణాఢ్యపండితుడు, సంస్కృత, ప్రాకృత దేశభాషలను మూడింటిని విడిచి, వానికంటె విలక్షణమగు భాషయందు రచనము చేసెదనని ప్రతిజ్ఞ చేసి పైశాచీభాషలో రచనము చేసినట్లుగ చెప్పియున్నాడు. కాబట్టి యానాటికి పైశాచి యొక ప్రాకృతభాషాభేదముగా పరిగణితము కాలేదు. పరిగణితమైనచో గుణాఢ్యపండితుని ప్రతిజ్ఞ నెఱవేరుట కవకాశమే లేదు. కాబట్టి క్రీ. పూ. 3 వ శతాబ్ది నాటి కది యొక దేశభాషాభేదమే.

కాని యిచ్చటనే పైపాశ్చాత్యపండితులును, వారి ననుసరించి తెలుగుభాషాతత్త్వవేత్తలును నొకరీతిగ నపమార్గము ననుసరించినారు. గుణాఢ్యపండితుడు స్పష్టముగా "సంస్కృత ప్రాకృత, దేశభాషలు" అని చెప్పుచున్నప్పుడు సంస్కృత ప్రాకృతములకంటె భిన్నమగు దేశభాష యొకటి యప్పటి కుండవలెనుగదా అప్పటి దేశీయులైన ప్రజల వ్యవహారములో నది యుండవలెనుగదా. ఆ దేశభాషయే తెలుగు. స్వతస్సిద్ధముగా నితర భాషాపదములను తనలో నిముడ్చుకొను భాషాతత్త్వము గలది యగుటచేత నాకాలమున ప్రచారములో నుండిన పైశాచీ, పాళీభాషాభేదములను గ్రహించి తనలో లీనము చేసికొన్నది.

పై ఆంధ్ర అట్టకథ పై సూత్రము ననుసరించి పాళీ పైశాచీపద సమ్మిళితమగు తెలుగుభాషలో వ్రాయబడి యుండెనని చెప్పవచ్చును.

పైశాచీ, పాళీభాషలు ప్రాకృతభాషాభేదములుగా నావెనుక పరిగణితములైనవి. కాని ఆ యా గ్రంథములలో పాళీకి బదులుగా జూళిక యని వ్యవహార మున్నది.

ప్రకృతే సంస్కృతా యాస్తు
ప్రాకృతీ వికృతి ర్మతా
షడ్విధా సా ప్రాకృతీ చ
శౌరసేనీ చ మాగధీ

'పైశాచీ చూళికా వై స్యా దపభ్రంశ యితి క్రమాత్.

కాని రసార్ణవసుధాకర మనునలంకార గ్రంథమున (క్రీ. శ. 14 వ శతాబ్ది) పైశాచీ చూళికా పైస్యాత్ అనుచోట స్పష్టముగా పైశాచీ పాళికా పైస్యాత్ అని పాళీభాష పేర్కొనబడినది.

ఆనాటికే యొక ప్రత్యేకదేశభాష గానున్న తెలుగు బౌద్ధమత వ్యాపన కాలమున నా మతభాష యగుపాళీభాషాసంబంధముచే బలుపు చెందిన దని నిరూపించవచ్చును. పాళీ, పైశాచీ భాషలు ప్రాకృతభాషాభేదములు గా పరిగణితమైనతరువాత, వైయాకరణులు తెలుగును ప్రాకృత భేదముగా పరిగణించిరి. సంస్కృతానుయాయులు దానిని బలపఱచిరి. ఆనాటినుండి తెలుగులో ప్రత్యేకముగా తెలుగు పుట్టుపూర్వోత్తరములగూర్చి పరిశ్రమ చేయుట కవకాశము లేక పోయినది. బౌద్ధపాళీవాఙ్మయ మాయవకాశము గల్పించినది. తెలుగు భాషా ప్రత్యేకత ప్రాచీనత తెలుపుడు చేసినది.

తెనుగుభాషలో మొదట మనకు బౌద్ధమతముతో పరిచయము గల్గించిన గ్రంథము పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర. వీరశైవమున నారాధ్యసంప్రదాయము ప్రవర్తిల్లజేసిన పండితారాధ్యుఁడు పరమత ఖండనము గావించి, యారాధ్యసంప్రదాయము నాంధ్రదేశమున సుప్రతిష్ఠితము చేసెను. ఆ సందర్భమున నాతఁ డితరమతములతోపాటు బౌద్ధమతమును ఖండించెను. కాబట్టి యాకాలము నాటికి, అనగా క్రీ. శ. 1150-1200 నాటికి బౌద్ధమతము తెలుగుదేశమున కొన యూపిరితోనైన నచ్చటచ్చటనుండె నని యంగీకరింపక తప్పదు. ఇక పండితారాధ్య చరిత్ర వాదప్రకరణము జదివినచో, బౌద్ధమతమే కొంత ప్రచారములో నున్నట్లును, జైనచార్వాకాది మతము లంతగా ప్రచారములో లేనట్లును తెలియుచున్నది. ఆప్రకరణ ప్రారంభములో,

"పండితారాధ్యుఁ డఖండితకీర్తి
సనదవోలను మహాసద్భక్తమహిమఁ
దనరార వర్తింపఁ దత్ప్రస్తవమునఁ
బండితారాధ్యులఁ బ్రభుశక్తిమహిమ
పాండిత్యమును శివభక్తి పెక్కువయు
సకలవిద్యాప్రౌఢి సర్వజ్ఞతయును
సుకృతిచిహ్నాదియు భావశుద్ధి చిచ్ఛుద్ధి
శీలసంపద వచస్సిద్ధియు [illegible]
జాలక చాల సహ్య[illegible]
నరపతి యగు వెలనాటి [illegible]నికి
గురుఁ డగుబౌద్ధుండు" [illegible] బౌద్ధపదాచార్యుఁడు ప్రవేశపెట్టబడిన[illegible] నాతడే తన శిష్యుఁడు వెలనాటి చ[illegible] 'వారికి మాకును వాద మిప్పింపు, వారి నోడింతు' నని పండితారాధ్యుని వాదమునకుఁ బురికొల్పెను. గురుని యాజ్ఞాప్రకారము రాజు పెద్దసభ చేయించి పండితుని బిల్వనంపెను. పండితుఁడును.

"అంకింప బ్రతికైన నధిపతికైన
యంకంబుఁ దర్కంబు నన్నుఁ బోవలయుఁ
దానఁ దప్పేమి, వోఁ దగ వగు ననుచు"

లింగార్చన గావించి, జంగమాశీర్వాదములు గైకొని దోసమరాజయ్య మొదలగు శిష్యులు వెంట రాగా సభాస్థలికి వచ్చెను. బౌద్ధాచార్యునికి పండితునికి వాదము ప్రారంభ మయ్యెను. పండితుడు మొదలు వేదవాదమును, కర్మవాదమును, కాలవాదమును, ఆవెనుక వేదాంతమతమును, సాంఖ్యవాదమును, యోగవాదమును, చార్వాకవాదమును, పాంచరాత్ర వాదమును, క్రమముగా, సోపపత్తికముగా ఖండించి యాపైబౌద్ధగురువునుచూచియిట్లు వాదింపసాగెను.

పురము లేర్చెడునాఁడు పురహరునాజ్ఞ
హరియు సాక్షాద్బుద్ధుఁడై యుండెఁ గాన
జలజనాభుని దశజన్మంబులందు
నిల బౌద్ధజన్మంబు గలుగును గాన
తగఁ గూర్మవామనదాసులు గలుగ
నొగి బుద్ధదాసి లేకుండఁడు గాన
సరి శ్రుతిబాహ్యంబు జైనబౌద్ధంబు
నరయఁ గించిద్భేద మంతియ కాన
వెండి బౌద్ధుఁడు వైష్ణవుండుమఱి వైష్ణ
వుండు బౌద్ధుండు గావున, వేయు నేల
బౌద్ధుండ వినుము నీ బౌద్ధంబు, శ్రుతివి
రుద్ధంబు, భవపాశబద్ధంబు, భువి ని
షిద్ధంబు, దుఃఖసమృద్ధంబు, పాప
బద్ధంబు మున్న యబద్ధ మెట్లనిన
కొఱలు మనోమయకోశంబులోన
మఱి తోఁచువిజ్ఞానమయకోశ మదియు
బుద్ధి దా క్షణికంబు పొరిపొరిఁ బూర్వ
బుద్ధియం దవగతిఁ బొందించుజీవ
సంతతివోలెను జను నుత్తరోత్త

రాంతరబుద్ధి దా న ట్లుదయింప
నరయ సంతతిరూప మై తోఁచుబుద్ధి
సరి నాత్మ యీబుద్ధి సంతతియందుఁ
దులఁ కాదు క్షణికచతుర్విధభావ
నల నొకానొక్క జ్ఞానంబు సంధిల్లు
క్షణము విను కసంగత మగునేని
క్షణభంగురము మఱి కారణం బగునె
యొక్కఁ డొక్కఁ డని లెక్కించి, మీఁద
నొక్కఁ డొక్కం డను టుడిగి, రెం డనుచు
ముందట నొక్కండు, మూఁ డంచు నిట్లు
ముంద లెంచఁగ వెన్క మొగిఁ జెడునట్లు
లరుగ నదీప్రవాహము వీచు లుడుగ
భరిత మై ముందఱఁ బాఱుచున్నట్లు
వెలుఁగుడుదావాగ్ని వెనుక నారంగఁ
గలయ ముందఱఁ బొంగి కాలుచున్నట్లు
గనుగొని విరచితాత్మరూపం బీఁ జదువ
వెనుకఁ బ్రచ్ఛుతి ముందఱను జాఁగునట్లు
ఖండింపక యపూపకాయ యై, కాయ
పం డయి పండు నేర్పడ బీజ మయ్యు
బీజంబు మొలక యై పెరిగి, ముందటను
బ్రాజిల్లి వెనుక రూపము సెడునట్లు
ముందట నాత్మయు ము క్కఁ బొందంగ
నందంద వెనుకయు నడగునం టేని
వడిఁ బుట్టి నిలిచి తా నడఁగునంతటన
నడిసిన తత్ క్షణ స్థాయిత్వమునకు
క్షణవాదభంగంబు గాదె యీయుక్తి?
ప్రణుతింప నెట్టి యుక్తి? క్షణంబ
యగు వినాశకరణ మగునేని నింకఁ
జదువు లేల, స్వనాశసంగ్రస్త మైన
దతిఁ దతి నేర్చునే తా నుదయింప?
మఱి యది గార్యక్షమంబు దా నగునె?
తానును మొదలన తవిలినవిఘ్నఁ
డైనసంతతియందు నొఁ గాక, క్షణము
మోక్షంబుఁ బొందిన మును బొందుఁ గాక
లక్షింపఁ దన కగులాభ మున్నదియె!
అంచితశైవాగమాదుల మఱియుఁ
గించిద్గుణములు మిక్కిలి మీవ్రతములు
నవియు మాట లన, సత్యము సహింపయును
నివి నిజవ్రతము లం ద్రివియును లేవు
సంపి వెట్టినఁ దింద్రు, సంపఁ గా దంద్రు
సంప సహించుట సంపుట గాదె?
బొం కీశ్వరుం డంద్రు బొంకఁ గా దంద్రు
బొంకులలోఁ బెద్ద బొం కిది గాదె?
యన్ని యీశ్వరుఁడు లేఁ డంద్రు దా నేల
యెన్నంగ బుద్ధుండు నిలఁ గల్గఁ డెట్లు?
క్షణభంగురం బగుఁ గర్మంబు దానఁ
బ్రణుతింపఁ దత్కర్మఫలము వొందించు
ననుటయు బౌద్ధుల కనుమతం బగుటఁ
దనరి యీబుద్ధుండు దైవ మం టెద్ది?
సంగతి దైవంబు-శశవిషాణంబు
భంగిశూన్యం బంచు బౌద్ధాదు లాది
విరచింపఁ గాఁ జతుర్వింశతి తీర్థ
కరులు భూతాదిత్రికాలవర్తనులు
కన్న డెబ్బదివీఁద నేడ్వురు మునులు
మున్ను శూన్యధ్యానములు సేయుచునికి
శమదమానుష్ఠాన జప
యమనియమాదికాష్టాంగయోగాది
ధర్మకర్మఫలప్రదాత యెవ్వండు
నిర్మించుఁ? గ్రియలకు నిర్వాహ మెద్ది?
లిపిరి యుత్పత్తిస్థితి విలయస్థితు
వపునై దైవము శూన్య మయ్యె నేనియును
తెలియ నుత్పత్తిస్థితివిలయస్థితు
విలఁ గాని యది దైవ మెట్లును గాదు;
దలపోయ శూన్యతత్త్వము గలయదియె
దలపోయ శూన్యతత్త్వము లేనియదియె
కలదేని శూన్యంబుగా దశూన్యంబు
కలుగదేని శూన్యంబు గలుగ దె ట్లనినఁ
గలదేని శూన్య మఱి పలుకు దా బొంకు
గాన, యహింసావిహీనులు, సత్య
హీనుల్ గ్రియాఫలహీనులు, గర్మ
హీనులు నిజదైవహీనులు, పుణ్య
హీనులు నగుబౌద్ధజైనాదులకును
గలుగునే మోక్షవికస్వరసుఖము?
తలపోసి బౌద్ధ! వాదం బుద్ధ మట్టి
బౌద్ధంబు సిఱుతల బంటియు లేదు.''

పుటలు. 585-590.

బౌద్ధాచార్యుడును పండితారాధ్యుని వాద ప్రౌఢమకు నిలువజాలక యాతని "ప్రశ్నోత్తర ములకు దగిన ప్రశ్నోత్తరము లాపాదింప లేక" పండితుని ధిక్కరించి పల్కుచును సభాస్థలి వెలువడియెను. పండితుడు ప్రతిపక్షుల నంద అను జయించి, శివమతము సర్వోత్కృష్ట మని నిరూపించి సిద్ధాంతీకరించి చిరప్రతిష్ఠమును గావించెను.

రాజసభలో తనకు గలిగిన యోటమిని అవమానమును బౌద్ధుడు సహింప లేక యప్పుడే

మఱియొకని తోడు తీసికొని కాకొలనియందు చెన్నమల్లికార్జును దీప స్తంభము వెల్లగించి దానిని రాజసభలో ప్రతిష్ఠించెను. అంత రేమలదేవలయ లనెడు శివభక్తులు బౌద్ధుని చంపునుపాయ మాలోచించుచుండిరి.

సనదవ్రోలికి కొంతదూరమున సముద్రాంతర మందు నొకలంక గలదు. అందున్న బౌద్ధాలయ మున కీ బౌద్ధాచార్యుడు ప్రతిదినమును పోయి బుద్ధుని సేవించుచుండును.

రేమలదేవయ లీసంగతి నెఱింగి యొకనాడు బౌద్ధు డక్కడికి కేగునప్పుడు వెనువెంట జని యాతని జంపి వేసిరి. ఈఘోరకృత్య మంతయు పండితారాధ్యునివలననే జరిగిన దని యూహించి, వెలనాటి చోడడు పండితుని రావించి

'...విద్వత్తము, సదసద్వివేక
బ్రహ్మవంశజు బౌద్ధపదపదాచార్య
బ్రహ్మజ్ఞుఁ జంపింపఁ బాడియే'

యని కోపించి పలుకగా, పండితారాధ్యు లా పని చేయించినది తానే యని, తనపైఁ బెట్టు కొనియెను. చోడరాజును పండితుండు దండ నార్హుండు గాన యక్షిదండను విధించితి ననెను. పండితారాధ్యుఁడు రాజు తన కన్నులు తీయించ నవసరము లే దనియు, తానే తనకన్ను లను పెఱికికొని శివుని మాహాత్మ్యమువలన తిరిగి పడయుదుననియు, కన్నులు రెండు పెఱికికొని, తిరిగి, తన కన్నులే గాక, ఊర్ధ్వ నేత్రములు (నిలువు కన్నులు) రెండును పడసెను. పండి తుడు శివనింద చేసినందులకు వెలనాటి చోడని శపించి బసవనిఁ జూచుటకు బయున మయ్యెను.

బౌద్ధమతముతో సంబంధించిన పండితా రాధ్య చరిత్రమున గల కథాభాగమును జూచిన, మన కాకాలమునాటి బౌద్ధమత వ్యవస్థ బోధపడ గలదు. పండితుని కాలము నాటికి బౌద్ధమతము దాని యంత్యదశయం దుండెనని చెప్పవచ్చును. ఇంతేకాక పై వాద సందర్భమును పరిశీలించిన నందు ముఖ్యముగా శూన్యవాదము ఖండితమైనట్లు స్పష్టమగు చున్నది. దీనికి కారణము లేకపోలేదు. హీన యాన, మహాయాన, తాంత్రిక, శూన్యవాద ము లను నాలుగు బౌద్ధమత పథకములలో మహాయాన, శూన్యవాదములను ప్రతిపాదించిన నాగార్జునుడు ఆంధ్రుఁడు. నాగార్జునుని గ్రంథములమూలమున నే యారెండు వాదము

గార్జును డాంధ్రుడైనకారణముచేత శూన్య వాద మే యాంధ్రదేశమున నెలకొనినది. ఆంధ్ర దేశీయు డగుపండితారాధ్యుడును నీవాద మును నాగార్జునుని గ్రంథమూలమునసె గ్రహిం చెనని చెప్పవచ్చును.

పండితారాధ్య చరిత్రమున పై కథ వెల నాటి చోడసగార్చు యున్నను, చందవోలు కైఫీయతులలో కొండ పడమటి బుద్ధరాజు బౌద్ధ గురువుల శిష్యు డనియు, తమ గురువు ప్రోత్సా మున వారు శైవుడైనపండితారాధ్యుని కనులు తీయుంచినట్లును చెప్పబడి యున్నది.[1] ఈ కైఫీ యతులలోని విషయము పెద్దది యగుట చే నిక్కడ నుదాహరింప లేదు.

వెలనాటి చోళరాజును, కొండపడుమటి బుద్ధరాజును కేవలము బౌద్ధమతావలంబకు లని చెప్పుటకు శాసనాధారములు లభింప లేదు. పండితారాధ్య చరిత్రమున ప్రసక్తుఁడైన వెల నాటి చోడడు మాత్రము, తనకు పూర్వులైన వెలనాటిరాజులు శైవులుగ నుండినట్లును, తాను మాత్రము బౌద్ధమత మంగీకరించినట్లు ను దానివలన చరమదశలో చింత నొందినట్లును, నాగ్రంథమున నిట్లు చెప్పబడి యున్నది.

'ధరణీశ్వరుడు తమ తమ తగంబునను
హరుని భక్తుల కాని యన్యంబు లేదు
కనియు వినియు నెఱుఁగని బౌద్ధమతము
తనకుఁ బ్రాప్తం బయ్యె ధర్మేతరంబు.
వేదబాహ్యము ముక్తివిముఖంబు శూన్య
వాదం బగును బౌద్ధవాదం బనంగ'
పాపంబు దుర్బోధపాలైతి నింక.

మహిమాప్రకరణము.

పండితుని కాలమునందు నా ప్రాంతముల బుద్ధోపాసన కల దనుటకు కొన్ని దృష్టాంతము లున్నవి.

1. శివతత్త్వసారపీఠిక. 28, 29 పుటలు.

1. క్రీ. శ. 1147. బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయమున మహామండలిక 'భీమన సంధి విగ్రహి సోమన ప్రెగ్గడ శాసనము. 'ఆంధ్రధరణి పంచారామముల మహాదేవరలకు బుద్ధదేవరకునుం జేబ్రోలు సమ్మహాసేనునకునుం, బిదపురము హుంకారశంకరికి,...... బెజవాడ మల్లేశ్వర దేవరకు నఖండదీపములు' అని యందు గలదు.[1]

2. క్రీ. శ. 1182. కోటకేతరాజు అమరావతి శాసనము. శ్రీ మహామండలేశ్వర కోట కేతరాజులు శకవర్షములు 1104 గు నేంటి మాఘశుద్ధ ౧౦ గురువారమున శ్రీ బుద్ధదేవరకు సుంకములోనుగా సర్వాయములతో నాచంద్రార్కముగా నిచ్చిన ఊళ్లు......కోటకేతరాజులు తమకు ధర్మార్థముగా శ్రీ బుద్ధదేవరకు నఖండవర్తి దీపంబులు గెంటికి నై యిచ్చిన యిన్నవెడ్లు. ౧౧౦[2]

3. క్రీ. శ. 1234. బయ్యాంబ శాసనము.[3] వెలనాటి చోడని బావమరదియే కొండపడుమటి బుద్ధరాజు. బుద్ధరా జనుపేరును బట్టియే, యాకాలమున బౌద్ధారాధన కొంత వఱకు వ్యాప్తిలో నుండె నని తెలియుచున్నది. కాని యాకాలమునందే వీరశైవమతప్రచారము విశేషముగా జరుగుటచేత, ఆవెనుక నతిస్వల్పకాలములోనే బౌద్ధమత మాంధ్రదేశమున నడుగంటినది.

ఆకాలమున వీరశైవవాఙ్మయమునం దక్కు, మఱి యే యాంధ్రకావ్యములందును బౌద్ధమత ప్రశంస కానరాదు. వీరశైవ వాఙ్మయము వెనుక నార్య వైదిక ధర్మప్రతిపాదక మగు భారతాది గ్రంథములు, వైష్ణవభక్తి ప్రతిపాదకము లగు భాగవతాదిగ్రంథములు ప్రబలినవి. ఇక పందొమ్మిదవ శతాబ్దివఱకును ప్రచుర మైన ప్రబంధయుగమున కూడ, శైవ వైష్ణవభక్తి ప్రతిపాదకము లగుకథాసన్నివేశములును, నద్వైతమతానుయాయు లగు కవుల రచనలును విరివిగా సాగుటచేత నిరువదియవ శతాబ్ది ప్రారంభమువఱకును నే బౌద్ధమతవిశేషములు తెలుఁగువాఙ్మయమున నెలుకపడ లేదు.

ఇరువదవ శతాబ్ది ప్రారంభమున నింగ్లీషు భాషమూలముగా బౌద్ధమతమును ప్రతిపాదించినబుద్ధుని జీవితవిశేషములును, బౌద్ధ మత సిద్ధాంతములును, చరిత్రయు చక్కగా తెలిసినవి.

అద్యతన బౌద్ధ వాఙ్మయసంబంధము లగు గ్రంథములలో శ్రీ తిరుపతి వేంకటకవుల బుద్ధచరిత్ర ప్రశస్త మైనది. ఇది యాఱాశ్వాసముల పద్యకృతి. భాషాపోషకుఁడును, బహుళాంధ్ర ప్రబంధప్రకటనకర్తయు నగు శ్రీ పోలవరము జమీందారునకు కృతిగా వెలసినది. పండిత వతంసు డగుకృతిపతి తిరుపతి వెంకటకవులను బిలిచి

"ఇద్ధతేజుఁ డైనబుద్ధదేవుచరిత్ర
మశ్వఘోషముఖుల ననుసరించి
యస్మదంకితముగ నాంధ్రకావ్య మొనర్పుఁ
డనుచు" కోరగా

వారీకృతిని రచియించిరి. కాని కృతిపతి కోరిన ట్లిది అశ్వఘోషుని బుద్ధచరిత్ర ననుసరించినది కాదు. ఆర్నాల్డుదొరవారింగ్లీషులో రచించిన 'The light of Asia' అను పద్య గ్రంథమునకు వచనరూపముగా వెలసిన యొక సంగ్రహగ్రంథము ననుసరించినది. అధునాతన చారిత్రక కావ్యముల కాదర్శప్రాయ మైన రచనాసౌష్ఠవము గలకృతి. రచనాకాలము క్రీ. శ. 1902.

ఈ కాలముననే యనగా క్రీ. శ. 1902 లో బుద్ధుని జీవితమును గూర్చిన ప్రథమ వచన గ్రంథము "గౌతమ బుద్ధచరిత్రము" అనుపేర కీర్తిశేషులు ఓ. వై. దొరసామయ్యగారు రచించిరి. ఇది ప్రాథమిక మైనను దీనివెనుక ద్వితీయముగా వెలసిన చిలకమర్తి వారి సిద్ధార్థచరిత్ర యద్వితీయ మైనది. చక్కని చిక్కని వచనరచనతో, సమీచీనముగా బుద్ధునిచరిత్ర వివరించునది. ఈ వ్యాసకర్త క్రీ. శ. 1922 లో ననగా నిప్పటికి ముప్పది నాల్గేండ్ల క్రిందట ప్రథమ శాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథముగాఁ జదివి యున్నాఁడు.

దీనివెనుక పి. వెంకటాచలపతి రావు (1915), పాలపర్తి రామమూర్తి (1915), పి. నంజుండప్ప (1916), కాంచనపల్లి కనకాంబ (1918) మొదలగువారు కళాశాలలలోని విద్యార్థులకొఱకు వ్రాసిన బుద్ధుని

1. Ep. 295 of 1892
2. Ep. Ind. Vol VI P. 152.
3. Ep. Ind. Vol VI P. 157.

జీవితములు గలవు. వీని యన్నింటిలో పై చిలకమర్తివారి సిద్ధార్థచరిత్ర మకుటాయమానము.

బౌద్ధధర్మములు బోధించు గ్రంథములలో తొలుత రచిత మైనది-శ్రీ దాసు నారాయణ రావుగారి బుద్ధనీతి- (1908) పేర్కొనదగి యున్నది. ఆవెనుక ప్రధానమతగ్రంథ మగు "ధమ్మపదము" శ్రీ రాజా వాసిరెడ్డి సదాశివేశ్వర బహద్దరు జయంతిపురము జమీందారు వారిచేతను, కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణ రావుగారిచేతను వచనములో ననువదింపబడినది.

బుద్ధుని బోధనలు నాటకరూపమున వెలయుట నవీనాంధ్రమున నొక విశేషము. బుద్ధనీతి రచయిత లగు దాసు నారాయణరావుగారు 'బుద్ధనాటకము'ను, ఆంధ్ర షేక్స్పియరు పానుగంటివారు 'బుద్ధబోధసుధ' యను నాటకమును రచించిరి.

మొదట జాతక కథలనుగూర్చి, బౌద్ధ వాఙ్మయమునుగూర్చి పరిశ్రమ చేసినవారు కీర్తిశేషులు కిళాంబి రంగాచార్యులుగారు[1]. వారి వచనరూప జాతకకథలును "అంబఠసుత్తము" వారి వ్యాసములును జాతక కథావ్యాప్తికి తోడ్పడినవి. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి 'జాతక కథాగుచ్ఛము' హృద్య మైనరచన గలది యీ సందర్భమున పేర్కొనదగినది.

బౌద్ధవాఙ్మయచరిత్ర పరిశీలనలో ముందు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రులవారు వెలుగుబాట చూపినారు. శ్రీకాకుళక్షేత్రము (కృష్ణాజిల్లాలోనిది) గూర్చి వ్రాయుచు అది మొదట బౌద్ధక్షేత్ర మని, దాని పేరు సిరికకొలను అని, అది క్రమముగా సిరికాకొలను, శ్రీకాకొలను, కాకొలను, వైష్ణవము ప్రబలిన తరువాత శ్రీకాకుళమ్, శ్రీకాకుళము అయినదని నిరూపించియున్నారు. (చూ. పండితారాధ్యచరిత్ర అనువ్యాసము. పుట. 30-31.)

బౌద్ధవాఙ్మయపరిశోధన సలిపిన చారిత్రకులలో శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగా రగ్రగణ్యులు. వారి అమరావతీస్తూపములు, చారిత్రక వ్యాసములు, బౌద్ధయుగము అను గ్రంథములు బౌద్ధమత మాంధ్రదేశమున నెట్టి పరిణామము బొందినది చక్కగా తెలివిడి చేయుచున్నవి.

ఆచార్య నాగార్జునునిగూర్చి కొంత పరిశోధన జరిగినది. శ్రీకొడాలి లక్ష్మీనారాయణగారు నాగార్జునచరిత్ర వ్రాసిరి. శ్రీదుగ్గిరాల బలరామయ్యగారు బౌద్ధవాఙ్మయబ్రహ్మ గా ప్రస్తుతి కెక్కిరి.

ఈ వాఙ్మయమునకు సంబంధించిన కొన్ని పద్యకృతులు, గేయకృతులును నీనాడు వెలసినవి. వానిలో అజంతాసుందరి, అశోకసామ్రాజ్యము మున్నగునవి కలవు. కాని వానిని మించినకృతులు మూడు కలవు. అందు తొలికృతి పింగళి కాటూరి వారి సౌందరనందము. సుందరీ నందుల ప్రణయ సౌభాగ్యమును వర్ణించు నీరసవత్కృతి యద్యతనాంధ్ర వాఙ్మయమున చాల ప్రసిద్ధి కెక్కినది.

తెలంగానా కవిమండలికి సూర్యచంద్రుల వంటివారు దాశరథ నారాయణరెడ్డిగారలు. దాశరథి కావ్యము మహాబోధి ప్రశస్తకృతి. అందుండి కొన్ని యుదాహృతులను చూడుడు.

"దుఃఖమునకు తృష్ణ
తొలి కారణం బౌను
దాని చంపివేయఁ
బూన వలయు
మంచివాని వగుము
మంచి గావింపుము
అంతకన్న మించి
నట్టి దేది?"

"బలవంతుఁడు సాధుం డయి
చెలఁగిన ప్రతివాఁడు గెలి సేయును; వాఁడే
కలఁగి యొకదెబ్బ తీసిన
తొలఁగుదు రెల్లరును ప్రక్క త్రోవల
వెంటన్."

1. వీరు విజయనగర మహారాజావారి కళాశాలలో చిరకాలము ప్రిన్సిపాలుపదవి నలంకరించిన కిళాంబిరామానుజాచార్యులవారి పుత్రులు. వీరును నా కళాశాలయందే గణితశాస్త్రోపన్యాసకు లై, ప్రిన్సిపాలుపదవి నలంకరించి రెండేండ్లక్రిందట కీర్తిశేషు లైరి. వీరు సంస్కృతాంగ్లాంధ్ర భాషలలో గొప్ప విద్వాంసులు.

"ఒకతె ఖర్జూరమ్ము
లాలించి యందించు నిం
కొకతె అంబుజనాళ
శకలము లిడు.

* * *

"ఒకతె సెజ్జ యైన
నొకతె కంబళి మాను
ఒకతె అన్న మైన
నొకతె నీరు
ఒకతె వేణు వైన
నొకతె వల్లకి యాను
ఒకతె గిట్టకున్న
నొకతె గిట్టు (?)"

"చెల్లెడ్చె దుఃఖభరమున
గల్లెడ్చెను గుట్ట లేడ్చె కానసమే తా
రట్లాడె నేమి తోఁచక
పోట్లాటలు మానిసింహములుచింతించెన్"

నారాయణరెడ్డి నాగార్జున సాగరం-గేయ కావ్యము నాగార్జున శిల్పకళాచార్యుఁడు పద్మదేవుడు నాయకుడు. శాంతిశ్రీ నాయిక. గ్రంథప్రారంభంలో—

"ఇక్ష్వాకు వంశక్షితీంద్ర చంద్రులకీర్తి
కౌముదులు నల్గడల కలయ విరిసిననాడు
కృష్ణవేణీ తరంగిణి పయఃకంకిణులు
త్రిశరణక్వాణాల దెసల నింపిననాడు
శ్రీపర్వతాగ్రమ్ము సింహళాగత బౌద్ధ
భిక్షువుల విజ్ఞానపీఠక మ్మగునాడు
సిద్ధార్థుని విశుద్ధసిద్ధాంతబీజములు
శాఖోపశాఖలై సాగిపోయిననాడు
నేను జీవించి యున్నా నంచు భావించి
పలికింతు గేయకావ్యమును హృదయము
వెంచి"

అని వ్రాసినవిషయమే గ్రంథముయొక్క విశిష్టతను దెలుపును.

పైకృతులు మూడును బుద్ధజయంతి సందర్భమున స్మరింపదగినవి.

ఇంతవరకును కథలు గాథలు మూలముననీ వాఙ్మయము పెరిగినను చారిత్రకముగ, సప్రామాణిక మైనబుద్ధుని జీవితచరిత్రయే తెలుగున కొఱతగా నున్నది. ఇక మతతత్త్వ వివేచనమునుగూర్చి చెప్ప బని లేదు. ఇంగ్లీషు భాషలో నీ విషయములనుగూర్చి ప్రామాణిక గ్రంథము లెన్నియో యున్నవి. సంస్కృతమున గూడ నని లభ్యము లగుచున్నవి. అశ్వఘోషుని బుద్ధచరిత్ర లలితవిస్తరము, బుద్ధఘోషాచార్యుని పద్యచూడామణి1 మున్నగు గ్రంథములు తెలుగుభాషలోనికి రాదగి యున్నవి. ముందు ముఖ్యముగా లలితవిస్తరము తెలుగున లలితముగా విస్తరింప దగి యున్నది.

ఇంకను బౌద్ధమతమునుగూర్చి కొన్ని కథలును మిగిలియే యున్నవి. కాలాంతరమున స్థలాంతరమున సమగ్రముగా సమీక్షించెదను.

"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"

1. ఈ గ్రంథమును మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారు ప్రకటించి యున్నారు. దీనినిఁ గూర్చి కీర్తిశేషులు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు భారతి (1930)లో నొక వ్యాసమును వ్రాసి యున్నారు. అశ్వఘోషుని బుద్ధచరిత్రనుగూర్చి కీ. శే. దేవులపల్లి లక్ష్మీనరసింహముగారి 1923 సంవత్సరాది సంచికలోని వ్యాసము చదువదగినది.

# లలితవిస్తర పరిచయం

## శ్రీమతి "నివేదిత"గారు

—:o:—

మనకు భారతరామాయణాలలాగ బౌద్ధులమహాపురాణాలలో లలితవిస్తరము, అశ్వఘోషుని బుద్ధచరిత్ర చాల ప్రసిద్ధమైనమహాపురాణాలు. ఏమతానికైనా వాఙ్మయము అవసరము. ఆ మతతత్త్వాలను, ఆ మతానికి సంబంధించిన దేవతలను గూర్చినకథలను, తన్మతాల ననుసరించేవారు గ్రంథరూపంగా భద్రపఱచుకుంటారు. బౌద్ధమతానికి మూలపురుషుడైనగౌతమబుద్ధుడు క్రీస్తుపూర్వం ఆఱవశతాబ్దిలో వెలసి యుండినాడన్న విషయం తెలిసినదేకదా. బౌద్ధమతం మూడు పూలు ఆఱుకాయలుగా వికసించి విస్తరిల్లిన అశోకునికాలంలో 'లలితవిస్తరం' రూపొంది యుండవచ్చు. లలితవిస్తరం అతిప్రాచీనమైన బుద్ధుని జీవితచరిత్ర అనవచ్చు. దీని రచయిత యెవరో తెలియదు. కాని సులభమైనసంస్కృతభాషలో నిది క్రోడీకరింపబడి యున్నది. క్రీ. శ. 76 నాటికే అనగా ప్రథమ శతాబ్దినాటికే చైనాభాషలోని కీ గ్రంథము పరివర్తితమైనదంటే దాని వ్యాప్తిని గూర్చి ఖ్యాతిని గూర్చి వేఱుగ చెప్పవలసిన పని లేదుకదా! ఇది ఇరువదేడు అధ్యాయముల బృహద్గ్రంథము. 1. నిదాన పరివర్తము. 2. సముత్సాహ పరివర్తము. 3. కుల పరిశుద్ధి పరివర్తము. 4. ధర్మలోక ముఖవర్తము. 5. ప్రచల పరివర్తము. 6. గర్భావక్రాన్తి పరివర్తము. 7. జన్మ పరివర్తము. 8. దేవకులోపనయ పరివర్తము. 9. ఆభరణ పరివర్తము. 10. లిపిశాలా సందర్శన పరివర్తము. 11. కృషిగ్రామ పరివర్తము. 12. శిల్ప సందర్శన పరివర్తము. 13. సంచోదన పరివర్తము. 14. స్వప్న పరివర్తము. 15. అభినిష్క్రమణ పరివర్తము. 16. బింబిసారోపసంక్రమణ పరివర్తము. 17. దుష్కరచర్యా పరివర్తము. 18. నైరంజన పరివర్తము. 19. బోధిమండగమన పరివర్తము. 20. బోధిమండ వ్యూహ పరివర్తము. 21. మారఘర్షణ పరివర్తము. 22. అభిసంబోధన పరివర్తము. 23. సంస్తవ పరివర్తము. 24. త్రపుష భల్లిక పరివర్తము. 25. అధ్యేషణా పరివర్తము. 26. ధర్మచక్రప్రవర్తన పరివర్తము. 27. నిగమ పరివర్తము అనునవి యిందలి భాగముల శీర్షికలు. వీనిని బట్టి గ్రంథములోని విషయమును గ్రహింపవచ్చును గదా. మొట్టమొదట బుద్ధభగవానుడు శ్రావస్తిలో మతప్రచారము చేస్తున్నప్పుడు కొందఱు శిష్యులతనిని లలితవిస్తరమును వినిపించ వలసినదిగా కోరారు. మన భారత రామాయణాదులవలెనే అమితాఖ్యానక శాఖలతో నొప్పు ఈ పురాణాన్ని శిష్యులకు వినిపించినట్లు రచయిత తెలుపుచున్నాడు. పైగా 'బహుజన హితాయ బహుజన సుఖాయ, లోకానుకంపాయై మహతా జనకాయస్యార్థాయ సుఖాయ దేవానాం మనుష్యాణాం చాస్య మహానాధోద్భావనార్థం ఈ మహాపురాణాన్ని చెప్పవలసినదిగా శిష్యులు ప్రార్థిస్తే ఆచార్యుడు పురాణ కథనమున కుపక్రమిస్తాడు. అసలు లలితవిస్తర మంటే కళాయుక్తంగా వ్యాప్తికి తేవడం అని అర్థము.

ఈ విపులగ్రంథములో బుద్ధభగవానుని జననమునకు కారణ మిలా చెప్పబడింది. తుషిత లోకములో దేవతలచే సేవింపబడుతూ ఉన్న బోధిసత్త్వుడు తర్వాత భూలోకంలో ధర్మాన్ని ప్రచారం చేసి శాంతి స్థాపించడం కోసం ఉద్భవిస్తాడు. తుషితలోకం అంటే సంతోష లోకం అన్న మాట. ఈ లలితవిస్తరానికి పురాణ లక్షణాలన్నీ పట్టాయి. మధ్యమధ్య ప్రభుసమ్మితంగా బౌద్ధమతధర్మాలు సూత్రప్రాయంగా ప్రవచింపబడ్డాయి. బుద్ధుని అవతారానికి ముందు అతడు తుషితలోకంలో నున్నప్పటిస్థితి, భూలోకంలో చక్రవర్తి కాదగినవాని కుండే లక్షణాలు, బోధిసత్త్వునికి తల్లి కాదగ్గవారైన స్త్రీ వంశవివరణ ఆ సందర్భంలో కొన్ని రాజవంశాల ప్రశంస మొదటి మూడు పరివర్తనాల్లో ఉన్నాయి. బోధిసత్త్వుడు ఉచ్చధ్వజ మనేవేదికపై దేవపుత్రులకు దర్శన మిస్తాడు. అతని సింహాసనము, అత డిచ్చిన ఉపన్యాసము వర్ణితమైనవి. భూలోకాన్ని ఉద్ధరించడానికి తుషిలోకానికి మైత్రేయు ధ[illegible]వానిని ఉపాధ

క్షునిగా నియమించి తాను భూలోకమున నెట్లవతరింతునా యని యోచిస్తాడు. బోధిసత్త్వునికి తలిదండ్రులు కాదగినఅర్హత శాక్యవంశరాజగు మాయాదేవికి శుద్ధోదనునికి మాత్రమే ఉండినది. ఆ పవిత్రదంపతుల నోముల పంటగా బోధిసత్త్వుడు జన్మింప నిశ్చయించాడు. మాయాదేవి గర్భవాసమున నీ దివ్యతేజస్సు ప్రవేశించునప్పుడు శుద్ధోధనుని అంతఃపురమున నెన్నో శుభసూచనలు పొడసూపినవి. మాతృత్వమునాకాంక్షించి నిత్యమొక వ్రతముగా కాలము వెళ్లబుచ్చు మాయాదేవిని దేవతాస్త్రీలు నరభామినులై సందర్శించి లోకోద్ధారకుడగు పుత్రుని గాంతువంటారు. బోధిసత్త్వుడు మాయాదేవి గర్భమున ప్రవేశించిన దినమున మాయాదేవి కొక విచిత్ర స్వప్నము కలిగినది. కన్నులు మిఱుమిట్లు గొల్పు దివ్యతేజ మొక యేనుగురూపమున తనలో ప్రవేశించినట్లు ఆమెకు గోచరించినది. లేక లేక మహారాజ్ఞికి దౌహృదచిహ్నములు కలిగినందుకు ప్రజలు రకరకముల కానుకల నర్పిస్తారు. తత్సందర్భంలో గృహనిర్మాణమును గూర్చిన శిల్పవాస్తు శాస్త్రవిజ్ఞానమంత ప్రపంచింపబడినది. బుద్ధుని జననమునకు పూర్వము 32 అద్భుతసంఘటనలు జరిగినవి. నిండు చూలాలు మాయాదేవికి లుంబిని వనమును సందర్శింపవలయునన్న కోరిక గలిగినది. ఆమె ప్రయాణసన్నాహము, తదుపరి వనవిహారము వర్ణితములైనవి. అచ్చటనే ప్లక్షవృక్షపు నీడను బుద్ధుని జననమైనది. బ్రహ్మ ప్రత్యక్షమై బాలుని ఆశీర్వదించును. అప్సరసలు నారీరూపధారిణులై మాయాదేవిని సేవింతురు. పుత్రోదయశుభవార్త విని శుద్ధోధను డుప్పొంగిన విధము రాజ్యమున ఉత్సవములు జరిగిన విధము నతిరమణీయముగా వర్ణితములైనవి. దేవమాత యని దేవతాస్త్రీలు మాయాదేవి నభినందింతురు. మాయాదేవి మాతృత్వమున కుబలాటపడినదే కాని చిరకాల తపఃఫలితమైన పుత్రుని అద్దుముద్దును చూడ నోచుకోలేదు. పురిటిలోనే పుత్రుని వీడి యామె స్వర్గధామ మలంకరించినది. శుద్ధోదనునికి భార్యావియోగ మొకవైపున, పుత్రోదయ సంతోష మొకవైపున దుఃఖానందముల ప్రాతినిధ్యమును వహించి బాధ పెట్టినవి. కపిలవస్తునకు శాక్యకులాలంకారమగు గౌతముడు ఆడంబరముతో చేరుకున్నాడు. రాకుమారుని దేహమున గల చక్రవర్తిచిహ్నములను చూచి ప్రజలు ముగ్ధులైరి. బాలుని తీసికొని దేవాలయమునకు వెళ్లుట జరిగినది. అచ్చటి విగ్రహములు బాలునితో మాటలాడినవి. గౌతముని విద్యాభ్యాస వృత్తాంత మొక అద్భుతగాథ. బడిలోని విశ్వామిత్రుడను నాచార్యుడు బాలుని జూడగనే ఆ తేజస్సునకు తట్టుకోలేక మూర్ఛిల్లినాడు. కొంతవడికి తెప్పరిల్లి నీ కేమి వచ్చునో వ్రాయమన్నాడు. గౌతముడు అరువదినాలుగు రకము లగులిపుల నుల్లేఖించి దేనిని వ్రాయవలయునని అడిగినాడు. ఒకసారి గౌతముడొక పల్లెటూరికి వెళ్లినాడు. ఐదుగురు ఋషులాతని కలిసికొని తత్త్వసంభాషణ జరిపినారు. బుద్ధుని నీడ కనిపింపదు. ఈ అతిశయమును చూచి సఖులు ముక్కుపై వ్రేలిడినారు. ఇంతలో శుద్ధోదనుడు తన కుమారునికి తగినకన్య నన్వేషించును. నేపాలదేశ రాజు తనపుత్రి 'గోప' స్వయంవరము చాటించును. బుద్ధుడు వివిధవిద్యలలో తన కుశలతను ప్రదర్శించి గోపను చేపట్టును. శుద్ధోదనుడు తనపుత్రుని తత్త్వజిజ్ఞాసను చూచి భయపడును. అతనికి తనకుమారుడు సత్యాన్వేషియై వెళ్లిపోయినట్లు కల వచ్చినది. అందుచే కుమారునికి బహిఃప్రపంచముతో సంబంధము లేకుండునట్లు విశాలభవనములను నుద్యానవనములను నిర్మించును. కాని రాకుమారుడు పట్టణము పర్యవేక్షించు కోరికను వ్యక్తపఱచును. రథచోదకుడు ఛందకుడు శుద్ధోదనుని కీ విషయము వ్యక్తపరచును. అతడు పట్టణవాసులను బయటికిరావలదని కట్టడి చేసినాడు. కాని విధివశమున మొదటిదినమున నొక ముసలివాడు, రెండవరోజున రోగి, మూడవరోజున శవము, నాల్గవరోజున సన్యాసి గౌతమునికంటబడినారు. సుఖార్ణవమున మునిగి తేలుగౌతమునిలో లోకమందలి దుఃఖము కల్లోలమును రేకెత్తించినది. మానవులను మృత్యువు, రోగము, దారిద్ర్యము కాలసర్పములవలె బాధించుచుండ తానొక్కడు అంతఃపురమున ఆనందడోలికల నూగులాడుట యన్యాయమని యాతనికి తోచినది. ప్రపంచమందలి దుఃఖమునకు కారణము గనుగొని తన్నివారణోపాయము

# సంస్కృతంలో బౌద్ధ గ్రంథాలు

—★—

## 1. సర్వాస్తివాదం :—

హీనయాన బౌద్ధులలో స్థవిరవాదుల గ్రంథాలు పాలీభాషలో రచితాలు. హీనయాన సంప్రదాయంలోని మరొక శాఖవారైన సర్వాస్తివాదులు తమ మతగ్రంథాలను సంస్కృతంలోనే రచించారు. కొన్నిటిని పాలీనుండి సంస్కృతానికి అనువదించుకొన్నారు. ఈ సాహిత్యం చాలవరకు పూర్తిగా లుప్తమైంది. కాని కొంతమాత్రం చీనా, టిబెట్ భాషానువాదాలలో మిగిలింది. ఇటీవల మధ్య ఆసియాలో జరిపినపరిశోధనలవల్ల మూలసంస్కృత గ్రంథాలు కొన్ని లభించాయి. ఈ సర్వాస్తివాదులకు కూడ వినయ, సూత్ర, అభిదమ్మ పిటకాలున్నాయి. మొదటి రెండు పిటకాలు పాలీ మూలానికి దగ్గరగా వున్నాయి. ఏడు అవాంతర భాగాలు గల అభిదమ్మ పిటకం మాత్రం పాలీ అభిదమ్మ పిటకంతో సంబంధం లేనిస్వతంత్రరచనగా కనిపిస్తుంది. దీనినిబట్టి అభిదమ్మ పిటకమంతా తర్వాత బౌద్ధంలో శాఖోపశాఖా భేదాలు ఏర్పడిన తర్వాత సృష్టించబడిందనే అనుమానం కలుగుతున్నది.

ఇతరహీనయానశాఖల గ్రంథాలు 'మహావస్తు' వినా పూర్తిగా నశించాయి. ఈ 'మహావస్తు' మహాసాంఘిక వినయానికి పాఠాంతరమైన 'లోకుత్తరాని'కి పీఠిక కావచ్చునని పండితు లంటారు. ఈ మహాసాంఘికవినయం చీనాభాషలో అనూదితమైంది. చీనాభాషలోని సంయుక్తాగమం (సంయుక్తనికాయం) కూడ బహుశ మహాసాంఘికమూలంనుండి రచితమైందని పండితులు అభిప్రాయపడుతున్నారు. సత్యసిద్ధిశాస్త్ర మన్నది కేవలం చీనాభాషలోని అనువాద గ్రంథంనుంచి మాత్రమే తెలుస్తున్నది.

## 2. మహాయానగ్రంథాలు :

1. మహాయానులు కూడ సిద్ధాంతరీత్యా వినయపిటకాన్ని అంగీకరించారు గనుక, బోధిసత్వ సితికిప్రాధాన్యమిస్తూ కొన్నిగ్రంథాలు వ్రాయబడినవే గాని, మొత్తంమీద వినయపిటకంపై సంస్కృతగ్రంథాలు అంతగా బయలుదేరలేదనే అనాలి. హీనయాన వినయపిటకంలోను బుద్ధుని గతజన్మకు, ప్రస్తుతజన్మకు సంబంధించిన పెక్కు కథలు, జాతకాలు, అవదానాలు ఉన్నవి. ఈ కథలను మహాయానులు చిలవలు పలవలుగా అల్లారు. ఇవి నిజానికి సూత్ర పిటకంలోవైనా మహాయానులు వీటిని వినయంలోనే చేర్చారు.

బుద్ధజీవితచరిత్రలు: మహావస్తువు హీనయాన సంప్రదాయానికి చెందినబుద్ధచరిత్ర. మహాయానానికి చెందినది లలితవిస్తరం, అశ్వఘోషుని బుద్ధచరిత్రం. లలితవిస్తరం పెక్కు యూరోపియన్ భాషలలో అనువదించబడింది. సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన 'లైట్ ఆఫ్ ఏషియా'' అనే గ్రంథానికి ఇదే ఆధారం. మొదట లలితవిస్తరం హీనయానంలో ఒక శాఖవారైన సర్వాస్తివాదులది. కాని దీనిని మహాయానులు తమ సంప్రదాయానుసారంగా దిద్దుకున్నారు. అశ్వఘోషుని బుద్ధచరితం సిద్ధాంతరీత్యాను, సాహిత్యదృష్టితోను ఉత్తమమైంది.

(అ) జాతకకథలు, అవదానకథలు: జాతకమాలలో బుద్ధుని 35 పూర్వజన్మకథలున్నాయి.

---

(32 వ పేజీ తరువాయి)

నన్వేషించుట తన ప్రధానకర్తవ్య మని తలచి యాతడు సౌందర్యరాశి యగుభార్యను వంశాలంకార మగుపుత్రుని తృణప్రాయముగా వదలివేసి, వెలుగును కనుగొనుటకై నిశీధి అంధకారములో లీనమైనాడు. ఛందకుడనుసారథి మాత్రము అతడు రాజువేషమును త్యజించి పరివ్రాజకు డగుటను కనులార గాంచి ప్రజలకు నివేదించినాడు. బుద్ధమతములో మారుడొక క్రూరరాక్షసుడుగా పరిగణితుడవుతాడు. మహాభినిష్క్రమణానంతరము గౌతముడు మన్మథుని జయించిన విధ మతిరమ్యముగా వర్ణితమైనది. బుద్ధుని జ్ఞానోదయము - అతడు తాను కనుగొన్న వెలుగును అజ్ఞాన తిమిరమున బడి దిక్కు మొక్కు తెలియక పరితపించు ప్రజలకు ప్రసరింప జేయుటతో లలితవిస్తరములోని యిరువదియేడు అధ్యాయములును పరిసమాప్తము లగుచున్నవి.

అవదానశతకం, అశోకావదానం మున్నగునవి అవదానసాహిత్యానికి చెందినవి.

2. సూత్రాలు: సూత్రసారస్వతం విశేషంగా వుంది. దానిలో అవతంసక (గంధవ్యూహ) సూత్రం, సద్ధర్మ పుండరీక సూత్రం, సుఖావతీవ్యూహం చాల ముఖ్యమైనవి.

శాక్యముని అవతంసక సూత్రాన్నే మొదట ఉపదేశించాడని మహామునుల విశ్వాసం. ఈ సూత్రం కొంత భూలోకంలో, కొంత దేవలోకంలో ఉపదిష్టమైందట. ఇది పూర్తిగా తాత్వికవిషయాలను, సంపూర్ణ బుద్ధుని త్రికాయ దశకాయ బుద్ధుని బోధిసత్త్వాల మహాత్వాన్ని, ధర్మధాతువు మున్నగు వాటిని వివరిస్తుంది.

సద్ధర్మపుండరీక సూత్రం బుద్ధుని అంతిమోపదేశమట. ఇది మహాయాన బౌద్ధమతసారాంశం. ఇది అవతంసకసూత్రంకన్న ప్రాచీనం కావచ్చు. ఇది అంతగా తత్వవిషయభరితంకాదు. కానిథ కిరసంభరితం. శాక్యముని శాశ్వతపిత. ఈ త్రిలోకాలనే నిప్పంటుకొన్న ఇంట్లో బాధపడుతున్న తన సంతానాన్ని రక్షించడానికి యత్నిస్తాడు. నిజానికి అతని కెప్పుడు జరామరణాలు లేవు. కాని ఈ మానవజాతి సముద్ధరణ నిమిత్తం అలా లౌకికదృష్టికి పుట్టినట్టు కనిపిస్తాడు.

సుఖావతీ వ్యూహంలో అమితాభబుద్ధుని మహిమలు వర్ణితాలు.

ఇతరసూత్ర గ్రంథాలలో చాల ముఖ్యమైనవి ప్రజ్ఞా పారమితసూత్రం, సురంగమ సూత్రం, విమలకీర్తి నిర్దేశసూత్రం, లంకావతారసంధి నిర్మోచన సూత్రం, సువర్ణ ప్రతీహార సూత్రం ప్రజ్ఞాపారమితసూత్రం మాధ్యమికుల శూన్యవాదం తెలిపేవి. సురంగమ సూత్రం విమలకీర్తినిర్దేశసూత్రం అర్వాచీన మాధ్యమికవాదగ్రంథాలు కడపటిది యోగాచార్యసంప్రదాయానికి చెందినది.

3. అభిధర్మసూత్రం: దీనిలో సంస్కృత మహాయన సారస్వతాన్ని రెండుశాఖలుగా విభజించవచ్చు. (1) మాధ్యమిక శాఖలు. (2) యోగాచార్య శాఖలు.

(అ) నాగార్జునుడు, ఆర్యదేవుడు, ఆయన వ్యలు రచించినవి వీటిలో ముఖ్యమైనవి.

1. ప్రజ్ఞాపారమితానూత్రశాస్త్రం.— నాగార్జునుడు.
2. ద్వాదశనికాయశాస్త్రం-నాగార్జునుడు.
3. మాధ్యమికశాస్త్రం-నాగార్జునుడు.
4. శతశాస్త్రం-ఆర్యదేవుడు.
5. బోధికార్యావతారం-శాంతిదేవుడు.

(అ) యోగాచార్య సంప్రదాయగ్రంథాలన్నీ చాలవరకు అసంగ వసుబంధువు లనే సోదరులు వ్రాసినవి. ఈ సంప్రదాయానికి మూలపురుషుడు బోధిసత్వమైత్రేయు డని కూడచెప్పుకొనడం కద్దు: ఈ మైత్రేయుని స్వరూపం కూడా అనుమానాస్పదం. మైత్రేయుడు తుషితస్వర్గంలో వుంటూ సత్యధర్మ ప్రవర్తనకోసం భారతావనిలో అవతరించాడని యోగాచార్యధర్మశాస్త్రం పేర్కొంటుంది. మైత్రేయుడు అసంగుడు తన సిద్ధాంతానికి అనుగుణంగా కల్పించిన వ్యక్తే నని కొందరంటారు. ఇతడుకూడ బోధిసత్త్వాలలో ఒక్కడైన చరిత్రాత్మకవ్యక్తి అని మరికొందరివాదం. అసంగుడే యోగాచార్య సంప్రదాయాని ప్రధానప్రవర్తకు డనాలి. ఇతని తమ్ముడు మొదట సర్వాస్తివాది సంప్రదాయంవాడు. అప్పుడు అభిధర్మకోశ మనేఉద్గ్రంథం వ్రాశాడు. తర్వాత అసంగునిద్వారా యోగాచార్యమహాయానకూటంలో చేరి పెక్కు తత్త్వగ్రంథాలు రచించాడు.

ఈశాఖలో ముఖ్యమైనగ్రంథా లివి:—

1. యోగాచార్యభూమిశాస్త్రం-మైత్రేయుడు.
2. ప్రకరణార్యవాచాశాస్త్రంఅసంగుడు.
3. సూత్రాలంకార టీక-అసంగుడు.
4. మహాయానసంపరిగ్రహశాస్త్రం — అసంగుడు.
5. దశభూమికాశాస్త్రం—వసుబంధు.
6. అలంబనప్రత్యయధ్యానశాస్త్రం-జినదేవుడు.
7. విద్యామాత్రసిద్ధిశాస్త్రం— వసుబంధు.
8. మహాయాన అభిధర్మ సంగీతిశాస్త్రం - అసంగుడు.

అటుతర్వాత బౌద్ధతార్కికులు బయలుదేరారు. వీరిలో మొదటివాడు దిఙ్నాగాచార్యుడు. మరొకప్రముఖుడు ధర్మకీర్తి. వీరు సంస్కృతంలో రచించారు. మూలగ్రంథాలు లుప్తమై పోయాయి. కాని చీనాభాషలో అనువదించబడిన ఈ గ్రంథాలలో రెండు, టిబెట్టు భాషలో అనువదించబడినవాటిలో కొన్ని మిగిలాయి.

**తెలుగుతోబుట్టువులు :**

# దక్షిణాపథంలో తొలిసారిగ బౌద్ధం అంకిత మైనతమిళం

శ్రీమతి ఎం. ఆదిలక్ష్మిగారు

—: o :—

బుద్ధభగవానుని దివ్యసందేశములను దశదిశల వ్యాపింపజేసినయశస్వి అశోకచక్రవర్తి. క్రీ. పూ. మూడవశతాబ్దిలో అశోకుని తమ్ముడో లేక కుమారుడో యైనమహేంద్రుడు సింహళమునకు తమిళదేశముగుండ వెళ్లెనని, ఆ సందర్భముననే కావేరీ పూం పట్టణమున విహారాదుల నిర్మించె నని, శిలప్పదికారమున పేర్కొనబడిన ఇంద్ర విహార మీ మహేంద్రనిర్మితమే యని విజ్ఞుల యభిప్రాయము. క్రీ. పూ. మూడవ శతాబ్దినుండి క్రీ. శ. పది పండ్రెండు శతాబ్దులవరకు బౌద్ధము తమిళదేశమున ప్రచారము నంది యుండినది. కడై సంగకాలపు కావ్యము లైన శిలప్పదికారము, మణిమేఖలలలోను, అదేకాలమునకు చెందిన సంకలనగ్రంథములలోను బుద్ధునిగూర్చి అతని మతమును గూర్చి మనకు విపులముగా వర్ణనలు లభ్యము లగుచున్నవి. మణిమేఖల కావ్యరచయిత మధురలో ధాన్యవ్యాపారి శీత్తలై శాత్తనార్ అను బౌద్ధుడు. తమిళపంచకావ్యములలో శిలప్పదికారము, చింతామణి, జైనకవులచేతను, మణిమేఖల, కుండలకేశి, వళయాపతి బౌద్ధకవులచేతను రచితములు. కుండలకేశి వలయాపతి కాలగర్భమున లీన మై పోయినవి. నేడు మణిమేఖల ఒక్కటే మనకు లభ్యము. ఈ కావ్యముతోపాటు అగనానూరు, పురనానూరు, నట్రిణై, కురుందొగై అనుసంగకాలపు గ్రంథములందును బౌద్ధకవులు చెప్పిన పద్యములు భద్రపఱుపబడి యున్నవి. వీనిని బట్టి క్రీ. పూ. ఒకటి రెండు శతాబ్దులనాటికే బౌద్ధము తమిళదేశమున విరివిగ వ్యాపించి వాఙ్మయమున గూడ స్థానమును పొందినట్లు వ్యక్త మగుచున్నది గదా!

మణిమేఖల కావ్యము శిలప్పదికారమునకు పరాంశ మనదగును.

'మణిమేఖలై మేలురై ప్పొరుళ్ ముట్రియ
శిలప్పదికార ముట్రుమ్'

అను శిలప్పదికార వంజికాండమందలి వాక్యము గూడ నీరెంటి నొకేకావ్యముగా భావింపవచ్చు ననుటను దృఢపఱుచుచున్నను విజ్ఞులు వీనిని వేర్వేరు కావ్యములుగానే గ్రహించినారు.

మణిమేఖల రచయిత శీత్తలై శాత్తనార్ మధురలో వర్తకుడు. గొప్ప తమిళవిద్వాంసుడు. కవిశీత్తలై యనునదితని గ్రామనామము. పండితుఁ డైనందునను, వ్యాపారి యైనందునను నీతడు దేశ మంతయు పర్యటించి లోకానుభవమును గడించినవాడు. మణిమేఖలలో, పుకార్ (కావేరిపూం పట్టణము) మధుర, వంజి, కాంచీపురము మొదలగుస్థలములను గూర్చినవర్ణన లితని విషయవిజ్ఞానమునకు తార్కాణములు. చేరదేశమును పాలించిన సెంగుట్టువరాజు, అతని తమ్ము డైన 'ఇళంగోవడి'యు నితనికి పరమస్నేహితులు. ఇతని కాలముననే పాండ్యరాజ్యమున కణ్ణకీ కోవలుల విషాదగాథ జరిగినది. ఈ వృత్తాంతము నీతడు తన కాప్తు లగు సెంగుట్టువ, ఇళంగోవడులకు చెప్పగా, చేరరాజు కణ్ణకి పతివ్రతాత్వమును ప్రశంసించి ఆమె కొక కోవెల నిర్మించినాడు. ఇళంగో కవి కావున శాత్తనార్ చెప్పిన వృత్తాంతమును శిలప్పధికారకావ్యము గా సంతరించినాడు. దాని పరాంశమును శాత్తనారే 'మణిమేఖల' గా రూపొందించినాడు. ఈ కావ్యమునకు 'మణిమేఖల తుఱవు' అనగా మణిమేఖల దీక్షాస్వీకరణ అనుపేరు కూడ ఉన్నది. దీని రచనాకాలము క్రీ. పూ. రెండవ శతాబ్ది యని పండితుల యభిప్రాయము. ఈ కావ్యము ముప్పదిగాథలు (పరిచ్ఛేదములు) గా విభాగింపబడి యున్నది. మాధవి యను వేశ్యకుమార్తె యగుమణిమేఖల విభవములను

పరిత్యజించి బౌద్ధభిక్షుణిగా జీవితము గడపినది. ఆమె చరిత్రమే ఈ కావ్యేతివృత్తము. ఈ కావ్యమునుబట్టి తమిళదేశమున బౌద్ధమతము విపులముగా వ్యాపించి యుండె నని తెలియును.

వీరచోళీయ మనువ్యాకరణమును రచించిన బుద్ధమిత్రుడు బౌద్ధుడే. సంస్కృతవ్యాకరణ పరిపాటితో తమిళవ్యాకరణపద్ధతుల సంబంధము తెలియజేయున దీగ్రంథము. దీనికి బుద్ధమిత్రుని శిష్యుడైన పెరుందేవనార్ వ్యాఖ్య వ్రాసి యున్నాడు. ఆంధ్రమహాభారతకారకుడు ప్రేరకుడు నగుతూర్పుచాళుక్య రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్రుడు దౌహిత్రాంశమున చోళదేశ రాజ్యాధిపత్యమును పొంది, వేంగీదేశమున తనపుత్రుని వీరరాజేంద్రుని రాజప్రతినిధిగా నియమించెను. ఈరాజేంద్రుడే వీరచోళు డని బుద్ధమిత్రునిచే ప్రశంసింపబడినవాడు. అతనిపేరనే వ్యాకరణమునకు వీరచోళీయ మనునామ మేర్పడినది. ఇది క్రీ. శ. పదునొకండవ శతాబ్దికి జెందినది. కాబట్టి యాకాలమున బౌద్ధము దక్షిణదేశమున వ్యాప్తమై యుండె నని తెలియును. బుద్ధునకు సంబంధించినపద్యము లిందు కొన్ని యున్నవి. మచ్చునకై క్రిందివానిని చూడుడు.

'బోధి, ఆది, పాదమ్, ఓదు
బోది నిమ్రల్ పునిదన్ పొలంగ్రల్
ఆది ఉలగిల్ కాణ్
మాదవా బోది వరదా నరుళమలా
పాదమే యోదు శురరై నీ-లితకల
మాయాసెఱియళిప్పాయ్ పగలాచ్చీర్ త్
తాయాయలగిలరుడాన్.'

వీరచోళీయవ్యాఖ్యనుండి.

బౌద్ధసన్యాసిచే రచితమైనను నీ వ్యాకరణమున కొన్ని సమకాలీనరాజకీయసంఘటనలు పేర్కొనబడి యున్నవి. చోళులు కుడల్ సంగమమున వైరిరాజుల నోడించిన విషయము- నౌకాదళముతో విదేశములలో విజయయాత్ర సలిపినది - మొదలగువిషయములు కలవు.

కుండలకేశి అనుతమిళపంచకావ్యములలో నొకటి యగుమహాకావ్య మీనాడు లభ్యమగుట లేదు. బుద్ధభగవానుని సిద్ధాంతములను సమర్థించుచు, జైనము మొదలగుతదితరభిన్నమతములను తర్కమున ఖండించుగ్రంథ మిది. ఇది చాలవరకు వృత్తములలో రచిత మగుటచే దీనికి కుండలకేశి వృత్త మనునామమును బ్రసిద్ధమే. దీనిరచయిత నాదకుత్తనార్ అనునతడు. కథానాయిక కుండలకేశి. ఆమెపేరనే ఈ కావ్యము ప్రసిద్ధమైనది. ఈ కుండలకేశి బుద్ధభగవానుని కాలమున నుత్తరదేశమున నున్న యొక బౌద్ధభిక్షుణి. ఈమెవృత్తాంతము పాళీలో రచితమైనబౌద్ధగ్రంథములలో—తేరి గాథలోను, ధమ్మపదములోను, అంగుత్తర నికాయములోను చెప్పబడినది. నీలకేశి యనుతమిళజైనగ్రంథములోను నీమె వృత్తాంతము స్పృశింపబడినది.

రాజగృహము నేలురాజు మంత్రి కొక పుత్రి జన్మించినది. ఆమెకు భద్ర యని పేరు పెట్టి యల్లారుముద్దుగా మంత్రిదంపతులు పెంచినారు. బాల్యావస్థను దాటి యౌవనవతి యైన యామె యొకనాడు తన హర్మ్యమునుండి వధ్యస్థానమునకు రాజభటులు గొంపోవునొక యువకుని జూచినది. అతని సౌందర్యమునకు తన హృదయము నర్పించినది. అతడు రాజపురోహితుని కుమారుడు. దారిదోపిడి చేసినందున నతనికి మరణదండన విధింపబడినది. భద్ర తండ్రితో చెప్పి ఆయువకుని విడిపించి వివాహమాడినది. కాని యొకనాడు 'నీవు దొంగవే కదా!' అన్న భార్యమాట యాతని మిక్కిలిగా బాధ పెట్టినది. అందుచే తన యిలువేల్పును సందర్శింపవలయు ననుమిషచే నామె నొక పర్వతాగ్రమునకు గొంపోయి 'నన్ను తస్కరుడంటివి గదా! ఇప్పుడు నిన్ను హత మొనర్చెద' ననినాడు. భద్ర 'సరియే. నీవు భర్తవు. ప్రత్యక్షదైవమవు. నీకు ముమ్మాఱు ప్రదక్షిణ మొనర్చి యట్లే తనువు నర్పింతు'నని వినయమున బలికి ప్రదక్షిణము చేయుచు నాతని క్రిందికి త్రోసినది.

తర్వాత భద్రకు జీవితముపై నేవగింపు కలిగినది. జైనమతములో చేరి పరివ్రాజక యైనది. కేశఖండనము జరిగినను మరల వంపులు తిరిగిన కురులు వచ్చుచుండినందున ఆమెకు కుండలకేశి యనుపేరు కలిగినది. అనతికాలములో సర్వశాస్త్రముల నభ్యసించి దిగ్గంతుల వంటి పండితులను సునాయాసముగా జయించుటచే నీమె కీర్తి దశదిశల వ్యాపించెను. ఒకప్పు డీమె బౌద్ధమతమునకు పీఠ మగుశ్రావస్తి

నగరమునకు వెళ్లి యుండినది. అచ్చట సారి పుత్రు డను బౌద్ధభిక్షుకు డామెను కలిసికొని సమయవాదము జరిపెను. అతనివాద పైపుణ్యమున కాశ్చర్యపడి అతని పూర్వపక్షములను ఖండింపలేక ఆమె బౌద్ధమును స్వీకరించెను. బుద్ధభగవానుని సందర్శించెను. నాటినుండి బౌద్ధమతప్రచారమునకై తన జీవితము నంకితము చేసి తుదకు నిర్వాణము చెందిన బౌద్ధసన్యాసిని కుండలకేశి. ఈ కథనే నాదకుత్తనార్ తమిళమున కావ్యరూపమున సంతరించినాడు. ఈ కావ్య ముపలబ్ధము కాకున్నను 'పుఱత్తిరట్టు' అనుసంకలన గ్రంథమున కొన్ని వృత్తము లిందలివి యుదాహృతము లైనవి. అంతే కాక తొల్కాప్పియ వ్యాఖ్యానములోను, యాప్పెరుంకలవృత్తి వ్యాఖ్యానమును, నీలకేశీయ టీకలోను లక్ష్యములుగా కుండలకేశిలోని వృత్తము లొసగబడి యున్నవి.

వళయాపతి యను కావ్యము కూడ బౌద్ధకవి చేతనే రచిత మైన దందురు. కొందఱు దీనిని జైనగ్రంథ మందురు. కాని దానిని గూర్చిన విశేషము లేవియు నుపలబ్ధములు కాకపోవుట చేతను, వైశ్యపురాణమున నొసఁగబడిన కథను బట్టి ఈ కథకు బౌద్ధమున కేలాటి సంబంధము లేక పోవుటచేతను మన మేమియు నాకావ్యమునుగూర్చి చెప్పలేము. తిరుక్కుఱళ్ లోని పంక్తు లీ గ్రంథములో నుదాహరింప బడి యున్నవి. 'పుఱత్తిరట్టు'లో నీయబడియున్న భాగమునుబట్టి వ్యక్త మగుచున్నది.

ఇంక సిద్ధాంత త్తొగై యనుబౌద్ధమత సిద్ధాంతములను నిర్వచించు గ్రంథమొకటి యుండినట్లు శివజ్ఞాన సిద్ధియార్ శైవమతగ్రంథమునకు వ్యాఖ్యాత యగుజ్ఞానప్రకాశ రనునత డీ క్రింది పద్యము నుదాహరించి పేర్కొని యున్నాడు.

"అరుళోడిరియాట్ పారమిదై యాఱైన్దు
ముడనడక్కి
పొరుళ్ ముఱ్ఱుడుమ్ బోదియన్ కీఴ్
ముఱ్ఱ(ఱు) దుణర్న్ద మునివరన్ఱన్
అరుళ్ మొఴ్ఴి (ళి) యాలల్ వాయ్మై
యఱిన్దవరే పిఱప్పఱుప్పార్
మరుళొఱియామ్ పిఱనూలుమ్ మయక్కఱు
క్కు మాఱుళదో."

ఇంతకుమించి ఈ గ్రంథమునుగూర్చి గాని, రచయితనుగూర్చి గాని రచనాకాలమును గూర్చి గాని వివరములు తెలియరాలేదు.

తిరుప్పదికమ్ అను బుద్ధస్తుతిగ్రంథ మొకటి యుండియున్నట్లు పైన జెప్పిన శివజ్ఞానసిద్ధియార్ వ్యాఖ్యాత జ్ఞానప్రకాశరును, నీలకేశి అను తమిళ జైనగ్రంథవ్యాఖ్యాతయును పేర్కొనుచున్నారు. కాని దీనినిగూర్చి వివరము లేవియు నింతవఱకు దెలియ రాలేదు.

నీలకేశి కావ్యకర్త 'బింబిసార కథ' యను బౌద్ధకావ్యమునుండి లక్ష్యము నిచ్చుచున్నా నని ఈ క్రింది పంక్తుల నుదాహరించినాడు.

"ఉలుంబిని వవత్తుళ్ ఓఙ్గుళ్ళై న్దేవి
వలంబడు మరుంగుల్ వకునోయురామల్
అంద్రోన్ అవ్వుఴ్ఴ్(ళి)త్తోన్ఱినన్ ఆదలిన్
ఈంద్రోన ఏఴ్ఴ్(ళ్)నాళ్ ఇన్నుయిర్
వైత్తాళ్"

రాజగృహమును రాజధానిగా జేసికొని క్రీ. పూ. 6 వ శతాబ్దిలో ఉత్తరహిందూస్థానము నేలిన శైశునాగవంశరాజు బింబిసారుడు. నిర్వాణమార్గము నన్వేషించు ప్రయత్నమున సన్యాసి యై సంచరించుశాక్యముని సిద్ధార్థుని తన యంతఃపురమునకు రావలసిన దని ప్రార్థింపగా నతడు జ్ఞానోదయ మైనవెనుక నట్లే వత్తు నని వెడలి పోవును. సిద్ధి పొందిన తర్వాత మాటమేరకు రాజగృహమునకు విచ్చేయును. బింబిసారుడు బౌద్ధదీక్షను స్వీకరించును. బుద్ధుని అతని శిష్యులను ననేకవిధముల గౌరవించి కృతార్థు డగును. కాని బింబిసారుని పుత్రుడు అజాతశత్రుడు బుద్ధుని దాయాదుఁడు యగుదేవదత్తునితో కలిసి అనేకము లగుకుట్ర లను పన్ని బుద్ధుని తనతండ్రి యగు బింబిసారుని హతమార్ప ప్రయత్నించును. కాని ఆ కుట్ర లన్నియు విఫలములగుటచే బలవంతమున అజాతశత్రుడు తండ్రిని చెరసాలలో బంధించి చిత్రవధ చేసి చంపించును. కాని అదేదినమున నాతనికి పుత్రోదయ మైనది. తనకు పుత్రునిపై నెంత వాత్సల్య మున్నదో యట్లే తన తండ్రికి తనపైగూడ నుండి యుండు ననుజ్ఞాన మాతనికి కలిగెను. పశ్చాత్తాపముతో పరిక్షాళనము చేయబడినహృదయము గలవాడై యజాతశత్రుఁడు బుద్ధమతమును స్వీకరించును.

పై వివరణనుబట్టి బుద్ధునికి సంబంధించిన

కొన్నివర్ణనలు వివరణలు ఆయాకావ్యములలో లభ్యమైనట్లు తెలియవచ్చినదే గాని బుద్ధుని జీవితమునుగూర్చిన ప్రత్యేకకావ్యము లున్నట్లు తెలియుట లేదు. పైగా చాలవరకు బౌద్ధమతమునకు సంబంధించిన వనుగ్రంథము లలభ్యములు. మన తెలుగుదేశమునకన్న తమిళదేశమున బౌద్ధము పూర్తిగ నశించిపోయిన దని చెప్పవచ్చును. తొల్కాప్పియము నాటికి తమిళదేశమున జైనబౌద్ధములు విశృంఖల విహారము సలుపుచుండినవి. కాని పునరుజ్జీవన మొందిన హిందూమతము భక్తిసిద్ధాంతమును ప్రాతిపదికగా జేసికొని శైవము, వైష్ణవము అనురెండు స్రవంతులుగా పాఱి జైనబౌద్ధములను తమిళదేశమునుండి తఱుమగొట్టినవి. ముఖ్యముగా తమిళదేశమున వెలసినశివభక్తులు నాయన్మార్లు చాలచోట్ల వాదములు సలిపి బౌద్ధుల నోడించినట్లు మనకు తెలియును. మాణిక్యవాచకుడు, తిలకవ్వ, వాగీశనైనారు మున్నగుశివభక్తుల చరిత్ర లానాటి బౌద్ధ మతప్రాబల్యమునకు తార్కాణము లై యున్నవి. చివరకు కొన యూపిరితో నిటనట ఊగిసలాడుచుండిన బౌద్ధమును వైష్ణవమతాచార్యులు రామానుజులును వారి శిష్యు లగునాళ్వారులును సంపూర్ణముగా నణచివేసిరి.

తమిళదేశమున ప్రసిద్ధి జెందినబౌద్ధులను పేర్కొనకున్న నీవ్యాసము సంపూర్ణముకాదు. కడపటి సంగకాలమున నున్న ఇళంబోదియార్ క్రీ. పూ. మొదటి లేక రెండవ శతాబ్దులనాడుండి యుండె నని పండితు లభిప్రాయపడుచున్నారు. ఇతని పద్య మొకటి నట్రిణై అను గ్రంథమున 72 వ పద్యముగా సంకలింపబడి యున్నది.

అఱవణదాసు డను బౌద్ధసన్యాసి కావేరిప్పూం పట్టణమున నివసించుచుండినవా డని సింహళము మొదలు గంగానదివరకు పర్యటించినా డని తెలియుచున్నది. మంచి వాగ్మిత గలిగి కావేరిప్పూం పట్టణమున నొక బౌద్ధపాఠశాల కధిపతిగా నుండె నని, మణిమేఖల యితనియొద్దనే బౌద్ధవిద్య నభ్యసించె నని మణిమేఖల కావ్యమునుబట్టి తెలియును. సహస్ర మాసజీవియై తుదకు కాంచీనగరమున నిర్వాణ మొందినాడు.

మణిమేఖల కల్పితపాత్ర గాదు. క్రీ. పూ. రెండవ శతాబ్దిలో పాండ్యనగరమున జీవించి యుండిన యువతి. ఈమె గొప్ప బౌద్ధసన్యాసిని. ఈమెకే తమిళకావ్యమున అమరత్వసిద్ధి కలిగినది.

ఇక మణిమేఖల కావ్యకర్త శీత్తలై శాత్తనార్ ముందు వివరించినట్లు గొప్ప బుద్ధభక్తుడు.

సంఘమిత్రుఁ డను బౌద్ధసన్యాసి చోళమండలమునకు జెందినవాడు. ఇతడు మహాయానబౌద్ధమును ప్రచారము చేసెను. లంకకు వెళ్లి క్రీ. శ. రెండవ శతాబ్దమున హీనయానమునకన్న మహాయాన బౌద్ధతత్త్వము లుత్కృష్టము లని చాటి చెప్పినాడు.

నాదకుత్తర్ - నాదగుప్తు డను బౌద్ధుని తమిళులు నాదకుత్తనార్ అని పిలిచెడివారు. ఇతఁడే కుండలకేశి కావ్యకర్త.

బుద్ధతత్త్వ తేరుడు అను భిక్షుడు చోళమండలవాసి. సింహళమందలి అనూరాధపురమున గల బౌద్ధవిహారమున చాలకాలము నివసించి యుండెను. తర్వాత కవీరపట్టణము (కావేరిప్పూం పట్టణము), ఉరగపురము (ఉఱైయూర్), భూతమంగళము, కాంచీపురము మున్నగుస్థలముల పర్యటించి బహుగ్రంథరచన చేసినాడు. తన జన్మస్థల మగు చోళమండలమును తన గ్రంథములందు ప్రశంసించి యున్నాడు. ఇతని శిష్యుడు బుద్ధశిఖుని ప్రార్థనవలన 'బుద్ధవంశాత్తగాథ' అను గ్రంథమును, సుమతి అనుభిక్షుని వేడ్కలు నంగీకరించి 'అభిధమ్మావతార' మనుగ్రంథమును వినయవినిచ్ఛయము, ఉత్తరవినిచ్ఛయము, బుద్ధవంశము, మధురాత్తవిలాసిని, రూపారూపవిభాగము మొదలగుగ్రంథములను బౌద్ధమత దేవనాగరి యగుపాలీలో రచించినవాడు. ప్రసిద్ధుఁ డైనబుద్ధఘోషు డితని కలిసికొన్నట్లు కట్టుకథ లెన్నో వ్యాప్తము లై యుండెడివి.

బోధిధర్ముఁ డనుకాంచీపురరాజపుత్రుడు, ధ్యానమార్గ మనుబౌద్ధమతశాఖ కధికారి యై చైనాదేశమున కేగి మతప్రచారము చేసినాడు.

ప్రసిద్ధ సంస్కృతనాటకములలో నొకటి యగుకుందమాల రచయిత దిఙ్నాగుడు కాంచీపురమునకు జెందినబౌద్ధమతానుయాయి. బౌద్ధ

ధర్మమున విజ్ఞానవాదవిభాగమును సృష్టించిన దీతడే యందురు. న్యాయప్రవేశము, న్యాయద్వారము అనురెండుగ్రంథములను సంస్కృతమున రచించినాడు. ఇతని శిష్యు లగుధర్మపాలుడు, శంకరస్వామి అనువారు నలందా విశ్వవిద్యాలయమున పేరు ప్రఖ్యాతులు గడించినారు. వీరిలో ధర్మపాలుఁడు కంచి రాజ్యపుమంత్రి మూడవ కుమారుఁ డని, వివాహమునకు ముహూర్తము నిశ్చయింపగా నితఁడు బౌద్ధదీక్షను పొంది సన్యాసి యయ్యె నని చెప్పుదురు.

ఆచార్యధర్మపాలు డను మఱి యొక బౌద్ధభిక్షు తన్నుగూర్చి తామ్రపర్ణి నదీతీరమందలి తంజాపురవాస్తవ్యుడ నని చెప్పుకొని యున్నాడు. కాంచీపురమందలి భట్టారాదిత్య విహారమున కీత డధ్యక్షుడు.

బుద్ధనంది, శారిబౌద్ధుడు అనువారు చోళదేశమందలి బోధిమంగై అనుగ్రామమున నుండినట్లు తిరుజ్ఞానసంబంధరు వీరితో సమయవాదము చేసి జయించినట్లు పెరియపురాణమును బట్టి తెలియుచున్నది.

వజ్రబోధి అనుసన్యాసి పాండ్యమండలమునకు జెందినవాడు. నలందా విశ్వవిద్యాలయమున చాలకాలము విద్య నభ్యసించి బుద్ధభగవానుని జన్మస్థల మగుకపిలవస్తును సందర్శించి మరల తమిళదేశమునకు వచ్చి మతప్రచారము చేసినాడు. సింహళమున కేగి అచటి రాజును తృప్తిపఱచి సుమాత్రా, జావాద్వీపములందు పర్యటించి చీనాదేశమునకు వెళ్లినట్లు బౌద్ధగ్రంథములు (సింహళములోనివి) ఘోషించుచున్నవి.

వీరచోళీయకర్త బుద్ధమిత్రుడు క్రీ. శ. 11 వ శతాబ్దికి జెంది తంజావూరున, వేంగిదేశమున నివసించినవాడు.

వీరచోళీయ వ్యాకరణ వ్యాఖ్యాత పెరుందేవనార్ బుద్ధమిత్రుని శిష్యుడే.

దీపాంకుర తేరుడు — ఇతనికి చోళీయ దీపాంకురు డని నామాంతరము. ఇంతే కాక బుద్ధప్రియ తేరుడని సింహళమున నితనికి ప్రసిద్ధి. అచ్చట ఆనందవనరత్న అను బుద్ధభిక్షు వద్ద మతవిద్య నభ్యసించి జన్మభూమికి తిరిగి వచ్చి, కాంచీపురమున గల బాలాదిచ్చ విహారాధికారిగా నుండి పాళీభాషలో 104 పద్యములు గల 'పజ్జమధు' అనుగ్రంథమును, రూపసిద్ధి యని పాళీభాషకు వ్యాకరణమును రచించెను.

అనిరుద్ధుడు కాంచీపురమందలి మూలసోమవిహారాధిపతి. పాండ్యదేశమున జన్మించినవాడు. అభిధమ్మార్థ సంగ్రహము, పరమార్థ వినిశ్చయము, నామరూప పరిచ్ఛేద మను గ్రంథములను రచించెను. ఈ గ్రంథములు బౌద్ధమతమున నీనాటికి ప్రమాణము లై యున్నవి. ఈ భిక్షు క్రీ. శ. 12 వ శతాబ్దికి చెందినవాడు.

చోళదేశమున బుద్ధమిత్రుడు, మహాకాశ్యపుడును నిరువురు బౌద్ధసన్యాసులు వెలసి పైన పేర్కొన్న అనిరుద్ధుని నామరూప పరిచ్ఛేదాదులకు సింహళమున బహుళవ్యాప్తిని గలిగించిరి.

కాంచీపురమున క్రీ. శ. 1245 లో నివసించియుండిన ఆనంద తేరుడు బౌద్ధగ్రంథములను తఱచి చూచినమనీషి. బర్మాదేశమునకు వెళ్లి అచ్చట గల అరిమర్దనపురమున బౌద్ధసంఘమును స్థాపించి, అర్ధశతాబ్దికాలముపాటు బర్మీయులకు గురు వై యుండి 1245 లో నిర్యాణము జెందినట్లు 'శాసనవంశ' మనుగ్రంథమును బర్మాలోని శిలాశాసనమును తెలియజేయుచున్నవి.

పదమూడవశతాబ్దిలో తామ్రపర్ణి నదీతీరమున ధర్మకీర్తి యనుబౌద్ధసన్యాసి బౌద్ధధర్మమును పునరుద్ధరింప యత్నించినట్లు, ఇతనిని గూర్చి విన్నలంకరాజు సింహళము రప్పించెనని, యితడు చోళదేశమునందలి మఱికొందఱు సమకాలీనబౌద్ధులను గూడ లంకకు రావించి యొక బౌద్ధసమావేశమును జరిపెనని తెలియుచున్నది.

కవిరాజు అను బౌద్ధమతానుయాయి యైన తమిళకవి ఆశుకవిత్వమున నిపుణు డై యుండినట్లు కళింగత్తుపరణి వ్యాఖ్యాతవలన తెలియును.

పాతావతార మనుపాళిగ్రంథమును రచించిన శారిబుద్ధుడు క్రీ. శ. 13 వ శతాబ్దమున చోళమండలమున నుండెను. ఇతడే కాక బుద్ధాదిత్యు డను కాంచీపురవాసి యగుబౌద్ధభిక్షు జావారాజును ప్రశంసించుచు కొన్ని గీతములను వ్రాసి యున్నాడు.

ఇట్లు తమిళదేశమున బౌద్ధవిద్వాంసు లెందఱో వెలసి యుండిరి. ఆకాలమున బౌద్ధ మతమునకు క్షేత్రములుగా కొన్ని స్థలములు ప్రఖ్యాతి నంది యుండినవి.

ప్రాచీనకాలమున కావేరిప్పూం పట్టణము (పుగార్) బౌద్ధమతమునకు స్థానముగా నుండి నట్లు రసవాహిని యనుపాళీగ్రంథమునుబట్టి, మణిమేఖల తమిళకావ్యమునుబట్టి తెలియును. తర్వాతికాలమున నాగపట్టణము, కాంచి ప్రసిద్ధ బౌద్ధక్షేత్రములుగా ప్రఖ్యాతి నందినవి.

పెగుదేశమునకు ప్రాచీనకాలమున హంస వతి అని పేరు. 15 వ శతాబ్దిలో అక్కడి రాజగు రామపతిరాజు పంపిన పదునొక్కరు బౌద్ధభిక్షువులు చిత్రదూతు డనురాయబారియు క్రీ. శ. 1477 లో సింహళమునకు వెళ్లి తిరిగి వచ్చుచుండగా తుఫానువలన వారు పయనించు నోడ మునిగి పోయిన దని, అదృష్టవశాత్తు వారు బ్రతికి నాగపట్టణపు రేవును చేరుకొని రని, అచ్చట చైనారాజుచే నిర్మిత మైనగుహ వంటి బౌద్ధారామమున బుద్ధుని స్తుతించి రని బర్మాదేశమందలి కల్యాణినగర శిలాశాసనము వలన తెలియుచున్నది.

క్రీ. శ. 1725 నాగపట్టణమున చీనా కోవెల యని దేవాయతన మున్నట్లు Valentyn అనునతడు వ్రాసి యున్నాడు. 1849లో తాను కనులార నాగపట్టణమున నొక శిథిలబౌద్ధాలయమును చూచినట్లు చెప్పి యున్నాడు. 1897 లో ఈచోట ప్రభుత్వము వారి యాజ్ఞపై నొక చర్చి లేచినది. అదేచోట నున్న యొక యిప్పచెట్టును కొట్టివేయునపు డా చెట్టుమూలమున నైదు చిన్న బౌద్ధవిగ్రహములు దొరకినవి. వానిలో నొకదానిని క్రైస్తవపాది రీలు నేపియర్ (Lord Napier) గవర్నరుగా నుండి నాగపట్టణమునకు వచ్చినప్పుడు బహు మతిగా నొసంగిరి. ఆ విగ్రహపీఠమున 11,12 శతాబ్దులనాటి తమిళలిపిలో 'స్వస్తిశ్రీ ఆగమ పండితర్ ఉయ్యర్ కొండనాయకర్' అని వ్రాయ బడి యున్నది. బోధివృక్షపు నీడను ధ్యాన మగ్నుడై యున్నట్లొక విగ్రహమును, రెండు చేతులను పైకెత్తి భక్తుల కభయ మిచ్చుభంగి మలో మఱియొకటియు నున్నవి.

డాక్టర్ S. కృష్ణస్వామి అయ్యంగారు బుద్ధకోట్టమని యిప్పు డొక అగ్రహార మున్న దని, పూర్వ మక్కడ బుద్ధాలయ ముండి యుండెడి దని చెప్పుచున్నారు. నాగపట్టణమున లభ్య మైన బౌద్ధవిగ్రహములు కొన్ని మదరాసు పురాతత్త్వప్రదర్శనశాలలో నున్నవి.

కులోత్తుంగ చోళుని Leiden Grant ను బట్టి బౌద్ధులకు స్థాన మైనట్లు బుద్ధకుడి అను గ్రామ మున్నట్లు పేర్కొనబడినది.

సంస్కృతమున ఉరగపుర మని ప్రసిద్ధమైన ఉఱైయూరునందు క్రీ. శ. 4 వ శతాబ్దిలో ప్రసిద్ధ బౌద్ధాచార్యు డగు బౌద్ధతత్త్వవేత్త అనునతడు జన్మించినాడు.

కాంచీపురము మతవిద్యాపీఠము. హుయు న్త్సాంగ్ ఇచ్చట నొక అశోకుని బౌద్ధస్తూప మున్నట్లు పేర్కొని యున్నాడు. కాని మణి మేఖలలో అశోకస్తూపమును గూర్చిన ప్రశం సయే లేదు. క్రీ. శ. 2 వ శతాబ్దిలో చోళరా జ్యము నేలిన కిళ్లివళవన్ అను చోళరాజ సోద రుడు ఇళంకిళి అనునతడు కాంచీపురమును రాజధానిగా చేసికొని తొండమండలమును పాలించెను. అతడు 'పైంపూం బోదిబగ వర్కు' ఒక చైత్యమును నిర్మించినట్లు మణిమే ఖల చెప్పుచున్నది. కాంచీపురమున కాగ్నేయ దిక్కున ధర్మతవన మనునొకపూదోట యుండె నని, దానిలో ఇళంగిళ్లి యొక బుద్ధపీఠము సమర్చి యుత్సవములు జరిపించా డని కూడ మణిమేఖల వలన తెలియును. ఈ కావ్యమునుబట్టియే కావేరిపూం పట్టణమున నుండినఅరవణదానుడు తర్వాత కాంచీనగరమున నుండి బౌద్ధమత మును బోధించె నని తెలియును. ఇప్పటికి కంచిలో అరప్పణంజేరి అనువీథి యున్నది. అరవణదాను డిచ్చటనే పూర్వము నివసించి యుండె నని విజ్ఞుల యభిప్రాయము (రావు బహదూర్ రాఘవ అయ్యంగార్).

అయితే అక్కడ నున్నబుద్దేరి వీధి అనునది 'బుద్ధులవీథి' మాఱినరూపమే అని చెప్పి యున్నారు.

మాధవి అనుదేవదాసి పుత్రి మణిమేఖల బౌద్ధసన్యాసిని యైనతర్వాత తన యంతిమ కాలమువఱకు కాంచీపురముననే యున్నట్లు మణిమేఖల కావ్యమునుబట్టి తెలియును. 'మణి మేఖలమ్మ' గుడి యని ఒక దేవాలయ మున్న దని దీగికిని తమిళసారస్వతమున స్థిరప్రతిష్ఠితు రాలైన బౌద్ధభిక్కుణికిని సంబంధమున్న దేమో

అని పరిశోధకు లూహించుచున్నారు.

పల్లవరాజులలో బుద్ధవర్మ అనునతడు బౌద్ధుడని తెలియుచున్నది. క్రీ. శ. 7 వ శతాబ్దిలో హిమశీతలు డనురాజు బౌద్ధుల నాదరించినాడని, అకలంకు డనుజైనుడు కాంచీపురమున నీరాజునెదుట మతవాదమున జయించి రాజును జైనుని గావించుటయే కాక యోడిపోయినబౌద్ధుల లంకకు పంపినట్లు తెలియుచున్నది. ఏడవ శతాబ్దిలో కంచిని దర్శించిన హుయన్ సాంగ్ 100 బౌద్ధమఠములు వేయి మంది బౌద్ధభిక్షువులు నున్నట్లు చెప్పి యున్నాడు కాని బుద్ధమఠములు సరి యైనస్థితిలో లే వని చెప్పి యున్నాడు.

రాజకీయపురాతత్త్వపరిశోధకులు కంచిలోని కామాక్షి దేవాలయము బౌద్ధులకాలమున వారాదేవి గుడి యని, తర్వాత కామాక్షి యాలయముగా మారిన దని యందురు. ఆదేవాలయమున బుద్ధుని విగ్రహము లైదాఱు కాన్పించుచున్నవి. అరవణదానుడు దిఙ్నాగుడు మణిమేఖల బోధిధర్ముడు ధర్మపాలుడు ఆనందతేరుడు మొదలగుప్రసిద్ధి కెక్కిన బౌద్ధధర్మజ్ఞులిచ్చట నివసించిరి.

ఇంతే కాక తిరుప్పాదిరిప్పులియూర్ లోను సంగమంగైకూవం అను చోళ దేశాంతర్గతస్థలములోను బౌద్ధము వెలసి యుండినది.

పెరియపురాణమున శాక్యర్ తమ్ బోధిమంగై అనునూరిలో తిరుజ్ఞాన సంబంధము క్రీ. శ. 7 వ శతాబ్దిలో బుద్ధనంది, శారిబుద్ధుడు మొదలగుబుద్ధ తేరులను జయించిన ట్లున్నది.

పొన్నోపట్ట్రి అను ఊరు తంజావూరిజిల్లాలో పుదుకోట్టై తాలూకాలో నున్నది. ఇక్కడ వీరచోళీయ మనుతమిళ వ్యాకరణమును వ్రాసిన బుద్ధమిత్రుడు నివసించుచుండెను.

నాగపట్టణము :—చోళదేశమందలి ప్రసిద్ధ రేవుపట్టణము.

క్రీ. శ. 720 సంవత్సరమున నరసింహబౌద్ధవర్మని కాలమున నీ నగరమున నొక బౌద్ధాలయము నిర్మిత మైనట్లు తెలియుచున్నది. వర్తకమునకై చీనాదేశమునుండి వచ్చు బౌద్ధుల కొఱకై చైనాదేశపు రాజు కట్టించినందున 'చీనా కోవెల' యని యిది తర్వాతికాలమున ప్రసిద్ధ మైనది. మార్కోపోలో దీనిని పేర్కొని యున్నాడు.

క్రీ. శ. 8 లేక 9 శతాబ్దులలో జీవించి యుండిన తిరుమంగైయాళ్వార్ నాగపట్టణమం దున్న అపరంజి బౌద్ధవిగ్రహమును తీసికొని వెళ్లి విష్ణ్వాలయమునకు కైంకర్యములు చేసినట్లు తెలియుచున్నది.

ప్రసిద్ధు డగు రాజరాజచోళుని కాలమున 985-1014 శ్రీశైలేంద్రచూడామణివిహార మను పేర బౌద్ధపాఠశాల నిర్మిత మైనది. 'శ్రీ విజయ' అనురాజ్యమును పాలించిన శ్రీమార విజయోత్తుంగవర్మని తండ్రి చూడామణివర్మని పేర కట్టబడినది. రాజరాజు దీనికొఱకై యానైమంగళము మొదలగుగ్రామములను దానము చేసెను. కాని దానము చేయుటకు పూర్వమే రాజరాజచోళుడు మరణించినందున రాజేంద్రచోళుడు దానశాసనము వేయించినాడు. ఈ శాసనము రీడను నగరవస్తుప్రదర్శనశాలలో నున్నది.

పాండ్యరాజ్యమునకు ప్రధానపట్టణ మైన మధురలో బౌద్ధారామ మొకటి వెలసి యుండినట్లు 'మధురకాంచి' యనుగ్రంథమున నున్నట్లు దానికి వ్యాఖ్య రచించిన నాచ్చినార్కినియార్ తెలిపి యున్నాడు. అశోకచక్రవర్తి స్వయముగా నీ పట్టణమున నొక విహారమును నిర్మింప జేసె నని చెప్పుదురు. హుయన్ సాంగ్ శిథిలావస్థలో మహేంద్రునిచే నిర్మిత మైనవిహారమున్నట్లు పేర్కొని యున్నాడు. కాని తమిళ కావ్యములలో దీని ప్రశంస లేదు.

* * *

ఇట్లు బౌద్ధమతము రమారమి పదిహేను వందల యేండ్లకాలమున తమిళ దేశమున వ్యాపించి యుండినట్లు తెలియుచున్నది. నేడు విశ్వవిద్యాలయము లందు తమిళదేశమందలి బౌద్ధమునుగూర్చి పరిశోధనలు జరుగుచున్నవి. తత్ఫలితముగా ముందు ముం దెన్నెని నూత్న విషయములు బయలుపడ వచ్చును.

—:o:—

* ఈ వ్యాసమునకు మయిలై. చీని. వేంకటస్వామిగారి 'బౌద్ధముం తమిళుం' అనుగ్రంథము మిక్కిలిగా సహాకరించినది.

# కేరళదేశంలో బౌద్ధమతం

శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు

—★—

దక్షిణహిందూదేశమున బౌద్ధమత మెప్పుడు ప్రవేశించి వ్యాప్తి నొందినదియు నిశ్చయముగాఁ జెప్పఁదగిన యాధారములు మనకు లభించుట లేదు. అట్టిచో కేరళదేశములోనికి బౌద్ధమత మెప్పుడు వచ్చినది యని తెలిసికొనుట యసలే సాధ్యము కాదు. కాని యొకటి మాత్రము నిశ్చయము. పూర్వకాలమున తమిళదేశమునకును, కేరళదేశమునకును జాల సన్నిహిత సంబంధ బాంధవ్యము లుండినవి. అందుచేత తమిళదేశమున నేయుద్యమము బయలుదేరినను - అది మతవిషయక మయినది కానిండు లేదా, రాజకీయవిషయము కానిండు - దాని తాకిడి, దాని ప్రభావము కేరళదేశముమీఁదఁ గూడఁ దప్పకుండ నుండెడిదని చెప్పవచ్చును.

క్రీస్తునకుఁ బూర్వపు శతాబ్దములలోఁ గేరళదేశమున బౌద్ధమత మేస్థితిలో నుండిన దని తెలిసికొనుట కాకాలమునకు సంబంధించిన వాఙ్మయమే మన కాధారము. అప్పటి తమిళ కావ్యములలో నెక్కడఁ గూడ బౌద్ధమతప్రసక్తి కానరాదు. క్రీ. పూ. 4 వ శతాబ్దికిఁ జెందిన 'తొల్కాప్పియము'లో నీ మతమును గూర్చిన ప్రస్తావనయే లేదు. దానితరువాత రెండు మూఁడు శతాబ్దములకు వెలసిన 'తిరుక్కురళ్' లోఁ గూడ బౌద్ధమతప్రశంస లేదు. కాని కొందఱు విద్వాంసులు మాత్రము 'కురళ్' లోని కొన్ని విషయములు బౌద్ధమతమునకు సంబంధించిన వని చెప్పుచున్నారు. తిరువళ్ళువరు బౌద్ధమతస్థుఁ డనువాదము కూడ నొకటి లేకపోలేదు. 'కురళ్' లోని 'తురవు' అను దశకములోని పది 'కురళు'లే వా రావిధముగా నూహించుటకుఁ గారణము. కాని 'తురవు' (దీక్షాస్వీకరణము) అనునది యొక్క బౌద్ధమతమునకు మాత్రమే సంబంధించిన దని చెప్పుటకు వీలు లేదు. ఇందువలన దక్షిణహిందూదేశములోని ప్రజాజీవితమును సంస్కృతిని రూపొందించువిధముగా బౌద్ధమత మాకాలమున కింకను ప్రబలము కాలే దనియే చెప్పవలసి యున్నది.

మఱొకసంగతి. క్రీ. పూ. రెండవశతాబ్దమున సింహళదేశములో నొక పెద్ద బౌద్ధసమావేశము జరిగినది. 'దుత్తగామణి అభయ' యను రాజుకాలమునందు 'మహావిహార' ప్రారంభోత్సవ సందర్భమున నాసమావేశ మేర్పాటు చేయఁబడినది. దానికి వివిధదేశములనుండి బౌద్ధభిక్షువు లాహ్వానింపఁబడిరి. హిందూదేశములోని ప్రధాన బౌద్ధవిహారముల నుండి యెందఱో బౌద్ధభిక్షువు లాసమావేశమునఁ బాల్గొనిరి. కాని యాసమావేశమునకు హాజరయినబౌద్ధులపట్టికలో కేరళదేశపు బౌద్ధులపేరు లేదు. ఆనాఁటికిఁ గేరళదేశమున బౌద్ధమత మంతగా వ్యాప్తిలో లేదనుట కిది యొక నిదర్శనము.

అయిన కేరళదేశమున బౌద్ధమత మెప్పటి నుండి యున్నది? ఎవరికాలమున నది యాదేశములోనికిఁ బ్రవేశించినది? యనువిషయములనుగూర్చి మనము విచారింపవలసి యున్నది. దక్షిణహిందూదేశమున బౌద్ధమతవ్యాప్తియశోకచక్రవర్తికాలమున జరిగిన దని కొందఱు విద్వాంసు లభిప్రాయపడుచున్నారు. అతని శాసనములలో నెచ్చటను దక్షిణహిందూదేశమున కాతఁడు బౌద్ధభిక్షువులను బంపినట్లు పేర్కొనఁబడి యుండక పోవుటయే వార లట్లభిప్రాయపడుటకుఁ గారణము. బౌద్ధమతస్థుఁడగు శీత్తలై శాత్తనార్ చే రచింపఁబడిన 'మణిమేఖల' యనుబౌద్ధగ్రంథములోఁ గూడ నీయశోకచక్రవర్తి ప్రచారప్రస్తావము లేకపోవుట వారియూహకు మఱొక కారణము. కాని 'మణిమేఖల' బౌద్ధగ్రంథమే యయినను నది 'కావ్య' మగుటచే వందా ప్రస్తావ ముండవలసిన యవసరము లేదు.

అశోకుని రెండవ శిలాశాసనములో కేరళదేశము పేర్కొనఁబడియే యున్నది. తామ్రపర్ణి యనఁబడు 'కేరళపుత్ర'లో నశోకుఁడు రోగులకును, పశువులకును జికిత్స చేయుటకొఱకై ప్రత్యేక ప్రత్యేకముగా వైద్యశాలలు నెల

కొల్పిన ట్లాశాసనములోఁ గలదు. కనుక దీనిఁ బట్టి యశోకుని కాలములోనే బౌద్ధమతము కేరళదేశమునకు వచ్చి యుండు నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అశోకునికిఁ బూర్వము కేరళదేశములో బౌద్ధమతము లేదు. సింహళదేశమునుండి కొందఱు బౌద్ధులు వచ్చి కేరళదేశమున బౌద్ధమతప్రచారము చేసినట్లు చెప్పుదురు. కాని యది జరిగినది యశోకునికిఁ దరువాతి కాలములోనే.

క్రీ. శ. తొలిశతాబ్దాల నాఁటికి బౌద్ధమతము కేరళదేశమున మిక్కిలి వ్యాప్తి నొందినది. ఆకాలమునకుఁ జెందిన 'శిలప్పదిగారము' 'మణిమేఖల' యను గ్రంథముల మూలమున మనకీ విషయము తెలియవచ్చుచున్నది. వీనిలో 'మణిమేఖల' బౌద్ధగ్రంథము. ఇందులోని ప్రతియధ్యాయములోను బౌద్ధమతప్రశంస కానవచ్చును. దానినిబట్టి యాకాలములో బౌద్ధమత మత్యంతవ్యాప్తిలో నుండెడి దని యూహింపవచ్చును.

'శిలప్పదిగారము'లోని యొకసన్నివేశమును బట్టి కేరళదేశములో నానాఁడు బౌద్ధమత మెక్కువ ప్రచారములో నుండెడి దని చెప్పవచ్చును. 'వంజి' నగరమున (ఇది కేరళదేశములోనిది) 'కణ్ణకి' విగ్రహప్రతిష్ఠ జరిగినసందర్భమున సింహళదేశమునుండి 'గజబాహు' వను రాజు వచ్చినట్లు చెప్పఁబడినది. 'మహావంశ' మనుబౌద్ధగ్రంథములో 'గజబాహువు' గొప్ప బౌద్ధుఁడని కలదు. బౌద్ధుఁడయినగజబాహువు 'వంజి'లోని యుత్సవములోఁ బాల్గొనుట కేమి కారణ మని యాలోచింపఁగా కణ్ణకి గాథకు సంబంధించిన 'పత్నిసంప్రదాయము' బౌద్ధసంప్రదాయమే యనియు, నందుచేతనే గజబాహువు సింహళదేశమునుండి యాయుత్సవమునకు వచ్చుట సంభవించిన దనియుఁ దెలియుచున్నది. 'వంజి' నగరములో మణిమేఖల కణ్ణకిని సందర్శించినపుడు వారి కిరువురికిని మధ్య జరిగినసంభాషణనుబట్టికూడ 'కణ్ణకి' బౌద్ధమతాభిమాని యని ఋజువగుచున్నది.

'వంజి' నగరములోని బౌద్ధచైత్యము చాల పెద్దది. 'దాని యంచు లాకాశము నంటుచున్న' వని మణిమేఖల వర్ణించినది. ఆకాలమున నది దక్షిణహిందూదేశమున కంతకును పేరొందిన మహాచైత్యము. ఎందఱో బౌద్ధభిక్షువులు తమిళదేశములోని వివిధప్రాంతములనుండి వచ్చి యాచైత్యమున నివసించుచుండిరి. కాంచీనగరములో నొకప్పుడు గొప్ప కాటకము సంభవింపఁగా బౌద్ధభిక్షువు లక్కడినుండి వచ్చి 'వంజి' నగరములోని బౌద్ధవిహారముఁ జేరుకొనిరని కోవలుని తండ్రి మణిమేఖలకుఁ జెప్పెను. దీనినిబట్టి యాబౌద్ధవిహార మాకాలమున చాలఁ బెద్దదిగా నుండి యుండు నని మన మూహింపవచ్చును. దురదృష్టవశాత్తు దాని శిథిలావశేషములుఁ గూడ నేఁడు మనకు లభించుటలేదు. నేఁటి 'క్రాంగనూరు'కు సమీపమున నామహాచైత్యముండిన ప్రదేశము లక్కడక్కడ చెదరులు చెదరులుగాఁ గానవచ్చుచున్నవి. కాని యక్కడి త్రవ్వకములను బయటికిఁ దీసి పరిశోధనలు సలుపుట కెవరును ముందునకు వచ్చుట లేదు.

కేరళదేశమును బరిపాలించిన రాజులకు 'పెరుమాళ్' అనునది బిరుదము. ఆదేశమును బరిపాలించిన యిరువది యైదుమంది 'పెరుమాళ్' రాజులను గూర్చియు, వారి పరిపాలనమును గూర్చియు 'కేరళోల్పతి' (కేరళోత్పత్తి) యను మలయాళగ్రంథములోఁ జేర్కొనఁబడియున్నది. వారిలో పళ్లిబాణపెరుమాళ్, చేరమాన్ పెరుమాళ్ అను నిరువురు రాజులు బౌద్ధమతమును స్వీకరించి బౌద్ధు లయినట్లా గ్రంథములోఁ గలదు. వారిలో మొదటిరాజునకు 'బౌద్ధనాయపెరుమాళ్' అని పేరు. బౌద్ధుఁడయిన పెరుమాళ్ అని దాని యర్థము. చేరమాన్ పెరుమాళ్ కాలము నాఁటికిఁ గేరళదేశములో బౌద్ధమతము చాల హీనస్థితిలో నుండినది. అతనికాలమున నెందఱో బౌద్ధులు తిరిగి హిందూమతము నవలంబించి హిందువు లగుటకుఁ బ్రారంభించిరి. అట్టిస్థితిలో నారాజు తనదేశములో నానాఁడు క్షీణించుచుండిన బౌద్ధమతమును స్వీకరించె నని చెప్పుట యసంగతము. కనుక నీవిషయము చారిత్రకసత్యమయి యుండ దనియు, నిది యేదో పుక్కిటిపురాణ మనియు మనము దీనిఁ ద్రోసి వేయవచ్చును.

తిరువాన్కూరు దక్షిణప్రాంతమున క్రీ. శ. తొమ్మిదవశతాబ్దముదాఁకఁ గూడ బౌద్ధమతము మంచివ్యాప్తిలో నుండినట్లుగాఁ దెలియుచున్నది. అప్పటికి దక్షిణహిందూదేశములో బౌద్ధ

మతము క్షీణదశ నందుచుండినను తిరువాన్కూరు దక్షిణప్రాంతమున బౌద్ధమత మానాఁడు చాల వ్యాప్తిలో నుండినదని వరగుణుఁడను నొక రాజు వేయించిన బౌద్ధశాసనమును బట్టి తెలియుచున్నది. బౌద్ధమతమునకు సంబంధించి కేరళదేశములో దొరకిన యేకైకశాసన మది! ఈ శాసనము రెండు రాగిరేకులపై నున్నది. అందుఁ బేర్కొనఁబడిన తారీఖును బట్టి యిది క్రీ. శ. 868 కిఁ జెందినట్లు మనము నిశ్చయింప వచ్చును.

కేరళములోని మావెలిక్కర, భరణిక్కావు, పళ్లిక్కల్ పుత్రచేక్, కరునాఁపల్లి, కారుమాతి, కిలిరూర్, నిలంపెరూర్ అను ప్రదేశములలో నతిమనోహరము లయిన బుద్ధవిగ్రహములు నేఁటికిని గానవచ్చుచున్నవి. కేరళదేశములోని 'శ్రీమూలవాస' మను ప్రదేశమునఁ బూర్వ మొక గొప్పబౌద్ధవిహార ముండినట్లుగా 'మూషికవంశ' మను గ్రంథము తెలుపుచున్నది. అది యానాఁడు భారతదేశములోనివిహారములలో పెల్లఁ బేరు పొందియుండినదని యితరాధారములవలనఁ గూడ మనకుఁ దెలియుచున్నది. కాని యీ 'శ్రీమూలవాస' మను ప్రదేశము నేఁడు కేరళదేశములో నెక్కడనున్నదో యింకను గుర్తింపఁబడలేదు.

సుప్రసిద్ధ చీనాయాత్రికుఁడు యువాన్ చాంగు తన భారతదేశయాత్రలనుగూర్చి వ్రాయుచుఁ దాను దక్షిణహిందూదేశములో ననేక బౌద్ధవిహారములను సందర్శించినట్లు వ్రాసికొనినాఁడు. కాని నేఁడా ప్రదేశములను గుర్తించుటలోఁ బండితులలో భేదాభిప్రాయము లేర్పడినవి. అందుఁ బేర్కొనఁబడిన 'మాలకూట' మను ప్రదేశము నేఁటి మలబారునకు సంబంధించినదని పలువురు పండితుల యభిప్రాయము. యువాన్ చాంగు వ్రాఁతలనుబట్టి యాకాలమున కేరళదేశములో బౌద్ధమతము క్రమముగా క్షీణించుచుండినదనియు, హిందూమతము క్రమముగాఁ బుంజుకొనుచు దానిస్థానము నాక్రమించినదనియు మన మూహింపవచ్చును. 'మాలకూటము'నందలి ప్రజలలో పలుమతములవా రుండినట్లు యువాన్ చాంగు పేర్కొనుటయే దీనికిఁ దార్కాణము.

నేఁడు కేరళదేశమున 'శాస్త' ఆరాధన విపరీతముగాఁ గానవచ్చుచున్నది. 'శాస్త' కేరళదేశీయులకుఁ బ్రీతిపాత్ర మయినదైవము. అతఁడు హరిహరసుతుఁ డఁట! సబరిమల, అచ్చన్ కోయిల్, కులత్తు పుషా, అరియన్ కావు అను ప్రదేశము లీ 'శాస్త' దైవతము వెలసినపుణ్యక్షేత్రములు. వీనిలో సహ్యపర్వతారణ్యములనడుమ వెలసిన 'సబరిమల' చాలఁ బ్రసిద్ధి చెందినది. ప్రతిసంవత్సరమును నవంబరు నెలనుండి జనవరిదాఁక నిక్కడ జరుగు నుత్సవములకుఁ గేరళదేశములోని లక్షలాదిజన మక్కడికిఁ జేరుకొందురు. ప్రపంచములోనే యే యితరపుణ్యక్షేత్రమునకును నింత పెద్ద యాత్రికజనము రా రని చెప్పుదురు. ఈ 'శాస్త' పూజ బుద్ధపూజయే యనియు, నక్కడి హిందువులు బుద్ధారాధన మవలంబించి దానికే 'శాస్త' ఆరాధనగాఁ బేరు పెట్టుకొనిరనియుఁ గొందఱు పండితులు విశ్వసించుచున్నారు. 'శాస్త' ఆరాధనలో నహింస ప్రధానస్థానము వహించుటయు, బుద్ధవిగ్రహ శిల్పమునకును, శాస్త దైవత విగ్రహశిల్పమునకును బోలికలు గానవచ్చుచుండుటయు దీనికిఁ గారణములు. కాని యీ 'శాస్త' దైవతారాధనము ద్రావిడసంప్రదాయ మనియు, శాస్త ద్రవిడదైవత మనియు మఱికొందఱు పండితులు సప్రమాణముగా నిరూపించిరి. కాని మొత్తముపై నీ 'శాస్త' ఆరాధన సంప్రదాయముమీఁద బౌద్ధమత ప్రభావ మంతో యింతో లేక పోలేదు. అంత మాత్రముచేత 'శాస్త' బుద్ధదేవుఁడే యని చెప్పుటకు మాత్రము వీలు లేదు.

కేరళదేశములోని హిందువులలో 'ఇళవు' లని యొక తెగవారు కలరు. మతాచారములయందును, సాంఘికసంప్రదాయములయందును వీరికిని, నాయర్లకును జాలఁ బోలిక లున్నవి. కాని పరంపరగా నాయర్లు శూద్రులనియు, 'ఇళవు' లంతకంటెఁ దక్కువజాతివా రనియుఁ బరిగణింపఁబడుచున్నారు. అక్కడి సవర్ణులయిన బ్రాహ్మణులు ఇళవులతో సహపంక్తి భోజనము చేయుట కాని, వారి నిండ్లలోనికి రానిచ్చుట కాని లేదు. అక్కడి సంఘములో వారించుమించుగా హరిజనులవలెనే చూడఁబడుదురు.

వారు సింహళదేశమునుండి యేనాఁడో వచ్చి కేరళదేశములో స్థిరనివాస మేర్పఱచుకొనిన బౌద్ధు లని చాలమంది యభిప్రాయము. వారు సింహళీయులే యనుటకుఁ బెక్కాధారము లున్నవి. 'ఇళవ' అనుపదము సింహళమునకుఁ దమిళపద మయిన 'ఇళయ్'కుఁ జాల సన్నిహితముగా నున్నది. వారికే 'తీయను' లని కూడఁ బేరు. అది 'ద్వీపక' యను సంస్కృతపద వికార మయి యుండవచ్చును. సింహళద్వీపవాసు లనునర్థములో వారికి 'తీయను' లను పేరు స్థిరపడి యుండవచ్చు నని కొంద ఱభిప్రాయపడుచున్నారు. వీరి పుట్టుపూర్వోత్తరములను గూర్చి యింకను బాగుగాఁ బరిశోధనలు సాగించినచోఁ గేరళదేశమున క్రీ. పూ. తొలిశతాబ్దములలో జరిగిన బౌద్ధమతవ్యాప్తినిగూర్చి కొంత వఱకుఁ దెలిసికొనవచ్చును. ఈ 'యిళవులు' నేఁడు హిందువులే యయినను వారియాచారములు చాలవఱకు బౌద్ధాచారములే. తాము బౌద్ధసంప్రదాయమునకుఁ జెందినవార మని వారభిమానముతోఁ జెప్పుకొని గర్వపడుదురు కూడ.

క్రీ. శ. ఏడవశతాబ్దినాఁటికే కేరళదేశమున బౌద్ధమతము క్షీణదశలో నుండిన దని యువాన్‌చాంగు తెలిపినాఁడు. మఱికొన్ని తమిళగ్రంథములనుబట్టి కూడ మన కీవిషయము యథార్థ మని నిరూపిత మగుచున్నది. అప్పటికి శైవ వైష్ణవమతములు దేశములో బాగుగాఁ దల యెత్తి వీరవిహారము చేయఁ బ్రారంభించినవి. శైవనాయన్మారులును, వైష్ణవ ఆళ్వారులును గొప్పగా మతప్రచారము చేసి జైనబౌద్ధములను దేశములో నడుగంటఁ జేయఁ బ్రయత్నించిరి. కాని యెట్లో పదవ శతాబ్దివాఁకఁ గొనయూపిరితోఁ గొట్టుకొనుచుండిన బౌద్ధమతము దాని తరువాతఁ బూర్తిగా హిందూమతప్రాబల్యమునకు లొంగి పోయినది. భారతదేశము మొత్తముపై బౌద్ధమతము క్షీణించుటకేవి కారణములో యవే కేరళదేశములోఁ గూడ బౌద్ధమతము క్షీణించుటకుఁ గారణములయిన వని చెప్పవచ్చును. శైవవైష్ణవభక్తుల ప్రచారముతోఁబాటు కుమారిలభట్ట, శంకరాచార్యాదులు కూడఁ గేరళములో బౌద్ధమతమును రూపు మాపుటకుఁ జాలవఱకుఁ గారణభూతు లయిరి. కేరళమున కుమారిలభట్టు పేరు కొంతకాలము మాఱు మ్రోఁగి పోయినది. అక్కడినంబూద్రిబ్రాహ్మణులు వైదికమతమునకుఁ బట్టుగొమ్మ లయిరి. వా రందఱును గలిసి కట్టుగాఁ బని చేసి బౌద్ధమతమును దమదేశములో లేకుండఁ జేసిరి. బౌద్ధవిహారములను హిందూదేవాలయములుగ మార్చిరి. ప్రసిద్ధపుణ్యక్షేత్రములలోని బుద్ధవిగ్రహములను దొలఁగించిరి. బౌద్ధులను సంఘములోనుండి వెలి వేసి వారి నిండ్లలోనికి రానీయకుండఁ, జెఱువులలో స్నానము చేయనీయకుండ, నుత్సవములలోఁ బాల్గొననీయకుండఁ జేయుటతో వారు తట్టుకొనలేకపోయిరి. తుదకు వారందఱును హిందూమతమును స్వీకరింపవలసి వచ్చినది. హిందువుల నెదిరించి నిలువఁగలబలము స్తోమత యానాఁడు బౌద్ధమతమునకు లేక పోయినది. క్రమముగా బౌద్ధమతము కేరళదేశములో నడుగంటినది.

ప్రియయువతిం బ్రభుత్వమును వీడి యరణ్యముఁ జేరెఁ దత్త్వని
శ్చయమునకై మహాతపము సల్పి కృతార్థతఁ గాంచె నెల్లెడన్
దయయు నహింసయుం బరమధర్మములన్ నెలకొల్పె నమ్మహో
దయుఁ డగుబుద్ధదేవునిపదంబుల కేను నమస్కరించెదన్.

# ఆంధ్రబౌద్ధక్షేత్రాలు

## శ్రీ కల్లి సాంబమూర్తిశాస్త్రిగారు

పరమకారుణికోత్తముడగు గౌతమబుద్ధుడు జనించినది లుంబినీవనమున. పెరిగినది కపిలవస్తు రాజప్రాసాదమున. తప మొనర్చినది వివిధారణ్యములలో. సత్యము గనిపట్టినది సారనాథ క్షేత్రమున బోధివృక్షచ్ఛాయను. తొలుదొల్త మతబోధ గావించినది మగధలో బింబిసారుని యజ్ఞవాటమున. ఆ మతము వివిధదేశములకు ఖండాంతరములకు వ్యాపించినది మాత్రము కళింగముననే.

బుద్ధుని అహింసాసిద్ధాంతము తొలుదొలుత జనుల కాహార మగుజంతువుల విషయముననే పరిమితమైయుండి తగినంతగా వ్యాప్తి నందలేక పోయినది. అశోకవర్ధనుడు కళింగయుద్ధమున లక్ష సైనికుల వధించి రక్తవాహినుల బ్రవహింప జేసిన పిదప నది మానవవిషయకముగ మహావ్యాప్తి నందినది. అశోకుడు తనరాజ్యమందంతటను మతప్రచారమున కనేకోద్యోగుల నియమించి ప్రజలకు మతబోధ గావించెను. వివిధస్థలములందు జనసంచార మధికముగా నుండు తావులందు శిలాస్తంభములపై శాసనములు చెక్కించెను. మతిస్ఫోరకము లగుధర్మశాల లనేకము నెలకొల్పెను. సమర్థు లగునుద్యోగులను విదేశముల కంపి మతమున కత్యధికవ్యాప్తి చేకూర్చెను. కళింగాంధ్రములు రెంటియందును జనులు ఏకభాష వ్యవహరించువారును ఏకవిధాచారములు గలవారును నగుటచేతను, ఆరెండు దేశములు సముద్రతీరము నానుకొని విదేశముల యాతాయాతముల కనుకూలము లగుటచేతను, విశేషించి కళింగయుద్ధము ననుభవించిన ప్రజలు అహింస నధికముగ నాదరించుటచేతను నీ రెండుదేశములు మతప్రచారమున కనువగు స్థలములుగా పరిణమించెను. విదేశములకు వెడలు భిక్షుకులకు శిక్షణము గఱపు పాఠశాలలు వేలకొలదిగ నీరెండు దేశములందు నుండెడివి. అమరావతి, నాగార్జునకొండ, ధరణికోట, భట్టిప్రోలు, సర్వసిద్ధి, అనకాపల్లికడ శంకారము, రామతీర్థము, సాలెహుండము భువనేశ్వరముకడ నున్న కంద (స్కంద)గిరి మొదలగు ప్రదేశము లట్టి మతవిద్యాలయములే. బహుకాలమునకు మతము క్షీణించి యవియు భిక్షుకరహితము లై పై పరామరిక లేమి శీతవాతాతపములకు జిక్కి శిథిలము లై భూగర్భమున నణగారి పోయినవి. వేలకొలది వత్సరములు కాలగర్భమున లీనమై యున్న కొన్ని కొన్ని ప్రాచీనశిథిలము లీ మనతరమున బయలుపడుచుండుట మనకు సంతోషకారణము గర్వకారణము గూడ నగును.

### శిశుపాలఘుడము

నూతనముగా బయలుపడిన శిథిలములలో శిశుపాలఘుడము ముఖ్యమయినది. భారతభాగవత కథలలో ప్రసక్తు లైన శిశుపాల దంతవక్త్రులు కళింగాంతఃపాతి యగు చేదిదేశపు రాజులు. ఖారవేలుడు చేదిరాజే. భువనేశ్వరమునకు మూడుమైళ్ల దూరమున గలకంద (స్కంద)గిరి గుహలలో నాతని శిలాశాసనము గలదు. ఆతడు మన శాతవాహనుల సమకాలికుడు. హాత్తిగుంఫా (హస్తిగుహ) యనుకొండ తొలచినగుహాయందాతని శాసనము గలదు. ఆ గుహలకు మైలుదూరమున 'శిశుపాలఘుడ' అను పేరు గలచిన్నకుగ్రామము గలదు. అక్కడ వరిపొలము త్రవ్వుచుండగా నతిప్రాచీనమైనయాయుధశకలములు గృహోపకరణములు పూసలు మొదలయినవి బయలుపడినవి. అశోకుని కళింగయుద్ధ మక్కడనే జరిగిన దని జనశ్రుతి చిరకాలమునుండి కలదు. అశోకునకు పశ్చాత్తాపము కలిగించి బౌద్ధమతవ్యాప్తి కత్యంతముతోడ్పడిన యాప్రాంతము మిక్కిలి పవిత్ర మైనదికదా!

### నాగార్జునకొండ

దాని తరువాతి కాలమందు ప్రబలీనదియు విశేషప్రధానమైనదియు నాగార్జునకొండ. నాగార్జునకొండ మనకు బహుకాలపరిచితమైనను దాని యథార్థస్వరూపము గోచరించుటయు దాని మహత్త్వము గ్రహింపబడుటయు నాగార్జునసాగరనిర్మాణము నిశ్చితమైన తరువాతనే. మన జనసామాన్యము

ప్రాచీనత్వము తెలుపవలసి వచ్చునపుడు 'ఇక్ష్వాకులనాటిది' అని వ్యవహరింతురు. ఆ యిక్ష్వాకుల రాజధాని యీ ప్రాంతముననే. ఇక్ష్వాకు రాజ్ఞీమణులు నిర్మించినస్తూపము లందు గలవు. శ్రీరామతీర్థము గురుభక్తకొండపైని గలబౌద్ధాలయములును అనకాపల్లికడ నున్నశంకారము సంఘారామమును కొలది కాలముక్రిందటనే కనుగొనబడినవి.

## సాలెహుండము

శ్రీకాకుళముజిల్లాలో కళింగపట్నమునకు సమీపమున సాలెహుండ మను గ్రామము గలదు. వంశధారానది దక్షిణతీరము ననుసంధించి అరమైలు పొడుగు వ్యాపించి కొండ యొకటి కలదు. ఆ కొండపైని గొప్ప బౌద్ధస్తూపమొకటి చాలకాలముక్రిందటనే కనుగొనబడినది. కీర్తిశేషులు సుగృహీతనామధేయులు గిడుగు రామమూర్తిపంతులు 1920 సంవత్సర ప్రాంతమున పర్లాకిమిడి రాజావారి ఆదరము సంపాదించి కొంతభాగ మక్కడ త్రవ్వింపగా నతిప్రాచీన శిథిలములు గోచరించినవి. ఆకాలముననే మహోజ్జ్వలమైనచరిత్రాంశములు గోచరించు నని యాశపడితిమి. కాని ధనాభావముచే నక్కడితో నా త్రవ్వకము లాగిపోయినవి. మరల నీ నడుమ దొరతనము వారివలన నా ప్రాంతములు త్రవ్వింపబడునపుడు విశాలమైనతిన్నెలును మూడు బురుజులును బయలుపడినవి. కొన్ని శాసనములుగూడ లభించినట్లు వినికిడి. ఒక లోహకరండమును దానిలో గొన్ని రత్నములును దొరకినట్లు అక్కడివారు పత్రికలలో బ్రకటించినారు. పూర్తిగా త్రవ్విన నేయే విశేషములు బయలుపడునో కాని నాగార్జునకొండ త్రవ్వకము అతివేగముగా జరగవలసి యుండుటచే నిక్కడి సిబ్బంది అక్కడికి తరలింపబడి యిక్కడిపని నిలిపివేయబడినది. అయినను మనతరముననే దీని పూర్ణచరిత్రము తెలిసికొనగలుగుదు మను నాశ కలదు.

ఈ నడుమ సాలెహుండామును గూర్చి వార్తాపత్రికలలో రెండుమూడుమార్లు ప్రకటింపబడినది. ఆవార్తలందు ప్రకటింపబడిన విషయము లిప్పుడు దొరకినయాధారముల నాశ్రయించి ఊహింపబడినవే కాని ఇదమిత్థ మని నిష్కృష్టముగా దెలుపజాలినవి కావు. వీనికి జనశ్రుతిని జేర్చినచో స్పష్టమైనచరిత్రాంశములు లభించు నను నాశ కలదు. ఈస్థలమున సముద్రమువఱకు వ్యాపించిన గొప్పనగరము పూర్వముండెడి దనియు, శాలివాహనుని కీ నగరము రాజధాని యనియును, నది యీవలిగట్టున రాణివాస ముండెడి దనియు, నాయంతఃపురమే యిపుడు వనితమండల మని వ్యవహరింపబడుచున్న చిన్నగ్రామ మనియును, నగరమునకును అంతఃపురమునకును రాకపోకలకు శిలానిర్మిత మగువంతెన యుండెడి దనియు జనశ్రుతి ప్రబలముగా గలదు. ఇప్పుడు నదిలో వనితమండలమునకడనుండి సాలెహుండమువఱకు గొప్ప బండరాళ్లు వరుసగా నగపడుచున్నవి. ఇప్పటి కళింగపట్నమునకు తూర్పుగా రాజనివాసమైన కంచుకోట కలదనియు నది పురాతననగరముతో గూడ సాగరగర్భమున మునిగిపోయిన దనియు వృద్ధులు చెప్పుదురు. ఈ కింపదంతు లంధపరంపరాప్రాప్తములని త్రోసివేయ వలను గానివి. శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు సాలెహుండాము దిబ్బలు త్రవ్వించునప్పుడు వానిలో నొక శిలాంగుళీయకము దొరకినది. ప్రవాళశిలతో నిర్మింపబడిన ఆ యుంగరము కాశిరేగుపండు (కోడిగ్రుడ్డు) ఆకారముతో ఒకటిన్నర అంగుళముల నిడివియు నడుమ అరంగుళము వెడల్పును గలిగి అనామికాంగుళి దూఱునంతటి రంధ్రము గలిగి యున్నది. పై భాగమున బల్లపఱుపుగా నుండి చుట్టును ఎత్తయిన అంచును నడుమ ఏదో లిపిలో నేదో భాషలో నక్షరములును లోతు గుంటలుగా చెక్కబడినవి. ఆ యుంగరము తీరునుబట్టి అది రాజముద్రిక యని స్పష్టముగా తెలియును. రాజధానియందు రాజాధికృతుల నివాసములందే అట్టిముద్రిక లుండుట సంభవించును గాని కేవలము భిక్షుకనివాసము లగు సంఘారామములందు సంభవింపదు గదా? కాబట్టి యీ స్థలము హాలునికి గాని తదన్యుడగు వేఱొకరాజన్యునకు గాని రాజధాని యని నమ్ముట కవకాశము లేక పోలేదు.

మఱియు నిరువదేనువత్సరములకు మున్ను కాశీహిందు విశ్వవిద్యాలయము చరిత్రోపాధ్యాయులు భట్టాచార్యులవారు 'కాళిదాసుని నాటి కళింగనగర మేదియై యుండును' అని పరిశోధించుటకై యీప్రాంతమునకువచ్చికొన్ని

తావులు పరిశోధించినపిదప కళింగపట్టణము వచ్చిరి. అక్కడ వివిధస్థలములు పరిశోధించి యిప్పుడు దీపస్తంభము (లైటుహౌసు)నకును సముద్రమునకును నడుమ నున్న యొకదిబ్బ త్రవ్వింపఁగా నక్కడఁ గొన్ని ప్రాచీనము లైన శిథిలశకలములును గొన్ని నాణెములును దొరకినవి. ఆత్రవ్వక మపుడు పూర్తిగా నెఱవేఱిన నింతవఱకుం దెప్పుడో మన కనేకము లపూర్వవిషయములు తెలిసి యుండెడివి. కాని దైవదోషమున మన కా యోగము పట్టలేదు. ఆదినములలో కళింగపట్ణమున కాంపులో నున్న శ్రీకాకుళము తహసీల్దారు దిబ్బ గజము లోతు త్రవ్వఁసరికి వచ్చి ఆనాణెములు శకలములు తీసికొని తాను ఇండియా దొరతనము వారి కీవిషయము తెలిపెద ననియు, వారి యనుమతి వచ్చువఱకు త్రవ్వరా దనియు నాటంకపఱిచి సిమ్లాలో నున్న చరిత్రపరిశోధనాధికారికి (ఎపిగ్రాఫిష్టు ఆఫ్ ఇండియా) తంతి మూలకముగా నీవిషయము తెలిపెను. రెండు దినములనాటికి సిమ్లానుండి అది దొరతనము వారు త్రవ్వింతు రనియు నితరులు త్రవ్వరా దనియు సమాధానము రాగా దైవమును నిందించుచు భట్టాచార్యులవారు వారాణసికి తిరిగి పోయిరి. అప్పుడు భట్టాచార్యులవారికి సాయముగా పని చేసిన మా కీవిషయము లిప్పటికి కన్నులకు గట్టి యున్నవి. ఈరెండువిషయములనుబట్టి చూడ సాలెహుండము పూర్వపూర్వమున గొప్పరాజధాని యని యూహించుట సమంజసమే యగును.

శ్రీకాకుళం హైస్కూలు దిబ్బ :

సుమారు పదునేనేండ్లకు మున్ను శ్రీకాకుళము మున్సిపల్ హైస్కూలులో క్రొత్తగా గొన్నిగదులు కట్టుటకై పునాదులు త్రవ్వుచుండగా గొన్నిప్రాచీన శిథిలశకలములు దొరకఁగా వాని నీలగిరులలో ఉదకమండలమం దున్నపురాతత్వ శాఖవారికి పంపిరి. అప్పుడు ఆర్కిలాజికల్ సూపరింటెండెంటుగా నున్న శ్రీ సి. ఆర్. కృష్ణమాచారిగారు స్వయముగా దయచేసి స్థలపరిశోధనము గావించి ఆ శిథిలములు మొహంజదారో శిథిలములతో సమకాలికము లనియు వాని నచిరకాలమున త్రవ్వించి తీయింతు మనియు జెప్పి వెడలిరి. వారే కాదు. మరెవ్వరు గూడ నేటివఱకు మరల నాయుబు సెత్తనే లేదు. మున్సిపల్ వారు మాత్ర మాచోట వారికి గావలసినమందిరములు మొన్న మొన్న నిర్మించుకొన్నారు.

నరసన్నపేట :

నరసన్నపేటకు పడమట మైలుదూరమున నొక బంజరుదిబ్బ త్రవ్వుచుండగా పురాతన మైన పెద్దయిటుకలు బయలుపడినవి. ఆస్థలమును దున్నుటకు యత్నించినకర్షకుడు అది యేదో దేవాలయ మని భయపడి దానిని విడిచి పోగా భక్తులు కొందఱు అక్కడ నొక కాలురాతినుంచి అది వెలసినశివలింగ మని దానికొక యాలయము వెంటనే కట్టివేసిరి. జనుల మూర్ఖతవలన నాస్థల మట్లు నిరుపయోగ మైనది కాని యక్కడి యిటుకలు సాలెహుండాము ఇటుకలను బోలి పురాతనత్వము సూచించుచున్నవి. అది త్రవ్వి యుండిన నేవిశేషములు బయలుపడి యుండునో ?

కోటబొమ్మాళి రెయిలుస్టేషనునకు సమీపమున గల లక్కనదిడ్డి యనుగ్రామమున గూడ నొక పొలములో పురాతన మైనయిటుకలు, అప్పుడపుడు పాటిమట్టి త్రవ్వుచుండగా పురాతన మైననగలు దొరకుచుండును. ఈస్థల మెవ్వరును చూచినవారే కారు. శ్రీకాకుళము నరసన్నపేటతాలూకాలలో పెక్కుతావులందు పురాతన మైనయిటుకలు నగలు లభించుచునే యుండును. వానిని చూచిన నాబోఁటివారికి ప్రాంతమున ప్రతి అడుగు ప్రదేశమును పురాతనశిథిలములతో నిండియున్న దేమో యను నూహము కలుగుచుండును. వాని నన్నిటిని పరిశోధించుటకు ద్రవ్యము గాని సాధనసంపత్తి గాని అసలు శక్తి గాని అస్మాదృశులకు శూన్యము. దొరతనమువారికి గాని ఇతరవిద్యాధికులకు గాని యీ ప్రాంతమున కటాక్షము ప్రసరింపకుండుట ఎప్పుడు నున్నదే కదా ?

ఎప్పటికైన పెద్దలదృష్టి యీప్రాంతమున ప్రసరించినచో కళింగమందలి బౌద్ధావశేషము లనేకము లుపలబ్ధము లై కళింగచరిత్రము నత్యుజ్జ్వలముగాఁ దెలియు నవకాశముగలుగును. సర్వజ్ఞుని కృపారసమువలన మనతరమువనే యీపని జరగిన ఘనము ధన్యులము.

అమరావతి—

ఆంధ్రదేశమునందలి బౌద్ధక్షేత్రము లన్నిటిలోను అమరావతి మిక్కిలి ప్రసిద్ధి చెందినది. అది కృష్ణానదీ దక్షిణతీరమున సత్తెనపల్లి తాలూకాలో గుంటూరున కిరువదిమైళ్లుత్తరముగా నున్నది. నేఁ డది యొక కుగ్రామముగా నున్నను పూర్వ మీ అమరావతి, ధరణికోట కలసియున్న ప్రదేశములో ధాన్యకటక మను గొప్పనగర ముండినది. అది క్రీ. పూ 200 కాలమున నాంధ్రదేశమును బరిపాలించిన శాతవాహనులకు రాజధానీనగరముగా విరాజిల్లినది. అప్పుడు దాని వైశాల్యము పంద్రెండు చదరపుమైళ్లు. అందలి జనసంఖ్య సుమారు ముప్పది లక్షలు.

శాతవాహనుల కిది ముఖ్యపట్టణముగా నున్నప్పుడే యాంధ్రులు మగధదేశమును జయించి పాటలీపుత్రమును స్వాధీనము చేసికొనిరి. క్రమముగా నమరావతి బౌద్ధుల యధీనములోనికి వచ్చినది. వా రక్కడ ననేక విహారములను నిర్మించి, యొక విశ్వవిద్యాలయమును గూడ స్థాపించిరి. విద్యార్థులు, నధ్యాపకులుఁ గలిసి సుమారు ఆరువేలమంది యీ విశ్వవిద్యాలయములో నుండెడివారు. ఆకాలమున టిబెట్, చైనా, బర్మా, జపాన్, సింహళము మొదలయిన దేశములనుండి కూడ నెందఱో విద్యార్థు లీ విశ్వవిద్యాలయమున విద్య నభ్యసించుటకై తరలి వచ్చుచుండెడివారు. బౌద్ధమతమున మాధ్యమిక వాదమును బ్రవర్తింపఁజేసిన నాగార్జునాచార్యుఁ డా విశ్వవిద్యాలయమున కధ్యక్షుఁడుగా నుండి బౌద్ధమతప్రచారమునకు విశేషముగాఁ బరిశ్రమించెను. కాని క్రమముగా దాని ప్రాముఖ్యము తగ్గిపోయినది.

అమరావతిలోఁ బూర్వ మొక గొప్పస్తూపముండినది. దానికి 'అమరావతీ స్తూపము' అని పేరు. అది యిప్పుడు పాడుపడి పోయి పాటిదిబ్బగా నున్నది. స్థానికులు దానిని దీపాలదిన్నె యని పేర్కొనుచుందురు. దాదాపు పంద్రెండవ శతాబ్దివఱకు నాస్తూపరాజ మచటి ప్రజలచేఁ బూజల నందుకొనుచుఁ బ్రసిద్ధి వహించి యుండినది. కాని పదునెనిమిదవ శతాబ్ది తుదిభాగమున స్థానికపాలకు లచటి పాలరాళ్లను గాల్చి తమభవననిర్మాణమునకుఁ గావలసిన సున్నమునకై బట్టీ పెట్టినారు. దానితో నా పవిత్ర బౌద్ధక్షేత్రములోని శిల్పకళాసంపద చాలవఱకు దగ్ధమై పోయినది.

తరువాత పురాతత్త్వపరిశోధకులు, ముఖ్యముగా కర్నల్ మెకంజీ, రాబర్టు సూయల్ మొదలగువారు దానిని దిరిగి సముద్ధరించుటకుఁ దీవ్రముగాఁ బ్రయత్నించిరి. అప్పటి వారి ప్రయత్నమువలన బయలువడినశిల్పశిథిలములే నేఁడు మదరాసు పురావస్తుప్రదర్శనశాలలో భద్రపఱుపఁబడి యున్నవి. అచ్చటి యపూర్వశిల్పసమన్వితము లయినస్తూపశిలలును, ప్రాకారశిలలు కొన్నియు లండను నగరము చేరినవి. అవి యచట బ్రిటిషు పురావస్తు ప్రదర్శనశాలలో భద్రముగా సంరక్షింపఁబడుచున్నవి.

భారతీయశిల్పములో నమరావతీశిల్ప సంప్రదాయము విశిష్ట మయినది. దీనినిబట్టియే 'అమరావతీరీతి' (Amaravati Style) యని శిల్పసంప్రదాయ మొకటి దేశమునఁ బ్రసిద్ధి గాంచినది. ఈ శిల్పరీతియచ్చముగాఁ గొంత బాహ్లీకశిల్పరీతితోఁ బోల్పఁదగి యున్నది. కాని యీ యమరావతీ స్తూపములోని కొన్ని శిల్పశిలాఫలకములును, శిలాప్రాకారములోఁ గొంతభాగమును స్తూపనిర్మాణము జరిగిన కొంతకాలమునకు క్రీ. శ. రెండవ శతాబ్దిలోఁ జేర్పఁబడి యుండవచ్చుననుటలో సందేహము లేదు.

అమరావతీస్తూపప్రాకారమువలె లలితమయిన, యున్నత మయిననిర్మాణము ప్రపంచములోనే మఱియెచ్చటను గానరా దనిపండితుల విశ్వాసము. దాని వ్యాసము 192 అడుగులు. వేదికమీఁది యగ్రమునుండి దానియెత్తు 13 లేక 14 అడుగులు. మూఁడేసి యడ్డురాళ్లు కలిపి నిలిపిన పొడవైన నిలువు స్తంభములతో నది కట్టఁబడి యున్నది. ఆ యడ్డరాతి కమ్ములపై చక్రాకారములు, అర్ధచక్రాకారములు గల యలంకారములు, వానిమధ్య ముగ్ధమోహనము లయినయద్భుతశిల్పములు కలవు. ఈ ప్రాకారశిలలు వెలుపలివైపునకన్న లోపలివైపున నపూర్వశిల్పసమన్వితములై యందముగా నున్నవి. చక్రాకారపు భాగములలో బౌద్ధగాథలు మిక్కిలి మనోహరముగఁ జెక్కఁబడి యున్నవి. దాని యడుగుభాగమున జంతువుల బొమ్మలు, పిల్లలబొమ్మలు వివిధభంగిమలతో, వింతవింతరీతులలోఁ జెక్కఁబడి యున్నవి,

ఆస్తూపపు వేదిక నూటయరువదిరెం డడుగుల వ్యాసము గలది. ఆవేదిక చుట్టును గలశిలాఫలకములమీఁదఁ గూడ నద్భుత మైనశిల్పకళాచాతుర్య ముట్టిపడుచున్నది.

వంద యడుగులయెత్తును, నంద మయిన చెక్కడములతో, నపూర్వ మయినశిల్పకళాసంపదతో నలరారు పాలరాతి స్తూపము, దానిని జుట్టి యొక శిలాప్రాకారము, అచటి శిలలపైఁ బ్రతియంగుళమునకు నేదో యొక శిల్పము—ఇట్టి యమరావతీస్తూప మాకాలమునఁ బ్రపంచమునందే యద్వితీయముగా నుండి యుండు ననుటకు సందేహము లేదు. ఈప్రధాన స్తూపముచుట్టును నెన్నియో చిన్నచిన్న చైత్యములు, నారామములు కూడ నుండినవి. బౌద్ధపర్వదినములలో—ముఖ్యముగా బుద్ధుని జననము, మహాభినిష్క్రమణము, మహాపరినిర్వాణము జరిగినవైశాఖపూర్ణిమ నాఁడాస్తూపముపై నంతటను దీపములతో నలంకరించుచుండి రని తోఁచుచున్నది. అందుచేతనే యచటి స్థానికులు దానిని 'దీపాలదిన్నె' యను నామముతో వ్యవహరించుచుందురు.

ప్రస్తుతము దీనికి సమీపముననే మఱియొక దిబ్బ యున్నది. బహుశః అది పూర్వపు ధాన్యకటకస్థాన మయి యుండవచ్చును. పూర్వకాలమున నది యొక ప్రాకారావృత మయిననగరముగాఁ బేర్కొనఁబడి యున్నది. అచ్చట శిథిలమై యున్న ధరణికోట మట్టిగోడలు నేఁటికిని మనకుఁ గానవచ్చుచున్నవి. అచ్చట లభించిన కుండపెంకులు మొదలగు ప్రాచీన శిథిలావశేషములు క్రీ. పూ. ఒకటవశతాబ్దినాఁటివిగాఁ గూడ భావింపఁబడుచున్నవి. ఇటీవల నచటి దీపాలదిన్నెప్రాంతమున భూగర్భములో శాతవాహనులనాఁటి యెనిమిదివేలవెండినాణెములు దొరకినవి. అవి పరిశోధననిమిత్తము విశాఖపట్టణము పురాతత్త్వశాఖవారి కార్యాలయములో భద్రపఱుపఁబడినవి. ఇంకను నచట శాస్త్రీయ మయినపరిశోధన సాగించినచో నెన్నియో యమూల్య శిల్పకళాఖండములతోఁ బాటు, ఎన్నియో యమూల్యవిషయములు కూడ బయలుపడ వచ్చును.

నాగార్జునకొండ—

కృష్ణానదికిఁ గుడివైపున గుంటూరుమండలములో నున్న నాగార్జునకొండ కూడ ప్రాచీనాంధ్రబౌద్ధక్షేత్రములలోఁ బ్రసిద్ధి గాంచినది. అది మూఁడుమైళ్ల వెడల్పునఁ బర్వతములచే నావరింపఁబడి యున్నయొకలోయ. బౌద్ధమతమున మాధ్యమికవాద మనునొక వాదమును నెలకొల్పి సుమారు అరువదిసంవత్సరములపాటచ్చటి బౌద్ధవిశ్వవిద్యాలయమును బరిపాలించిన సుప్రసిద్ధబౌద్ధాచార్యుఁ డగునాగార్జునాచార్యుని 'పేరిట' నాకొండకు 'నాగార్జునకొండ' యని పేరు కలిగినది. అతఁడు క్రీ. శ. రెండుమూఁడు శతాబ్దములలో నుండినవాఁడు.

ఇక్కడి లోయలోఁ బూర్వము విజయపురి యను నొక ప్రసిద్ధపట్టణ ముండిన ట్లిచట లభించిన యొకశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. అది యాప్రాంతము నాకాలమునఁ బరిపాలించిన యిక్ష్వాకుల ముఖ్యపట్టణము. ఇక్ష్వాకు లిక్ష్వాకువంశమునకుఁ జెందినరాజులు. వీరు ఋగ్వేదములోను, నథర్వణవేదములోను, శతపథబ్రాహ్మణములోను బ్రస్తావింపఁబడిరి. దక్షిణ ఇక్ష్వాకువంశమునకు మూలపురుషుఁడు ప్రథమశాంతిమూలుఁడు కావచ్చును. ఇక్ష్వాకులు బ్రాహ్మణమతావలంబకులు. కాని వారి స్త్రీలు బౌద్ధమతము నవలంబించి యాదరించిరి. వారి యాదరమువలననే యాకాలమున బౌద్ధమతము మూఁడుపూవు లాఱుకాయలుగా వర్ధిల్లినది. విజయపురి యానాఁటి బౌద్ధక్షేత్రములలోఁ బ్రసిద్ధి కెక్కినమహానగరము. అచటి విశ్వవిద్యాలయమున విద్య నభ్యసించుటకై సింహళము, చీనా మొదలగుదేశములనుండి యెందఱో విద్యార్థులు వచ్చుచుండిరి. అది చాలకాలము బౌద్ధమతావలంబకులకుఁ బ్రసిద్ధయాత్రాస్థలముగా నలరారినది.

ఇక్కడి మహానగర శిథిలములు క్రీ. శ. 1926 లో మొదటిసారిగా బయలుపడినవి. దిబ్బలతో, గుట్టలతో, నడవులతో నిండియున్న యాప్రాంతములందలి విశేషములను దొలుత గనుగొని పరిశోధనలు సలిపినవాఁడు శ్రీ ఎ. ఆర్. సరస్వతి. ఆ తరువాత 1926-31, 1938-40 లలో లాంగర్స్, రామచంద్రన్ అనుమహనీయు లాప్రదేశమునశాస్త్రీయమయిన త్రవ్వకములుసాగించి యనేకాపూర్వవిషయములను లోకమునకు వెల్లడించిరి. అచట కృష్ణానదిపై వ్యవసాయోపయోగములకై కట్టఁదలఁచిన నాగార్జున సాగరనిర్మాణముమూలమున

నాచరిత్రప్రసిద్ధప్రాంతములు నీట మునిఁగిపోవు ననియు, నచటి యమూల్యశిల్పములు శాశ్వతముగా సముద్రగర్భమునఁ గలిసిపోవు ననియు భయపడి యిటీవల 1954 లోఁ దిరిగి యచటఁ ద్రవ్వకపు పరిశోధనలు సాగించుచున్నారు. అచట లభించినశిథిలావశేషముల నన్నే యీ ప్రాంతమునందే కట్టనున్న పురావస్తుప్రదర్శనశాలలో జాగ్రత్తగా భద్రపఱుచుటకుఁ బ్రయత్నించుచున్నారు.

ఇంతవఱకు జరిగినపరిశోధనల ఫలితముగా నచట నొకమహాస్తూపము, ఏడు చిన్నస్తూపములు బయలుపడినవి. నాలుగు విహారములు, ఆరు చైత్యములు, నాలుగు మండపములు కూడఁ గనిపించినవి. పరిశోధనలో శాసనములు, నాణెములు, బొమికలు, కుండలు, విగ్రహములు, ఇక్ష్వాకుల శాసనములు గలిగిన లోహపురేకులు కానవచ్చినవి. అన్నింటికంటె ముఖ్య మయినది యచటి మహాచైత్యమునకు సంబంధించిన చిహ్నము. అది బుద్ధునికి సంబంధించినదని ప్రతీతి కలదు. ఇప్పుడు దీనిని సారనాథ్ లోని మూలగంధకుటీవిహారమునఁ బూజించుచున్నారు. ఆసార్‌నాథ్‌లోనే బుద్ధుఁడు మొట్టమొదటిసారిగా ధర్మోపన్యాసము గావించినాఁడు. మఱొకవిశేషము పేర్కొనఁదగి యున్నది. అక్కడి పురాతనవిశ్వవిద్యాలయప్రదేశమును, హ్యూయన్‌సాంగు వర్ణించిన బౌద్ధసంఘారామమును నిక్కడనే యుండి యుండును. ఆ సంఘారామమును నాగార్జునుని కొఱకై శాతవాహనప్రభు వొకఁడు శ్రీపర్వతమును దొలిచికట్టినట్లు వ్రాసియున్నాడు. నాగార్జునకొండకే పూర్వకాలమున 'శ్రీపర్వత' మని పేరు. 'మిక్కిలి పొడవైన వసారాలతో, ఐదు అంతస్తులతో, ప్రతియంతస్తులోను నాలుగేసి గదులతోను, విహారములతోను భవన మొకటి నిర్మింపఁబడినది. ప్రతివిహారములోను బంగారములోఁ దయారు చేసిన యతిసుందర మయినబుద్ధవిగ్రహ ముండెడిది' అని హ్యూయన్‌సాంగు వ్రాసి యున్నాఁడు. ఇంతసుందర మయినసంఘారామ మింతవఱకుఁ బరిశోధకులు కనుగొన లేదు.

అచ్చటి నిర్మాణము లన్నియుఁ గాల్చిన యిటుకలతోను, మట్టి సున్నములతోను గట్టి గోడలు గచ్చు చేసినట్లు కానవచ్చును. అచటి స్తంభములు, నేల, కొన్ని ముఖ్య మైనశిల్పములుబూడిదరంగు లేక తెల్లనిసున్నపురాతితోఁ జేయఁబడినవి. ఆస్తూపముల వేదికలను గప్పిన శిలాఫలకములపై మామూలు స్తూపప్రతిబింబములనే చెక్కుచుండిరి. ఆయకస్తంభవేదికల మీఁది శిలాపఫలకములపై బుద్ధునిజీవితములోని ముఖ్యఘట్టములును, జాతకకథలును జిత్రింపఁబడినవి.

ఈ కట్టడములశిల్ప మమరావతీ శిల్పమును బోలి యున్నది. అచటఁ గనుగొనఁబడిన ప్రాచీన శిథిల నిర్మాణములలో మహాచైత్య మొకటి. అది యొక యున్నతప్రదేశమున నిర్మింపఁబడినది. దాని నడిమికొలత డెబ్బదినుండి యెనుబది యడుగు లుండును. శిఖరోపరిభాగము నందమయినపాలరాళ్లతో నిర్మించి యున్నారు. ఆ స్తూపనిర్మాణక్రమము ఆకులును, గుబ్బయుఁ గల చక్రాకారము గలిగి యున్నది. బెంజమిన్ రోలండి యనుపరిశోధకుఁ డది 'విశ్వచక్రపునాభికిఁ జుట్టిన పునః పునరావృత్తము లైనయేకకేంద్రకవృత్తములకు సంకేత' మని పేర్కొని యున్నాఁడు. ఆ స్తూపమునకు వెలుపట బహిర్ద్వారములతోఁ గూడిన శిలాప్రాకార మొకటి యుండినట్లు తెలియుచున్నది. దానిపునాది యిటుకలతోఁ గట్టినట్లు తోఁచును. అందలి యుత్తరపువైపు గోడకడనే 'బుద్ధధాతువు' లభించినది.

కృష్ణానది లోయలలో క్రీ. వె. రెండు మూఁడు శతాబ్దములలో బౌద్ధసంస్కృతి, శిల్పము లెట్లుండినవో యిచట లభించినలోహశాసనముల మూలమునఁ దెలియుచున్నది. అక్కడి మహాస్తూపములోని శిలాస్తంభముపైఁ గల శాసనమున నక్కడ చైత్యవిహారాదులు కట్టించిన మహారాజులపేర్లు కొన్ని కానవచ్చుచున్నవి. అక్కడ దొరకినశిల్పకళాఖండములకును, నమరావతిలో దొరకినవానికిని బోలికలు కలవు. బౌద్ధమత మాకాలమున నుత్తమశిల్పకళావిర్భూతికిఁ గారణభూత మయిన దను విషయ మక్కడి శిల్పఖండములు తెలియఁ జేయుచున్నవి.

జగ్గయ్యపేట—

ఈ ప్రాచీన బౌద్ధక్షేత్ర మమరావతికి వాయవ్యమున మూఁడుమైళ్ల దూరములోఁ [illegible]

నాలుగుమైళ్ల దూరమున నున్నకృష్ణానదిలోఁ గలియును. ఆదిలో దీనికి 'చేతవోలు' అని పేరు. నాఁ డమరావతీ ప్రాంతమును బరిపాలించిన వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారా గ్రామమునకుఁ జుట్టును గోడకట్టి, యచటికిఁ గొందఱు వర్తకుల నాహ్వానించి తమ తండ్రిగారి పేర నా గ్రామమునకు 'జగ్గయ్యపేట' యని నామకరణము చేసినారు.

అచట నిటుకలతోఁ గట్టినదిబ్బలలో దొరకిన యొక శిల్పశిలాఫలకమును బట్టి యాప్రాంతములం దేవో కొన్ని ప్రాచీనస్తూపము లుండి యుండు నని యనుమానింపఁబడెను. మరునటి సంవత్సరమే బర్గెస్ అనుమహనీయుఁ డచటికిఁ బోయి చూచునప్పటికి రాళ్లు రప్పలకుఁ ద్రవ్వి పాడు చేయుఁగా మిగిలినస్తూప మొక్కటే యాతనికిఁ గానవచ్చినది. దానిని ద్రవ్వి చూడఁగా నా స్తూపపునడిమి కొలత మూఁడున్నర యడుగు లుండినది. అచటి శిలాఫలకములు కూడ నచ్చముగా నమరావతిలో దొరకినవాని వలెనే యుండినవి. స్తూపమును జుట్టి యుండిన ప్రాకారము పూర్తిగా నాశన మయినది. స్తూపాంతర్భాగము మట్టితోను, నిటుకలతోను గట్టఁబడి యుండెను. వేదికచుట్టును గలశిలాఫలకములలో నేవో కొన్నిటి పైనఁ దప్పఁ దక్కినవానిపై శిల్పములు కానరావు. కొన్ని కొన్ని సంధానశిలలపైఁ జెక్కినశిల్పములు మాత్రము భార్హుతశిల్పమును బోలి యున్నవి. అమరావతిలోని తొలి శిల్పరీతి కూడ నట్లే యుండినది. కొన్ని శిలలపై రెండవశతాబ్దికిఁ జెందిన మౌర్యలిపిలోఁ జెక్కిన శాసనము లున్నవి. వేదికను జుట్టియున్న శిలాఫలకముపై నెక్కువ లోతునకు దిగనట్లుగా నమరావతిలో వలెనే శిల్పములు చెక్కఁబడి యున్నవి. ఆ యొక స్తంభవేదిక యొక్క తూర్పుభాగమునఁ దప్పఁ దక్కిన మూఁడుదిక్కులందును స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి. ఆ చుట్టుపట్టుల యందుఁ బెద్ద పెద్ద స్తంభములు పడి యున్నవి. వానిలోని యొక స్తంభముపై మూఁడు నాలుగు శతాబ్దములకుఁ జెందినశాసన మొకటి కలదు. హీనయానకాలమునకు సంబంధించినశిల్పము లెన్నియో యచ్చట మనకుఁ గానవచ్చును. అదియే జగ్గయ్యపేటకు, బౌద్ధాంధ్రక్షేత్రములలోఁ గల ప్రాధాన్యము.

గోలి—

ఇది గుంటూరు మండలములోని పలనాడు తాలూకాలో కృష్ణానదికి నుపశాఖ యగుగోళ్లేరుపైఁ గలదు. క్రీ. శ. 1926 లో డాక్టరు డూబ్రాయిల్ ఇచ్చట నొక చిన్నస్తూపమును ద్రవ్వించెను. ఈ ప్రదేశమునే నూవెల్ 'మల్లవరము' అని పేర్కొనినాఁడు. ఇచట లభించిన శిలాఫలకములు నేఁడు మనరాసులోని పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపఱుపఁబడి యున్నవి. సుప్రసిద్ధ పురాతత్త్వ పరిశోధకులు శ్రీ. టి. యన్. రామచంద్రన్ గారు వానిని గూర్చి మదరాసు పురావస్తు ప్రదర్శనశాలవారి పక్షమున నొక 'బులెటిను'ను బ్రకటించిరి. ఇచటి శిల్పరీతికిని, క్రీ. శ. మూఁడవ శతాబ్దికిఁ జెందిన యమరావతి తుదికాలపు శిల్పరీతికిని దగ్గఱ సంబంధ మున్నట్లు తెలియుచున్నది.

ఘంటసాల—

ఇది కృష్ణామండలమందలి దివి తాలూకాలోని మచిలీపట్టణమునకుఁ బశ్చిమముగాఁ బదుమూఁడు మైళ్ల దూరమున నున్నది. క్రీ. శ. 1920 లో నిచట నొక శిలాఫలకము లభించినది. దానినిబట్టి యిచట నొక గొప్ప బౌద్ధస్తూపము కల దని తెలియవచ్చినది. ఆ శిలాఫలకముపై నమరావతిలోని శిల్పమువలెనే చెక్కిన శిల్ప మొకటి కలదు. అది సిద్ధార్థుఁడు సన్యసించిన పిదపఁ గపిలవస్తు నగరమునకుఁ దిరిగి వెళ్లుచున్న 'కంటక' మను నాతని యశ్వరాజము యొక్క చిత్రము. బహుశః అది యచ్చటి స్తూపవేదికను గప్పినదై యుండవచ్చును. ఏది యెట్లున్నను బాస్వెల్ దొర క్రీ. శ. 1871 నాఁడే యచటి దిబ్బనుగూర్చి ప్రస్తావించి యుండుట గమనార్హము. దానినడుమ ఘనచతురస్రాకారపు టిటుకనిర్మాణ మొకటి కలదు. దానినుండి నాలుగు అడ్డగోడలు విస్తరించి వెలుపటి ప్రాకారమును దాకునట్లున్నది. దాని చుట్టును నొక ప్రదక్షిణమార్గము కూడఁ గలదు. ఆ నిర్మాణము నాలుగుదిక్కులందును ముందునకుఁ గొంచెము విస్తరించుకొని యున్నది. ఈ ప్రదేశమందు లభించిన యితర శిలాఫలకము లేవియు నంత చెప్పుకొనఁ దగినవి కావు.

**గుడివాడ—**

ఇది మచిలీపట్టణమునకు వాయవ్యమున కిరువది మైళ్ళ దూరములో నున్న పట్టణము. ఇది యొక తాలూకా కార్యస్థానము. క్రీ. శ. 1870 లోఁ దొలిసారిగా బాస్వెల్ దొర యిచట నొక స్తూపమున్నట్లుగా గుర్తించినాఁడు. అచటి స్థానికులు దానిని 'లంజదిబ్బ' యని పేర్కొందురు. ఎవరో యొక భోగము పిల్ల యొక్క-పూట మాత్రమే భుజించుచు నచట నివసించి యాదిబ్బను గట్టినట్లు అచ్చట నొక యైతిహ్యము చెప్పుదురు. ఈ దిబ్బను గూడ నాయూరివారిటుకలకై త్రవ్వించిరి. ఆతరువాత సూయల్, బర్గెస్ దొరలు కూడ నాప్రదేశమును సందర్శించిరి. అచ్చటి స్తూపము సాంచిస్తూపాకారమును గలిగియున్నదని సూయల్ వ్రాసియున్నాఁడు. అచటి స్తూపవైశాల్యము దాదాపు నూటనలుబది చదరపుటడుగులు. ఆచుట్టుపట్టుల నెచ్చటను దాని ప్రాకారశిలాస్వరూపము కానరాకుండుటచేత నా ప్రాకారము కొయ్యతోనో లేక యిటుకలతోనో కట్టఁబడియుండునని యూహింపఁబడుచున్నది. ఆస్తూపమునందు స్ఫటికశిలావశేషములతోడి నాలుగు శిలావేదికలు లభించినవి. కాని యీవేదికలాస్తూపమునకేభాగమునఁ బాతిపెట్టఁబడినవో నిశ్చయముగా జెప్పుట కాధారములు కానరాలేదు.

క్రీ. శ. 1894 లో అలెగ్జాండర్ రియా యాప్రదేశమునఁ గొంత ఖననపరిశోధన సాగించినాఁడు. అచట నిటుకలతోఁ గట్టిన వలయాకారపు నిర్మాణము లేవో యున్నట్లు మాత్ర మప్పుడు తెలియవచ్చినది. కాని యాప్రదేశము మిక్కిలి చిన్నదగుటచేతను, నది చాల పాడుపడిపోయి యుండుటచేతను నింకను వివరములు తెలిసికొనుటకై పరిశోధనలు సాగించుటకు వీలు లేకపోయినది.

ఆచుట్టుపట్టుల లభించినయిటుకలు, కుండపెంకులు, నాణెములు, పూసలు మొదలగునవి యాప్రదేశమునఁ బూర్వ మెప్పుడో యొక మహానగర ముండి యుండునని సూచించుచున్నవి. ఆ నాణెములలోఁ గొన్ని యాంధ్రచక్రవర్తులు వేయించినవి. అందొక చిత్రమయిననాణె మున్నది. దానిపై--రోమనులదో, గ్రీకులదో తెలియదు—ఒక పడవ—అర్ధచంద్రాకారపు నిర్మాణము కలది—రెండు తెరచాప దూలములు—ఎద్దు ఆకారము గల యొక చుక్కాని——ఇవి యందలి వివరములు. ఆప్రదేశ మంతయు నొకప్పుడు ప్రాకారావృతమై యుండునట్లుగా నక్కడి సలజ్ఞాలు చెప్పుచున్నాఁగ. అక్కడ తొంబది తొమ్మిది బౌద్ధ స్తూపములు కూడ నుండెడివఁట!

**భట్టిప్రోలు:—**

ఇది గుంటూరు మండలమునందలి రేపల్లె తాలూకాలో నున్న యొక చిన్నగ్రామము. అచట నొక బౌద్ధస్తూప నిర్మాణావశేష మున్నది. దీనినిగూర్చి క్రీ శ. 1870 లో బాస్వెల్ కొంత వివరించియున్నాఁడు. తరువాత నాప్రదేశమును సర్ వాల్టర్ ఇలియటు, సూయల్ ప్రభృతులు సందర్శించి యాస్తూపము సంపూర్ణముగా నాశనమయినదనియు, నందలి శిల్పశిలాఫలకము లేవియుఁ గానవచ్చుట లేదనియు వ్రాసిరి. కాని క్రీ.శ.1892లో అలెగ్జాండర్ రియా యాప్రదేశమునఁ గొంత ఖననపరిశోధన సాగించాఁడు. తత్ఫలితముగా నచట శాసనములతోఁ గూడిన మూఁడు పేటికలు, వానిలోఁ గొన్ని యాభరణములు, స్ఫటికములు మున్నగునవి లభించినవి. ఆస్తూపము యొక్క నడిమికొలత నూటముప్పదిరెండడుగులు. దానిచుట్టును నూటయెనిమిది యడుగుల వెడల్పు గలపునాది యున్నది. అచ్చట లభించిన శిథిలావశేషములు మదరాసు పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపఱుపఁబడి యున్నవి.

అచ్చటి స్తూపమును గప్పిన శిలాఫలకము లేవియు నేఁడు కానవచ్చుట లేదు. కొంత దూరమువఱకు మాత్రమే యచటి ప్రాకారశిలలు కొన్ని చెదరులు చెదరులుగాఁ బడి యున్నవి. అచ్చట లభించిన పాలరాతి ఛత్రమునందు జగ్గయ్యపేటలోని ప్రాచీన శిల్పరీతి కొంత గోచరించుచున్నది. అక్కడ దొరకిన పేటికలపైఁ బాళీభాషలోఁ దొమ్మిది శాసనములు కలవు. అందలి శాసనలిపి యశోకుని కాలపు శాసనలిపిని బోలి యుండి దాని ప్రాచీనతను జాలవఱకు నిర్ధారణ చేయుచున్నది.

**గుంటుపల్లి—**

పశ్చిమగోదావరి మండలములోని, యేలూరు తాలూకా కామవరపు కోటకు నాలుగుమైళ్ళ

దూరమున నీ గ్రామము కలదు. అజంతా, పితల్‌ఖోరా లను ప్రదేశములకడ నున్నట్లే గుఱ్ఱపుడెక్క యాకారము గల కొండచరియలోఁ దొలువఁబడిన బౌద్ధ నిర్మాణములు, స్తూపములు, చైత్యములు, విహారములు నున్నవి. ఇవి కాక యీ సమీపమునందే యిటుకలతోఁ గట్టిన చైత్యశిథిల మొకటియు, శిలానిర్మిత మైన స్తూప మొకటియు, పెద్దమంటప మొకటియు నున్నవి. వీనియం దన్నిటిలోను వృత్తాకారము గలచైత్య నిర్మాణము మిక్కిలి ముఖ్యమయినది.

నిర్మాణపద్ధతిలో నా చైత్యము వర్తులాకారమున నున్నది. మధ్యశిలలోఁ దొలువఁబడిన పెద్దస్తూపపు నమూనా యున్నది. దానిపై మామూలుగానే రాతికప్పు, దూలములు కూడ నందే తొలువఁబడినవి. ద్వారమునకు మీఁద నున్న కిటికీ గుఱ్ఱపుడెక్క యాకారము గలది. ఈచైత్యవాతాయన మచ్చముగా బీహారులో గయకు సమీపమున నున్నబరబర్‌లోని లోమశ ఋషి శిలాచైత్యనిర్మాణముతోఁ బోల్పఁదగి యున్నది. ఇచటివలెనే యచటఁ గూడ నొక గుండ్రనిమందిర మున్నది. ఈ బరబర్ గుహలయము లశోకునికాలపు బౌద్ధు లెవరో తొలిచినట్లు తోఁచుచున్నది. గుంటుపల్లి చైత్యమునకును, వీనికిని గలసామ్యమునుబట్టి వాని తరువాత నిది వెంటనే తొలువఁబడిన దేమో యను నభిప్రాయము కూడ నొకటి లేకపోలేదు. ఈ చైత్యమునకు సమీపముననే బౌద్ధసన్యాసుల కొక యారామ మున్నది. అది కూడ మిక్కిలి ప్రాచీన మయినవిహారముగనే తోఁచును.

ఆదుఱ్ఱు—

ఇటీవలనే యిచట నొక బౌద్ధమహాస్తూపమును గుర్తించుట జరిగినది. ఇది పశ్చిమ గోదావరి మండలమున రాజోలు తాలుకాలోని నగరముసమీపమునఁ గలదు. గోదావరి సముద్ర సంగమమున కారుమైళ్ళవతల, దాని యుపనదియైనవైనతేయకుఁ బడమటిగట్టున నిది యున్నది. ఇచ్చటి జమీందారే యిక్కడ నున్నస్తూపపుదిబ్బను త్రవ్వించిరి. ఈదిబ్బ నిక్కడివారు 'దూబలాజుగుడి' యని పిలుతురు. పురాతత్త్వశాస్త్రజ్ఞులు దానిగూర్చి తెలిసికొనుటకై కొంత పరిశోధనలు సలిపిరి. తత్ఫలితముగా నచ్చట బయల్పడిన నిర్మాణములలో నరువది యారడుగుల నడిమికొలత గల మహాస్తూపము పేర్కొనఁదగి యున్నది. దాని చుట్టును నెత్తయినవేదికయు, నాలుగు ప్రక్కలను నాయక స్తంభములును గలవు. ఈ ప్రాంతములో నటునిటు త్రవ్వఁగా బయల్పడిన యిటుకలనుబట్టి దీనిచుట్టు నెన్నియో బౌద్ధారామము లుండి యుండె నని యూహింపనగుచున్నది. తూర్పుగోదావరి మండలమున నేఁటివఱకుఁ గానవచ్చిన బౌద్ధశిథిల మిది యొక్కటియే యగుట దీనిప్రాధాన్యమును వెల్లడి చేయుచున్నది.

శంకారము—

అనకాపల్లి రైలుస్టేషనునకు రెండుమైళ్లుత్తరముగా నున్నరెండు వరుసకొండలపైనఁ గొన్ని బౌద్ధనిర్మాణశిథిలము లున్నవి. అచటనే శిలానిర్మితము లగుదగోబాలు, స్తూపములు, గుహాలు నెన్నియో గలవు. అచ్చటి తూర్పు కొండపై నారామములే కాక, తొలిచినవి, కట్టినవి యగుదగోబా లెన్నియో యున్నవి. అచ్చటి గుహాలయములయొక్కయు, చైత్యాలయములయొక్కయు నిర్మాణకాల మొకటి, రెండు శతాబ్దము లయి యుండవచ్చు నని భావింపఁబడుచున్నది. తరువాతఁ బల్లవుల కాలమువఱకు నాప్రాంతము బౌద్ధుల కావాసముగానే విరాజిల్లుచు వచ్చినది.

రామతీర్థము—

విశాఖపట్టము మండలములోని రామతీర్థము దగ్గఱఁ గూడఁ గొన్ని బౌద్ధశిథిలావశేషములు కానవచ్చినవి. ఇచటి గురుభక్తకొండపై నొక బౌద్ధారామముయొక్క యునికి తెలియ వచ్చినది. ఇది కాక యనేక చైత్యాలయములు, నొకస్తూపము కూడ నిచటఁ గనుగొనఁ బడేనవి. వానిలో నిటుకలతోఁ గట్టినచైత్యములు కొన్ని ప్రాచీనము లయినవి కావచ్చును. ఇచటఁ గావింపఁబడిన ఖననపరిశోధనమువలనఁ బ్రాచీనకాలమునాఁటి కుండలు, పెంకులు ననేకములు బయల్పడినవి. ఈ గురుభక్తకొండకుఁ బశ్చిమముగా నున్నదుర్గాకొండపైఁ గూడఁ గొన్నిబౌద్ధారామము లుండినవి. కాని యవి తరువాత జైనవసతు లయి పిదప హిందువుల కావాసములుగా మారినవి.

—:o:—

# మాధ్యమికవింశతి

డాక్టరు జి. వి. కృష్ణరావుగారు

—*—

మూలము : నాగార్జునులు

పలుకునకు నందకున్నఁ దత్త్వంబు పరమ
కరుణతోఁ జూపినట్టి ప్రజ్ఞానిధికి
ధూతరాగోత్తమునకు బుద్ధున కచింత్య
శక్తి కర్పింతు నిదె నమస్కారశతము.

పారమార్థికదృష్టి నుత్పత్తి లేదు
లేదు విలయమ్ము, గగనమ్మునీలవాఁడు
బుద్ధదేవుండు, మఱి యట్టిపోల్కి నొప్పు
సత్త్వములు గూడ నేకలక్షణము లగుచు.

ఉభయతటమందు జాతి యయుక్త మగును
ప్రత్యయోద్భూతి సంస్కృతార్థనికరమ్ము
సర్వ మెఱిఁగికొనినవాని జ్ఞానదృష్టి
యందుఁ దత్త్వమ్ము శూన్యమ్మ యగుచుఁ దోఁచు.

భావములు సర్వమును స్వభావమ్ముచేతఁ
బ్రతిమ లట్టివ యంచుఁ జెప్పంగఁబడియె
అమలములును శాంతస్వభావాద్వయములు
అలతథాతయు నొప్పు తుల్యంబు లగుచు.

తత్త్వజిజ్ఞాసచేతఁ బృథగ్జనుండ
నాత్మయం దాత్మ కల్పించె నట్టి కల్ప
నముల సుమ్ము సౌఖ్యమ్ము దుఃఖము నుపేక్ష
క్లేశ మపవర్గ మనఁగ నిష్కృష్టదృష్టి.

చటులసంసారగత మైనషడ్గతులును,
సుగతియందలి నిర్వేలసుఖము, ఘోర
నరకమందలి భయదదుర్భరశుచమ్ము
తత్త్వదృష్టికి నెచ్చోటఁ దారసిలవు.

అశుభకర్మాళిచే జరావ్యాధిమరణ
శోకము లనివార్యమ్ములు సోఁకు, శుభము
లైనకర్మతతులచే శుభార్థసిద్ధి
కలుగు నని నిశ్చితంబుగాఁ దెలుపఁబడియె.

ప్రబలభయదమ్ము యక్షరూపమ్ము వ్రాసి
యరసి చిత్రకారుఁడు తానె యడలునట్లు
ఆత్మకల్పితసంసారమందు బోధ
విరహితుండు సమ్మోహి యై విహ్వలించు.

తప్పటడుగుల నడయాడు దారకుండు
కడచి కుటిలకూపగతపంకమునఁ గూలు
నట్లు సత్వవార మ్ముగ్ధమాతృమమ్ము
కల్పనాపంకమున నిమగ్నత్వ మందు.

భావదర్శనంబువలన నభావమ్ము
నందు దుఃఖ మొదవు, నట్టిజ్ఞాన
విషయకల్పనోగ్రవిషవహ్నిపీడ్యమా
నమ్ము సర్వసత్వసముదయమ్ము.

శరణరహితమ్ము నద్దాని నరసి యతిద
యార్ద్రచేతస్కుఁ డగుచు సత్వావళి కుప
కార మర్థించి విజ్ఞానఘనవిశిష్టుఁ
డెపుడు బోధిచర్య సమాచరింప వలయు.

దానసంభారములు కూర్చి జ్ఞానఘనమ
నుత్తరము పొంది కాల్పనికోగ్రబంధ
నమ్మునుండి పూర్ణవిమోచనమ్ము వడసి
యుద్ధలోకబాంధవుఁ డైన బుద్ధుఁ డగును.

ఈ ప్రతీత్యసముత్పాదదృష్టితోడ
నెవఁడు భూతార్థ మెల్ల దర్శించువాఁడు
కాంచుచున్నాఁడు సుమ్మి జగమ్ము శూన్య
మనుచు నాదిమధ్యాంతసంత్యక్త మనుచు.

చకితసంసారనిర్వాణచక్రయుగము
దృష్టిమాత్రాన సిద్ధ మై తిరుగు నంతె
తత్త్వ మెన్నంగ నాది శాంతమ్ము నిర్వి
కారము నిరంజనము సుప్రకాశ మగును.

తనదు కలయందుఁ గన్నయర్థమ్ము మేలు
కాంచియున్నట్టి దశయందుఁ గానఁబడని
పోల్కి మోహాంధకారప్రబుద్ధమతికిఁ
దోఁచఁబోవ దీ సంసారగోచరమ్ము.

సంస్కృతం బెల్ల మాయానుజాత మగుట
కేవలమ్ము మాయావలోకితమ యగును
అంతె కాని భావమ్ము రవ్వంత లేదు
ధర్మత యిదియెగా యెల్ల ధర్మములకు.

జాతిమంతమ్ము స్వయముగా జనన మంద
లేదు, జాతి లోకవికల్పనోదయంబు,
సత్వజాలమ్మును వికల్పజాత మగును,
కాన ద్వైతభావమ్ము యుక్తమ్ము కాదు.

మాయ గల్గిన దై చిత్రమాత్ర మగుచు
నీ సమస్తప్రపంచమ్ము నెసఁగుచుండు
దానిచే శుభాశుభకర్మతతియుఁ బొడము
దానిచే శుభాశుభము లుద్భవము పొందు.

చిత్తచక్రనిరోధంబుచేత సర్వ
ధర్మసంఘాతములు నిరుద్ధంబు లగును
దానిచే ధర్మములు ననాత్మంబు లగును
దానిచేతనే యవ్విశుద్ధంబు లగును.

నిఃస్వభావమ్ము యగు భావనికరమందు
శ్లిష్టనిత్యాత్మ సుఖసంజ్ఞచేత రాగ
మోహతామిస్రసంఛన్నమూఢజనుని
పీచి ఘోరభవాంభోధి భీతి గుడుపు.

కల్పనాజలపూర్ణసాగర మగాధ
మపార సంసార మిది ; మహాయానసమధి
రోహణక్రియ కా దని త్రోచి వైచి
యెవఁడు దీని పారము గమియింపఁ గలఁడు?

[సంస్కృతము = వ్యావహారికము, సోపాధికము; భావము = విషయము, ఉనికి; ప్రతీత్యసముత్పాదము = శూన్యత, సోపాధికోత్పాదము, విషయసాపేక్షత్వము; ధర్మము = మూలద్రవ్యము, స్వభావము.]

సాహిత్యంలో మతం :

# నాగార్జునుని నూతనమతం

ఒక 'పరిశోధకుడు'

బౌద్ధమతములో మాధ్యమికవాదమును వెలయించిన నాగార్జున నామధేయులు వ్యాసుల వలెనే చరిత్రయందు పదేవులు కానవచ్చుచున్నారు. క్రీస్తుశకము ఏడవశతాబ్దియందు హిందూదేశ పర్యటనము గావించిన హ్యుయాన్ త్సాంగు తన భారతదేశయాత్రానుభవములను గూర్చి వ్రాయుచు నాగార్జునుఁ డను నొక సిద్ధుఁడు తనకు సమకాలికుఁ డయిన యొక శాతవాహన చక్రవర్తియొక్క కోశాగారమును దన రసవాదసిద్ధిప్రభావమున బంగారముతో నింపినట్లు వ్రాసియున్నాఁడు.

ఇది గాక కథాసరిత్సాగరమునందు—

'తస్య నాగార్జునో నామ
బోధిసత్త్వాంశసంభవః
దయాలు ర్దానశీల శ్చ
మంత్రీ విజ్ఞానవా నభూత్
యః సర్వౌషధియుక్తిజ్ఞః
చక్రే సిద్ధరసాయనం
ఆత్మానం చ రాజానం
విజరం చిరజీవితమ్'

అనుపంక్తులలోఁ బ్రశంసింపఁబడిన బౌద్ధమత నాగార్జునుఁడు శాతవాహన సార్వభౌముని మంత్రియే యని చెప్పఁబడి యున్నది. హ్యుయాన్ త్సాంగు పేర్కొనిన నాగార్జునుఁడు మాధ్యమిక సూత్రకారుఁడును, మహాయాన బౌద్ధమతప్రచారకుఁడును నగు నాగార్జునున కన్న భిన్నుఁ డనియే తోఁచుచున్నది. బౌద్ధనాగార్జునుఁడు క్రీ. పూ. మొదటి శతాబ్దియందు భారతదేశమును బరిపాలించిన కనిష్కచక్రవర్తికి సమకాలీనుఁ డనియు, మాధ్యమిక సందేశోపబృంహిత మైన 'సుహృల్లేఖ' నొక దాని నాతఁడు శాతవాహన చక్రవర్తికిఁ బంపె ననియుఁ జరిత్రకారులు చెప్పెదరు. అందువలన క్రీ. శ. మొదటి రెండుశతాబ్దములం దిద్దఱు నాగార్జునులున్నట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. తాంత్రిక నాగార్జునునకు సిద్ధనాగార్జునుఁ డని పేరు గలదు. బౌద్ధమతప్రచారకులు కూడ నీసిద్ధపదమును దమనామములకు ముందుంచుకొనుచుండినను క్రీ. శ. మొదటి రెండు శతాబ్దులకాలమున నీసిద్ధపదమును దమనామములతో మేళవించు నాచారము వారిలోఁ బూర్తిగా దగ్గిపోయిన దని చెప్పవచ్చును. అందుచేత 'సుహృల్లేఖ' రచయిత యగు నాగార్జునుఁడు తాంత్రికశాస్త్రమున సిద్ధి పొందిన నాగార్జునుఁడు కాఁజాలఁడు. శ్రీపర్వతప్రాంతమున నొకగొప్ప బౌద్ధసంఘారామమును స్థాపించి, మహాయాన బౌద్ధమతమును బ్రచారములోనికిఁ దెచ్చిన నాగార్జునుఁడును, శాతవాహన చక్రవర్తికి 'సుహృల్లేఖ'ను వ్రాసిన యాతఁడును నిరువు రొక్కరే.

నలందా విశ్వవిద్యాలయాధ్యక్షుఁ డగు మఱొక నాగార్జునాచార్యుఁడు మనకుఁ జరిత్రలోఁ గానవచ్చుచున్నాఁడు. నలందా విశ్వవిద్యాలయము క్రీ. శ. నాలుగవశతాబ్దికిఁ బూర్వము మాత్రము జరగి యుండలే దని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పయివిశ్వవిద్యాలయమునందుఁ దక్కినశాస్త్రములతోఁ బాటు రసాయనవిద్య ధాతువాదము ననునవి కూడ శిష్యులకు నేర్పఁబడుచుండెను. దీనివలన క్రీ. శ. నాలుగవశతాబ్దమునందు నివసించుచుండిన మఱొక నాగార్జునుఁడు మనకుఁ దెలియవచ్చుచున్నాఁడు. కాని రెండవ శతాబ్దికిఁ జెందిన సిద్ధనాగార్జునుఁడు గాని, నాలుగవశతాబ్దికిఁ జెందిన యీనాగార్జునాచార్యుఁడు గాని ధాతువాదశాస్త్రము నధికరించి వ్రాసినగ్రంథము లేవియు నేఁడు మనకు లభించుట లేదు. జనశ్రుతులు, పుక్కిటి పురాణములు తప్ప వీరిని గూర్చినప్రామాణిక విషయములు మనకుఁ దెలియవచ్చుట లేదు.

క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్ది మొదలుకొని పదునాలుగవశతాబ్దివఱకును భారతదేశమున తాంత్రికయుగము వ్యాపించి యుండిన దని చెప్పవచ్చును. ఇందు శైవమతస్థులు మాత్రమే కాక ప్రసిద్ధు లయినబౌద్ధమతాను

యాయులు కూడఁ గలరు. ఈయుగమున ననేక తాంత్రికగ్రంథములు వెలువడినవి. ఈ కాలమున రసవాదమును, దానితోఁబాటు రసాయనశాస్త్రమును వృద్ధిఁ బొందించిన వారిలో గోవిందభిక్షువు, సోమదేవుఁడు, నాగార్జునుఁడు, రామచంద్రుఁడు, స్వచ్ఛంద భైరవుఁడు మొదలగువారు పేర్కొనఁ దగుదురు. వీరిలో మఱియొక 'నాగార్జునుఁడు' మనకుఁ గానవచ్చుచున్నాఁడు. తాంత్రిక యుగమునందు రసశాస్త్రపారంగతు లయిన వారిలో నాగార్జునుఁడు ప్రముఖుఁడు. తనకుఁ బూర్వ మాశాస్త్రమున గొప్పవ్యాసంగము చేసి యపూర్వపరిశోధనలు సలిపినమహనీయుల యనుభవముల నెల్లఁ గ్రోడీకరించి యాతఁడు రసాయనశాస్త్రమునకు సంబంధించిన మహాగ్రంథము లనేకములు రచించెను. అందు 'రసరత్నాకర' మనుగ్రంథము పేర్కొనఁదగినది. ఆగ్రంథమునం దాతఁడు రసాయనిక ప్రక్రియలు, వాని నిర్వహణమున కుపకరించు వాలుకాయంత్రము, డోలాయంత్రము, బాష్పయంత్రము మొదలగుసాధనములు మొదలుగాఁ గలయపూర్వవిషయముల నెన్నిటినో వివరించి యున్నాఁడు. తాంత్రికయుగమునకుఁ జెందిన యీనాగార్జునుఁడు పదునాలుగవ శతాబ్దికిఁ జెందినవాఁడని తెలుపుప్రామాణికాధారము లేవియు లేవు. కాని యాతని గ్రంథములందుఁ గానవచ్చు శాస్త్రజ్ఞాన పరిపాకదశ, గోవింద భిక్షువు నాతఁడు పేర్కొనుట యనునవి గోవిందభిక్షువునకంటె నీతఁడు తరువాతివాఁడని తెలియఁజేయుచున్నవి. ఇది గాక మాధవాచార్యుని 'సర్వదర్శనసంగ్రహ' మనుగ్రంథమున గోవిందభిక్షువు పేర్కొనఁబడెనే కాని నాగార్జునుఁడు పేర్కొనఁబడ లేదు. అందుచేత నీనాగార్జునుఁడు మాధవాచార్యులకన్న నర్వాచీనుఁ డని తెలియుచున్నది. ఈయుపపత్తుల యాధారముతోఁ బరిశీలించి చూడఁగా నీతాంత్రికయుగపు నాగార్జునుఁడు పదునాలుగవ శతాబ్దాంత్యభాగముననో, పదునైదవ శతాబ్దిప్రారంభముననో జీవించి యుండినట్లు తోఁచుచున్నది.

మొత్తముమీఁద నీనాగార్జున నామధేయులు నలుగురు గానవచ్చుచున్నారు. మన దేశమునఁ బురాణకర్త లందఱును వ్యాసనామముచే వ్యవహరింపఁబడునట్లే తత్త్వశాస్త్రము, తాంత్రికశాస్త్రము, రసవాదశాస్త్రము, రసాయనికశాస్త్రము మొదలగుశాస్త్రములలో మహత్త్వమును గడించినవా రందఱును నాగార్జున నామధేయులుగానే పరిగణింపఁబడునట్లు కానవచ్చుచున్నది.

ఇది గాక గౌరన మహాకవి రచించిన 'నవనాథచరిత్రము'న నాగార్జునుఁ డనుసిద్ధునికి సంబంధించిన పూర్వగాథ యొకటి కానవచ్చుచున్నది. పూర్వ మొకరాజకుమారుఁ డుండెను. అతఁ డొకనాఁడు వేటకుఁ బోయి యచట విధివశమున నొకమునిచేఁ బామై యుండునట్లు శపింపఁబడెను. అతఁ డాపాముకూపముతో నచ్చట నుండిన యార్జునవృక్షములోని తొఱ్ఱలో నివసించి యుండఁగా మీననాథుఁ డనునొక సిద్ధపుంగవుఁ డాతని ననుగ్రహించెను. అతని యనుగ్రహమున నాతనికిఁ దిరిగి తొంటిరూపు కలిగెను. ఆరాజకుమారుఁడును నాసిద్ధునికి శిష్యుఁడై 'నాగార్జునుఁ' డనునామధేయమును బడసెను. ఆ సిద్ధుఁడును దన శిష్యునికి నణిమాదిసిద్ధుల నెల్ల ననుగ్రహించెను. తరువాత నాతఁడు తనశిష్యుఁ డగునాత్రేయునికి రసవాదసారశాస్త్రములను దెలిపి, యాతని నాంధ్రదేశమునఁ దిరుగుమని పంపి తాను మీననాథునియొద్దకుఁ బోయి యాతనిని సేవించుచుండెను. నాగార్జునుని శిష్యుఁ డగునాత్రేయుఁడు శ్రీశైలము చేరి గర్వితుఁడై యాపర్వతము నంతను బంగారుకొండగా మార్పఁ దలఁచి తత్ప్రయత్నమున నుండెను. అది తెలిసి విష్ణుదేవుఁడు మాయారూపమున వచ్చి యాతని పుక్కిట నుండినమృతసంజీవనీ ఘుటికను బైకిఁ దీసి యాతనిఁ జక్రప్రయోగముచే సంహరించెను. ఆ మృతసంజీవనీఘుటిక యాతనినోట నుండుసంతవఱ కాతని మెడపైఁ గత్తితో నెన్ని మాఱులు నఱకినను నది 'ఖంగు' మని మ్రోఁగి వెనుకకుఁ దూలిపోయినదే కాని యాతని మెడపై వ్రేటుపడ లేదు. పర్వత మెల్ల బంగారమగుచో దానికై లోకమున యుద్ధములు చెలరేగి ధర్మము తొలఁగు ననియు, నరాజకము ప్రబలు ననియు విష్ణుదేవుఁ డాత్రేయుని సంహరించినట్లు మన మూహింపవలసి యున్నది. ఈసందర్భమున బంగారము చేయుపద్ధతి కొంత యాగ్రంథమున వివరింపఁబడి యున్నది.

'రసము లైదును నుపరసము లెన్మిదియుఁ
బసరులు మందులుఁ బాషాణములును
గలువంబులును జాలఁగా సమకూర్చి
వలయుమంత్రౌషధావళులకు బలియుఁ
జేసి మనోజయసిద్ధిఁ బెంపొంది
యాసీనుఁడై లీలాయాజినరచిత
గురుధత్రికల నిష్ప్రగ్రోవులు సలిపి
సరములుఁ బొందుగా సంధించి భక్తి
గురునాథుఁ దలఁచి తగ్గుగువు భజించి
పరభైషజాది దైవములను మ్రొక్కి
నేర్చినమందు లన్నియు వైచి యగ్ని
గూర్చి పుటంబు గ్రక్కునఁ బెట్టునపుడు
వెస నూఁదువారును పిసుకక రసము
పసరులు గలిపి పాల్పడ నూదువార
లరుదొందఁగా మూస లమరించువారు
మొనసి క్రమ్మఱఁ బుటంబులు వెట్టువారు
కలయంగ నూరికనకంబు దివిసి
యొలమిమైఁ బెనుప్రోవు లిడ్చెడివారు
నై సంభ్రమింపుచు.........

—నవనాథచరిత్రము.

ఆచార్య నాగార్జునుఁడు బౌద్ధమతమున 'మధ్యమక' సిద్ధాంతమును వెలయించినవాఁడు. అతఁడు రచించిన 'మధ్యమకకారికల' ననుసరించి క్రీస్తుశకము ఆఱవశతాబ్దికిఁ జెందినచంద్రకీర్త్యాచార్యుఁడు 'మధ్యమకావతార' మను నొక గ్రంథమును రచించెను. ఈ గ్రంథము తరువాత చైనా, టిబెట్టు భాషలలోనికిఁ బరివర్తిత మయినది. కాని వానికి మూల మగు నీ సంస్కృతగ్రంథము మాత్రము హిందూదేశమున నశించిపోయినది. ఆ గ్రంథములోని విషయములను మనము టిబెట్టు, చీనా భాషలలోని దాని యనువాదగ్రంథములను బట్టియే నేఁడు తెలిసికొనవలసిన దుస్థితి యేర్పడినది. ఆగ్రంథమును బట్టి చూడఁగా నార్య నాగార్జునుఁడు క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్దివాఁడో, లేక క్రీస్తుశకము ప్రథమశతాబ్దివాఁడో కాఁదగు నని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రభిప్రాయ పడుచున్నారు.

నిత్యనాథుఁ డను సిద్ధునిచే రచింపఁబడిన 'రసరత్నాకర' మను వైద్యగ్రంథమున నం దొక ఖండమున శ్రీశైలవర్ణన మత్యద్భుతముగాఁ జేయఁబడినది. ఆగ్రంథమునందుఁ బెక్కుచోట్ల 'పురా నాగార్జునోదితమ్' అని పేర్కొనఁ బడియుండుటచేత నాగార్జునుఁ డతి ప్రాచీనుఁ డనియు, నతఁడు శ్రీశైలప్రాంతమున నివసించుచుండె ననియుఁ దెలియుచున్నది. నాగార్జునుఁడు రచించిన 'కక్షపుటతంత్రము' అను గ్రంథము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో నున్నది. అందు నాగార్జునుని సిద్ధపురుషత్వము పెక్కుచోట్ల గోచరించుచున్న దని పెద్దల యభిప్రాయము. అతఁడు రచించిన బౌద్ధమతగ్రంథము లనేకము లింకను నముద్రితములే. టిబెట్టు చీనాదేశములలో నాతఁడు రచించినబౌద్ధగ్రంథము లున్నట్లు తెలియుచున్నది. అతని వైద్యగ్రంథ మొకటి మాత్రము ముద్రిత మయినది.

ప్రజ్ఞాపారమితలలో విజ్ఞానవాదము, శూన్యవాదము నని రెండువాదములు కలవు. వానిలో శూన్యవాదము మిక్కిలి ప్రధాన మయినది. సత్యమును పారమార్థిక సత్యము, సంవృతిసత్యము నని రెండువిధములుగా విభజించి యార్యనాగార్జునుఁడు పారమితలలోని వివిధభాగములను సమన్వయించినాఁడు. ఆచార్య శంకరులు కూడ నట్టి సూత్రమునే యవలంబించి పరాపరావిద్యల విభాగముతో నుపనిషద్వాక్యములను సమన్వయించినారు. ఉపనిషద్వాక్యములను వివరించుటకై వేదాంతసూత్రములు వెలసినట్లు పారమితలను వివరించి, వాని నొక సమగ్రదర్శనముగాఁ బ్రవచింపఁదలఁచి యార్య నాగార్జునుఁడు తన 'మధ్యమక కారిక'లను వెలయించెను. ఈ మధ్యమకకారికలను మొట్టమొదట నార్యనాగార్జునుని సమకాలికుఁ డగు వాత్స్యాయనుఁడు తన న్యాయభాష్యమునందు విమర్శించెను. నాగార్జునుఁ డావిమర్శకు సమాధానముగా 'విగ్రహవ్యావర్తిని' యను పేరుతో మఱల డెబ్బదిరెండు కారికలను రచించెను. ఈ కారికలను జూచి వాత్స్యాయనుఁడు తన న్యాయభాష్యములో మఱికొన్ని మార్పులను దీసికొని వచ్చుటచే నాగార్జునుఁడు తన 'విగ్రహవ్యావర్తిని'కి మఱల నొక వృత్తిని వ్రాయవలసి వచ్చెను.

నాగార్జునుని మధ్యమకకారికలపై బుద్ధపాలిత, భావవివేకుఁడు, చంద్రకీర్తి యనువారు భాష్యములను రచించిరి. వీరు ముగ్గురును నాంధ్రులే యగుట విశేషము. సంఘరక్షిత శిష్యుఁ డగుబుద్ధపాలిత దంతపురీవిహారమున

నధ్యాపకుఁడు గా నుండినట్లు తెలియుచున్నది. ఇతని శిష్యుని శిష్యుఁడు చంద్రకీర్తి. అతఁడు ములకదేశములోని సమతటనగరమున నివసించు చుండినవాఁడు. భావవివేకుఁడు ధాన్యకటకమున నుండినవాఁడు.

మధ్యమకకారికలలోఁ బ్రధాన మయినది యందలి మొదటి యధ్యాయము. ఈ యధ్యాయము నవగాహనము చేసికొనిన నాచార్య నాగార్జునుఁడు ప్రవచించిన మధ్యమకసిద్ధాంతము పూర్తిగాఁ దెలియఁగలదు. ఆ యధ్యాయమునకుఁ బ్రత్యయపరీక్ష యని పేరు.

ప్రత్యయపరీక్షా—

అనిరోధ మనుత్పాద
 మనుచ్ఛేద మశాశ్వతమ్
అనేకార్థ మనానార్థ
 మనాగమ మనిర్గమమ్
యః ప్రతీత్యసముత్పాదం
 ప్రపంచోపశమం శివమ్
దేశయామాస సంబుద్ధ
 స్తం వందే వదతాం వరమ్.
న స్వతో నాపి పరతో
 న ద్వాభ్యాం నాప్యహేతుతః
ఉత్పన్నా జాతు విద్యంతే
 భావాః క్వచన కేచన. 1

చత్వారః ప్రత్యయా హేతు
 శ్చాలంబన మనంతరమ్
తథైవాధిపతేయం చ
 ప్రత్యయో నాస్తి పంచమః. 2

న హి స్వభావో భావానాం
 ప్రత్యయాదిషు విద్యతే
అవిద్యమానే స్వభావే
 పరభావో న విద్యతే. 3

క్రియా న ప్రత్యయవతీ;
 నాప్రత్యయవతీ క్రియా
ప్రత్యయా నాక్రియావంతః;
 క్రియావంత శ్చ సంత్యుత. 4

ఉత్పద్యంతే ప్రతీత్యేమా
 నితీమే ప్రత్యయాః కిల
యావ న్నోత్పద్యంత ఇమే
 తావ న్నాప్రత్యయాః కథమ్. 5

నైవాసతో నైవ సతః
 ప్రత్యయోర్థస్య యుజ్యతే
అసతః ప్రత్యయః కస్య
 సత శ్చ ప్రత్యయేన కిమ్. 6

న స న్నాసన్న సదస
 ద్ధర్మో నిర్వర్తతే యదా
కథం నిర్వర్తకో హేతు
 రేవం సతి న యుజ్యతే. 7

అనాలంబన ఏవాయం
 సన్ ధర్మ ఉపదిశ్యతే
అథానాలంబనే ధర్మే
 కుత ఆలంబనం పునః. 8

అనుత్పన్నేషు ధర్మేషు
 నిరోధో నోపపద్యతే
నానంతరమతో యుక్తం
 నిరుద్ధే ప్రత్యయ శ్చ కః. 9

భావానాం నిః స్వభావానాం
 న సత్తా విద్యతే యతః
సతీద మస్మిన్ భవతీ
 త్యేత న్నైవోపపద్యతే. 10

న చ వ్యస్తసమస్తేషు
 ప్రత్యయే ష్వస్తి తత్ఫలమ్
ప్రత్యయేభ్యః కథం త చ్చ
 భవే న్నప్రత్యయేషు యత్. 11

అథాస దపి త త్తేభ్యః
 ప్రత్యయేభ్యః ప్రవర్తతే
అప్రత్యయేభ్యోపి కస్మా
 న్నాభిప్రవర్తతే ఫలమ్. 12

ఫలం చ ప్రత్యయమయం
 ప్రత్యయా శ్చా స్వయం మయాః
ఫల మస్వయమయేభ్యో య
 త్తత్ప్రత్యయమయం కథమ్. 13

తస్మా న్న ప్రత్యయమయం
 నాప్రత్యయమయం ఫలమ్
సంవిద్యతే ఫలాభావాత్
 ప్రత్యయాప్రత్యయాః కుతః. 14

ఆచార్య నాగార్జునకృత మధ్యమకకారికాసు ప్రత్యయపరీక్షా నామ ప్రథమం ప్రకరణమ్.

# తథాగతుని మహాపరినిర్వాణం

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

బుద్ధదేవుఁడు వేసాలిలోఁ గొన్నిదినము లుండి యానగరముచుట్టుప్రక్కల నున్నచైత్యకములకుఁ బోయి యప్పుడప్పు డక్కడ వసించుచుండెను. చైత్యక మనఁగా బౌద్ధభిక్షుకులు వసించుమఠము. వేసాలినగరసమీపమున నిట్టి వనేకము లుండెను. వేసాలి చూచుట కెంతో సుందర మైననగర మని గౌతముఁడే యానందునితోఁ జెప్పెను. ఒకనాఁడు తన ప్రియశిష్యుఁ డగు నానందునిఁ బిలిచి "ఈచుట్టుప్రక్కల నున్నభిక్షుకుల నందఱ నిచ్చటఁ జేర్పు"మని సిద్ధార్థుఁ డానతిచ్చెను. ఆనందుఁడు వెంటనే వారి నందఱ రావించెను. రావించుటయు సిద్ధార్థుఁడు వారికి మహాధర్మోపదేశముఁ జేసెను. ఇదియే యాతఁడు చేసినకట్టకడపటి ధర్మోపదేశము. ఆయుపదేశ మీక్రిందివిధముగ నున్నది. "సోదరులారా! నేను కనిపెట్టినసత్యము మీ కుపదేశించితిని. ఆసత్యధర్మములను మీరు చక్కఁగా గ్రహించి పరిపఱచుకొని వాని నాచరించి, మననము చేసి, యీ పరిశుద్ధమతము శాశ్వత మై, దేవతలయొక్కయు మనుష్యులయొక్కయును క్షేమసౌఖ్యములకుఁ గారణభూత మై యుండునట్లు దీని నెల్లెడ వ్యాపింపఁ జేయుఁడు. నేను మీ కుపదేశించినసత్యము లెవ్వి? అవియివి—చతుర్విధ మైనమననము, పాపముతోఁ జతుర్విధ మైనయుద్ధము, ఋషిత్వమునకుఁ జతుర్విధపథము, పంచవిధ మైన నీతిబలము, పంచవిధ మైనయాత్మజ్ఞానము, సప్తవిధ మైనజ్ఞానము, అష్టవిధ మైనసన్మార్గము."

ఓసోదరులారా! యిటు చూడుఁడు. ద్వంద్వపదార్థము లన్నియు జీర్ణము లగును. కావున శ్రద్ధతో మీమోక్షమునిమిత్తము మీరే ప్రయత్నము సేయుఁడు. తథాగతున కచిరకాలములోనే నిర్వాణము కలుగును. నేఁడు మొదలుకొని మూఁడు మాసములతరువాత తథాగతుఁడు మృతి నొందును.

అనంతర మతఁడు వారి నందఱఁబంపి వేసాలి విడచి యానందుఁడును మిక్కిలి భక్తులగు మఱి కొందఱు శిష్యులును వెంబడింప 'పావా' యనునూరికిఁ బోయెను. ఆ యూరికిఁ బోఁగానె చందుఁ డనుకమ్మరవాఁ డొకఁ డాయనను గలసికొని "స్వామీ! నేఁడు నాయింట భిక్ష చేసి నన్ను గౌరవింపవలయు" నని ప్రార్థించెను. అందు కాయన సమ్మతించెను. చందుఁడు తన యతిథినిమిత్తము మధురాహారములు, రొట్టెలు, నడవిపందిమాంసము వండించెను. బుద్ధుఁడు చందునిఁ బిలిచి "యడవిపందిమాంసము నాకుఁ బెట్టి మధురాహారములు రొట్టెలు భిక్షుకుల కి"మ్మని యానతిచ్చెను. అతఁ డట్లు చేసెను. భిక్షానంతరమున బుద్ధుఁడు పావాగ్రామమును విడిచి కాశీనగరమున కరిగెను. కాని దారిలో నతనికి దారుణ మయినరక్తగ్రహణి రోగము వచ్చెను. దానివలన నాయన మిక్కిలి బాధపడఁ జొచ్చెను. కాని, యామహాత్ముఁ డాబాధ మిక్కిలి దుస్సహ మయినను దానిని మనోవైకల్యముఁ జెందకుండ మిక్కిలి యోరిమితో మిక్కిలి ధైర్యముతో ననుభవించెను.

ఆహాహా! ఎంతటి ప్రతిభాశాలు లైనను నెంతటి భగవదుపకారపరాయణు లైనను నెంతటి ధైర్యశాలు రయినను మానవులు రోగపతితు లైనప్పుడు దైహికబాధల ననుభవింపక తప్పదుకదా! బుద్ధదేవునిస్థితి క్రమక్రమముగాఁ జెడిపోయెను. నానాఁటికిరోగ మతిశయించెను. శరీరబలము క్షీణించెను. అట్లు దుర్బలశరీరముతోనే పయనముఁ జేయుచు సిద్ధార్థుఁడుమార్గము నుండి తొలఁగి యొకవృక్షచ్ఛాయకుఁ జని, యానందునిం బిలిచి "యానందా! నాకావిబట్ట లిక్కడఁ బఱచుము. నేను మిక్కిలి యలసి యున్నాను. కొంచెము సేపు విశ్రమించెద" నని చెప్పెను. ఆనందుఁ డట్లు చేసినపిదప నతఁ డానందుని వెండియుఁ బిలిచి "ఆనందా! దాహ మై నో రెండుకొని పోవుచున్నది. కొంచెము నీ రిమ్ము త్రాగెద" నని యడిగెను. ఆనీరు త్రావి కొంత సేదదేఱి తానే స్వయముగా లేచి సమీపమున నున్న కకుస్థానదికి మెల్లగఁ బోయి స్నానము చేసి వెండియుం జలముఁ ద్రావెను. కకుస్థానది యనఁగా బర్హినది. 'ఇది కాశీనగరమున కనిమిదిమైళ్ళ దూరమున చోటాగండకినదిలోఁ బడుచున్నది. ఈ

స్నానపానములవలన సేదదేఱి కొంతబలము కలిగి బైలుదేరి కుషినారపురపరిసరముల నున్న యొకతోటలో బస చేసెను. ఆ వనముఁ జేరి యతఁడు 'ఓ యానందా! నేను మిక్కిలి పరిశ్రాంతుఁడ నైతిని. రెండు కవలచెట్లనడుమ నుత్తరపుతలగడగ నాకుఁ బ్రక్క వేయుము. నేను పండుకొనియెద' నని యానందునితో ననియెను. ఆవిధమున నానందుఁడు సెజ్జ సమర్చుటయు సిద్ధార్థుఁడు ప్రశాంతమనస్కుఁ డై నిశ్చలభావముతోఁ గుడిప్రక్క కొత్తిగిలి కాలిమీఁదఁ గాలు వైచికొని పండుకొని యానందునితో నిట్లనియె, "ఇది పువ్వులకాలము కాకపోయినను కవలచెట్లు పుష్పములతో నిండి యున్నవి. అవి నామీఁద రాలుచున్నవి. తథాగతునకీ గౌరవము గాక మఱియొక గౌరవము మఱియొక ప్రతిష్ఠ మఱియొక సపర్య మఱియొకపూజ కలదు. ఓ యానందా! భిక్షుకుఁడు గాని, భిక్షుణి గాని, యనుచరుఁడు గాని, గృహస్థుఁడు గాని, సన్యాసి గాని, యెవరయినను సరే చిన్నవిషయములందును పెద్దవిషయములందును సత్యము వచించుచు ధర్మప్రకారము నడచుకొనుచు, ధర్మలేశములను గూడ గమనించుచు జీవితకాలము గడపుదురో వారు తథాగతునకు గౌరవము గావించినవారు, సపర్యలు సల్పినవారు, సమారాధనలు చేసిన వారు నగుదురు.'

రాత్రి గతించుకొలఁది తమగురువున కవసానకాలము సమీపించిన దని శిష్యులకు స్పష్టముగాఁ బొడకట్టెను. చేయునది లేక వారు ధైర్యముఁ గోల్పోయి గురువు శయనించినస్థలమునకుఁ గొంచెము దూరముగ నరిగి విలపింపఁ దొడఁగిరి. ఆయన సిద్ధి పొందునప్పటి కానందుఁడు, అనిరుద్ధుఁడు, సరిపుత్త్రుఁడు మున్నగు వారు సన్నిధి నుండిరి. కశ్యపుఁడు వచ్చెను గాని వచ్చునప్పటికే గురువు నిర్యాణ మొందెను.

మహానుభావుఁ డగు గౌతముఁ డీవిధంబున మరణోన్ముఖుఁ డై యున్న సమయమునఁ బ్రియ శిష్యుఁ డగు నానందుఁ డిట్లనియె:—

"స్వామీ! కల్పాంతమువఱకు నీవు జీవించున ట్లనుగ్రహింపుము. మానవుల క్షేమ సౌఖ్యములనిమిత్తము ప్రపంచముపై జాలి దలఁచి దివ్యులయొక్కయు, మనుజుల యొక్కయు సేమములకొఱకు, లాభములకొఱకు, సంతోషములకొఱకుఁ గల్పాంతముదాఁక బ్రతుకుము. ప్రభూ! బ్రతుకుము."

శిశువు నోటనుండి వెడలవలసిన మాటల నుడువుచున్న యానందునిఁ జూచి జగద్గురుఁడు చిఱునవ్వు నవ్వెను. అప్పు డానందుఁడు వెండియు నిట్లనియె—'భగవానుఁడా! యీ నట్టడవిలో నీవు పంచత్వము నొందఁ గూడదు ప్రభూ! రాజగృహము, వారణాసి, సాకేతము, శ్రావస్తి, చంపాపురము మొదలగుమహానగరము లనేకములు కలవు. దేవరవా రచ్చట సిద్ధి పొందునట్లు ప్రసాదింపుఁడు. ఆనగరములలో దేవర సిద్ధి పొందినపక్షమున మీ కళేబరమునకుఁ దగిన గౌరవము జరుగును. ఏల యన నచ్చట తథాగతుని సిద్ధాంతములయందు విశ్వాసము గల భాగ్యవంతు లనేకులు గలరు.' అనవుడు సమ్మహాత్ముఁడు మరల మందహాసము చేసెను. అది చూచి యానందుఁడు 'దేవా! మీరు మృతి నొందినపిదప మీ శరీర మేమి చేయు మని యాన తిచ్చెదరు?" అని యడిగెను. అతనికి గౌతముఁ డిట్లనియె. 'ఆనందుఁడా! తథాగతుని కళేబరమును గౌరవించుటనుగూర్చి నీవు శ్రమ పడవలదు. నీస్వవిషయమున నీవు గట్టిపూనిక గలిగియుండు మని నిన్ను వేఁడుకొనుచున్నాను. నీమేలుకొఱకు నీవు పాటుపడుము. నీవు జాగ్రత్తగా నుండుము.

తథాగతునియందు విశ్వాసము గలభాగ్యవంతులలో బుద్ధిమంతు లనేకు లున్నారు. వారు తథాగతుని కళేబరమునకుఁ దగినగౌరవముఁ జేయక పోరు' అని పలికి కొంతసే పూరకుండి యతఁడు మరల నానందునితో నిట్లనియెః 'నేను మృతి నొందుచున్నాను. చందుఁడు పెట్టినయాహారము నేను తినినందున వానికి ముందుజన్మమున గొప్ప యదృష్టము తప్పక కలుగు నని నేను పోయినతరువాత వానితోఁ జెప్పుము. నానోటనే యీమాటలు నీవువిన్నట్లు వానితో నొక్కి చెప్పుము. అన్నిదానములలో మిక్కిలి యుత్కృష్టము లైనవి రెండు గలవు. అందు మొదటిది నాకు బుద్ధత్వము ప్రాపింపక మునుపు సుజాత చేసినయన్నదానము. నే నీలోకమును విడిచి వెళ్ళిపోవుటకు ముందు చందుఁడు చేసిన యీ యన్నదానము రెండవది. ఆనందా! చందునియొద్ద కెవ్వఁ డైనఁ బోయి 'చందా! ఇది నీకుఁ గీడు, ఇది నీకు గొప్పనష్టము. నీచేతి

యన్నముఁ దినఁగానే తథాగతుఁడు మృతి నొందె' నని వాని కివ్వఁగైన వెఱపు గొలిపి విచారము గలిగింపవచ్చును. కావున నట్టివెఱపు వానిమనంబునుండి మాన్చి 'చుందా! ఇది నీకు మేలు. ఇది నీకు లాభము. ఏమన తథాగతుఁడు నీచేతియన్నము దిని పరమసిద్ధి వడసె' నని చెప్పవలెను.

పరమభక్తుఁ డైనయానందుఁ డప్పలుకులు విని మనోధైర్యము చిక్కఁబట్టలేక దుఃఖాక్రాంతుఁ డైన జగద్గురుసన్నిధిని విలపింపఁ గూడ దని యేడ్చుట కావలికిఁ బోయెను. అతఁడు తనప్రక్కను లేకపోవుటఁ గనిపెట్టి 'సోదరులారా! ఆనందుఁ డేఁడి' యని యా మహాత్ముఁ డడిగెను. 'దేవా! పూజ్యుఁ డైన యానందుఁ డవ్వలి కరిగి విలపించుచున్నాఁ' డని వారుత్తరము చెప్పిరి. 'సోదరులారా! పోయి నాకడకు వానిం బిలిచికొని రం' డని యతఁ డానతిచ్చెను. ఆనందుఁడు వచ్చి వాని ప్రక్కఁ గూర్చుండెను. అప్పుడు తథాగతుఁడు మెల్లఁగా నిట్లు ధైర్యము చెప్పెను. 'ఆనందా! లేనిపోనిశ్రమ పడకుము. విలపింపకుము. మనకు మిక్కిలిసమీపము లై ప్రియము లైనపదార్థముల స్వభావమే యిట్టి దనియు వీనిని విడిచి వాని నుండి వేరుపడి మనము పోవలయు ననియు నే నిదివఱకే పలుమాఱులు చెప్పియుండ లేదా? ఏదియు శాశ్వత మై యుండఁజాలదు. అట్టు వంటిస్థితి యసాధ్యము. ఆనందా! నీవు చిరకాలమునుండి నాయందు దయ గలిగి మిక్కిలి మంచివాఁడ వై యెడతెగక యింతింత యన రాని యుపచారపరంపరఁ జేసి నాకుఁ బరమాప్తుఁడ వయి యుంటివి. ఆనందా! నీవు మంచిపని చేసితివి. నీ ప్రయత్నము లంతఃకరణశుద్ధిగఁ జేయును. నీవును మహాపాపములనుండియు భోగపరాయణత్వమునుండియు నహంభావము నుండియు మాయనుండియు నజ్ఞానమునుండియు స్వల్పకాలములో విముక్తుఁడ వయ్యెదవు.'

రాత్రి కడమకొలఁది బుద్ధుఁడు క్రమక్రమముగ క్షీణింపఁ జొచ్చెను. ఆ సమయమున నత్తావున కొకబ్రాహ్మణుఁడు వచ్చెను. అతఁడు కుశీనగరనివాసుఁడు. వేదాంతశాస్త్రవేత్త. అతనిపేరు సుభద్రుఁడు. అతఁ డానందునిఁ గలిసికొని యిట్లనియె. 'గౌతమశ్రమణుఁ డీ రాత్రి దేహయాత్ర ముగించు నని వింటిని. ఇప్పుడు నా మనస్సులో నొక గొప్పశంక పొడమినది. ఈ సందేహము నివారించుటకు గౌతమశ్రమణుఁడు తగినవాఁ డని నాకుఁ దోఁచినది. కావున నో యానందా! గౌతమశ్రమణుని నేను జూచెద. చూడనిమ్ము.' అనవు డానందుఁడు 'మిత్రుఁడా! సుభద్రుఁడా! తథాగతు నిప్పుడు పీడింపకుము. అతఁడు మిక్కిలి పరిశ్రాంతుఁ డై యున్నాఁ' డని యుత్తరము చెప్పెను. కాని సుభద్రుఁడు వానిని మఱిమఱి యడిగి బాధింపఁ జొచ్చెను. వారిసంభాషణము బుద్ధునిచెవిని బడఁగా నతఁ డానందునిఁ బిలిచి 'యోయీ! సుభద్రు నడ్డగింపకుము. వానిని నాకడకు రానిమ్ము. అతఁడు నన్నేమి యడిగి నను జిజ్ఞాసు వై యడుగును కాని నన్నుఁ బీడింప వలె నని యడుగఁ' డని పలికెను. అంతట నా బ్రాహ్మణుఁడు సిద్ధార్థునిప్రక్కఁ గూర్చుం యనేకశాఖలకుఁ బ్రధానపురుషులుగనుండి పర మతపక్షాలు రయినబ్రాహ్మణులు పూరాణ కశ్యపుఁడు, మఖాళి, అజితుఁడు, కాత్యాయనుఁడు, సంగయుఁడు, వేలాతికుఁడు, నిగ్రంతుఁడు మొదలగువారు లోకమున వెల్లడించినట్లు పదార్థతత్త్వములను గ్రహించిరా? లేదా? లేక యందుఁ గొందఱు తెలిసికొని కొందఱు తెలిసికొనలేక పోయిరా?' యని యడిగెను. అడుగుటయు వానికి బుద్ధుఁ డిట్లనియె. 'సుభద్రా! ఆ బ్రాహ్మణులు తమతమ విజ్ఞానముకొలఁదిగ తత్త్వము గ్రహించిరా లేదా యన్నసందేహ మటుండ నిమ్ము. అట్టివిషయములు చర్చించుట కిది సమయము కాదు. నేను నీకు సత్యము చెప్పెదను. సావధానుఁడ వై వినుము' అని గౌతముఁడు నీతిమార్గమును విడిచిపెట్టిన మతసిద్ధాంతముల ననుసరించిన వారికి మోక్షము లభింప దనియుఁ, బవిత్రజీవనముతో నారంభ మై భూతదయతో నంత మగునష్టవిధపావనమార్గముల ననుసరించిన వారికె మోక్షము గలుగు ననియు బోధించెను. బోధించుటయు సుభద్రుఁడు జ్ఞానరసాస్వాదనముఁ జేసి పరమానందభరితుఁ డై 'యహహా! మేలు మేలు! మీ ముఖమునుండి వెలువడిన మాటలు మిక్కిలి ప్రశస్తములు. దేవరవారు నన్ను శిష్యుఁడుగ గ్రహింపవలయును. మేనఁ బ్రాణము లుండునంతవఱకు నేఁడు మొదలుకొని పరమవిశ్వాసము గలిగి యుందు నని యతఁడు

వినయముతోఁ బలికెను. ఆతనిపలుకులు విని బుద్ధుఁ డిట్లనియె. 'సుభద్రా! పూర్వ మొక సిద్ధాంతమునం దుండి యీ నవీనసిద్ధాంతములో నుత్తమస్థానమును గాని యథమస్థానమును గాని ప్రవేశింపఁ దలఁచువాఁడు ముందు నాలుగు మాసములుశుశ్రూషఁ జేయవలయును.' అనవుడు 'అట్లయిన నేను నాలుగుమాసములు శుశ్రూష చేయుదు' నని సుభద్రుఁ డొడంబడెను.

అప్పుడు గౌతముఁ డానందునిఁ బిలిచి 'ఆనందా! ఈతనిని మనమతమునఁ జేర్చికొను' మని యానతిచ్చెను. అప్పు డానందుఁడు వాని నొక్కకడకుఁ గొంపోయి స్నానముఁ జేయించి సమస్తవస్తువులు వినశ్వరము లని యొకానొక మంత్రము పునశ్చరణ సేయించి వానిశిరస్సు గడ్డము ముండనము చేయించి కషాయవస్త్రములు గట్టించి బుద్ధుఁడు ధర్మము సంఘము శరణము లని శరణత్రయము వానిచేతఁ జదివించి బుద్ధునియొద్దకుఁ గొనిపోయెను. అంతట బుద్ధుఁడు వాని నుత్తమపదస్థుఁ డగుశిష్యుఁడుగ సంగీకరించి ధ్యానము సేయుట కొకవిషయము నుపదేశించెను. ఆ మహానుభావుఁ డొనర్చినకట్టకడపటి కార్య మిదె.

ఆరాత్రి నాలవజాము సమీపించినప్పుడు బుద్ధదేవుఁడు పూజ్యుఁ డైనయానందునిఁ బిలిచి యిట్లు పలికెను. 'ఆనందా! మన గురూపదేశ మస్తమించినది. మన కింక గురువు లేఁ డని మీలోఁ గొందఱ కధైర్యము తోఁచవచ్చును. కాని మీ రావిధముగఁ దలఁపఁగూడదు. నేను సంస్థాపించినసత్యము నేను మతమునిమిత్త మై యేర్పరచిన సూత్రములు, నేను బోయిన తరువాత మీకుగురువు లై యుండుఁగాక!' యని పలికి కొండొకతడ వూరకుండి యా మహాత్ముఁడు మఱల నిట్లనియె. 'ఆనందా! నా మరణానంతరమునస్వల్పధర్మములలో మార్పులు గావలసియున్న పక్షమున నట్టివి మార్చుకొన వచ్చును' అని యానందునితోఁ బలికి పిమ్మట భిక్షుకుల నుద్దేశించి యిట్లనియె :—'బుద్ధుని గుఱించి గాని, సత్యమునుగూర్చి గాని, ధర్మపథమునుగూర్చి గాని, యెవరిమనస్సులో నయిన సందేహములు, తప్పభిప్రాయములు నుండ వచ్చును. అట్టివి మనంబున దాచుకొనక స్వేచ్ఛగాఁ దెలియపఱచి యడుగుఁడు. తథాగతుఁడు మన యెట్టయెదుట నున్నప్పుడు మన సందేహము లాయన నడిగి తీర్చుకొన మైతిమని విచారించుచు మిమ్ము మీరు దూషించుకొన వచ్చు."

ఆ మహాత్ముఁ డావిధమునఁ బల్కుచున్నప్పుడు భిక్షుకు లంద ఱూరకుండిరి. బుద్ధుఁడు సందేహము లడిగి నివారించుకొన వలసిన దని మఱి రెండుసారులు వారిని నొక్కి యడిగెను. ముమ్మాఱడిగినను మూఁకలట్లు వారు ప్రత్యుత్తర మియ్య రైరి. అంతట నతఁడు భిక్షుకుల నుద్దేశించి యిత్తెఱగున భాషించెను - 'సోదరులారా! గురువునెడల మీకుఁ గలభక్తి విశేషంబుచేత మీరు సందియముల నడుగక పోయియుండవచ్చును. కలిగినసందియములు మీ రొండొరులతోఁ జెప్పికొనుఁడు.'

ఆయన యట్లు పల్కినను భిక్షుకులు నోరు తెఱచి యడుగ రైరి. అప్పు డానందుఁడు తథాగతున కిట్లనియె—"దేవా! బుద్ధుని గూర్చి గాని, సత్యమునుగూర్చి గాని, ధర్మపథమును గూర్చి గాని యీ మహాసభలో నెవరి మనస్సునను సందియములు గాని, తప్పభిప్రాయములు గాని లే వని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను.'

'ఆనందా! నీవు సంపూర్ణవిశ్వాసములోఁ బల్కితి' వని బుద్ధుఁ డానందునితోఁ జెప్పి కొంతసే పూరకుండి సెజ్జనుండి సగము లేచి యిట్లనియె :—"సోదరులారా! చూడుఁడు! ద్వంద్వపదార్థము లన్నిఁటికి నాశనము స్వభావము. కావున శ్రద్ధతో మీ మోక్షముల మీరే సాధించుకొనుఁడు.' ఇవియే బుద్ధదేవుని కట్టకడపటివాక్యములు.

అంతట నమ్మహానుభావుఁడు గాఢ మైన ధ్యాననిష్ఠలోఁ బ్రవేశించెను. పిమ్మట నాయన క్రమక్రమముగా నైహికసంబంధ మైనజ్ఞానము మొదలైనవానిని విడిచి చిత్తము నిర్వికల్పసమాధిలోఁ జేర్చెను. అది చూచి యానందుఁ డనిరుద్ధునితో 'భగవానుఁడు బుద్ధుఁడు సిద్ధి పొందినాఁ' డనెను. 'అయ్యో! అన్నా! కాదు కాదు. బుద్ధుఁడు సిద్ధి పొందలేదు. సుఖదుఃఖానుభవములకు, నాలోచనలకు నతీత మైననిర్వికల్పసమాధిలో నీ మహాత్ముఁడు ప్రవేశించినాఁ' డని యనిరుద్ధుఁ డుత్తరము చెప్పెను. అనంతరము బుద్ధదేవుఁ డాస్థితిలోఁ గొంతసే పుండి దేహత్యాగము చేసెను.

**అజ్ఞానం — అపోహ**

# ఆంధ్రకవులు వర్ణించిన బుద్ధావతారం

### శ్రీ 'విద్యారత్న' గారు

[బుద్ధుని, బౌద్ధమతాన్ని మన కవులు అపార్థం చేసుకున్నారు. దీనికి ఆకర మేమో! శ్రీనాథుఁడు, తెనాలిరామలింగకవి వినా తక్కినవా రందరు అష్టశీలాలకు జీవితాన్ని అంకితం చేసినతథాగతునికే పరవనితా శీలభంగం సులభంగా అంటగట్టినారు. అడుగడుగునా బౌద్ధ స్తూపారామాలు వెలసిన తెలుగునాటిలోని ప్రజలు బుద్ధునినే అపార్థం చేసుకోడం మరీ వింత. బౌద్ధసాహిత్యం ధ్వంస మైన దని, జైనసాహిత్యాన్ని నన్నయ నశింపచేశా డని మన విమర్శకులు అంటారు. బౌద్ధజైన సాహిత్యాల ప్రభావం ఏకాంత పడినజాతి అయినా, బుద్ధునికి ఇంతటి అపచారం చేసి వుండేదా? మహావీరుని, బుద్ధుని అభేదంగా పరిగణించడం మన ప్రాచీనాంధ్ర కవుల మరొక పొరపాటు. మన నాగరికతలో బౌద్ధప్రభావం పడిం దని, మన అమరావతి ఇతరదేశాల కళాలక్ష్మికి అందాలు తిద్దిం దని చెప్పుకొనేవారు దీనికి సమాధానం చెప్పవలసి ఉంటుంది.

బౌద్ధాన్ని శ్రీనాథుఁడు సరిగా అర్థం చేసుకున్నా డని మొదలే మనవి చేశాము. తెనాలి రామకృష్ణుడు

'ప్రతిదినకేశలుంఛనపు
రాయిడి నెట్టన బట్ట గట్టి పైఁ
బుతపుత మంచు నున్నకుఱు
బోడతలన్ ధరియింప నోడియున్
సతముగ సొమ్ము గాన నిడఁ
జాలవుగా శిఖిపింఛవల్లి సౌ
గతమతధుర్య! దానిఁ గటి
గట్టుము పుట్టము మిన్న కేటికిన్?'

అని బుద్ధుని బాహ్యవేషాన్ని మాత్రమే వర్ణించాడు.

శ్రీ 'విద్యారత్న' గారు ఈ వ్యాసంలో మన ప్రబంధకవులు ఊహించిన బుద్ధుని వికృతావతారాన్ని తెలియజేస్తున్నారు.

—సంపాదకులు]

ఆంధ్రవాఙ్మయములో బౌద్ధమతప్రస్తావన, ఒక్క వీరశైవవాఙ్మయమునను, అందు ముఖ్యముగా పండితారాధ్యచరిత్రలోను కల దని యీవరకే నిరూపిత మైనది. పాల్కురికి సోమనాథుని వెనుక వీరశైవమునకు సంబంధించిన కొన్ని గ్రంథములయం దీ బౌద్ధమత ప్రస్తావన యున్నను, అది ఆరాధ్యచరిత్రలోని విషయముల ననువదించునది మాత్రమే యై యున్నది. ఏకామ్రనాథకవి క్రీ.శ. 1323 ప్రాంత మున అన్యవాదకోలాహలము అనుగ్రంథములో నిట్లు వ్రాసి యున్నాడు.

సీ. బౌద్ధంబు వేదవిరుద్ధంబు భవపాశ
బద్ధంబు దుఃఖసమృద్ధ మనియు
బౌద్ధంబు విగతవిశుద్ధంబు సత్యాను
బద్ధంబు శాస్త్రవిరుద్ధ మనియు
బౌద్ధంబు లోకనిషిద్ధంబు సుకృతావ
బద్ధంబు దుష్కర్మబద్ధ మనియు
బౌద్ధంబు మోహసంబద్ధంబు విజ్ఞాన
విద్ధంబు సాక్షాదబద్ధ మనియు
ఆ.వె. సాంఖ్యతొండడాదిసమయంబు నిరసించి
భక్తుఁ డై మహానుభావుఁ డగుట
యెఱుఁగరయ్య బౌద్ధు లేకామ్రగురుచిత్త
నలినభృంగ! సోమనాథలింగ!

(53 పద్యము.)

ఇందు పేర్కొనబడిన సాంఖ్యతొండడు— శాక్యతొండడు. ఇతడు మొదట బౌద్ధుఁడు. ఆవెనుక శైవమతమును స్వీకరించినాడు. శివుని పూజించుటకు పూవులు దొరకకుండ చేసినపుడీతడు రాళ్లతో పూజించేవాడు. ఒకనాడు అవి కూడ దొరకక పోవుటచే, ఒక పెద్దబండ నెత్తి శివునిపై వైచినాడు. శివుడు ప్రత్యక్ష మైనాడు.

ఈతనికథ బసవపురాణములో నున్నది. "సాఖ్యతొండని రాలజడికి నోర్చినవాని, సౌఖ్యతరసాయుజ్యసరణిఁ గూర్చినవాని" అని యీ కథ త్రిపురాంతకోదాహరణములో సూచిత మై యున్నది.

అన్యవాదకోలాహలకర్త పండితారాధ్య చరిత్రలోని పదజాలమును గ్రహించినటుల స్పష్టము. పండితారాధ్యుడు చందవోలులో బౌద్ధులను జయించినకథ గంగాధరకవి చెన్నమల్లేశలింగ శతకములో 67 పద్యమున సూచితమై యున్నది. సాత్త్వికబ్రహ్మవిద్యావిలాస నిరసన మను మఱియొక వీరశైవగ్రంథమున నీ విషయ ముట్టంకింపబడి యున్నది.

*బౌద్ధలింగము

'పరవాదిగజాంకుశము' అను నామాంతరము గలచోడలింగశతకమున-గద్దె రామలింగకవి సమస్తదేవతలును, మునులును, దశావతారములును శివలింగమును స్థాపించి, శివుని భక్తులైనట్లుగా నైతిహ్యములను వ్రాసి యున్నాడు. కృష్ణామండలములోని ఎర్రగూడెము తాలూకా ముఖ్యనగరమగు కొవ్వూరు (గోపాద క్షేత్రము) నందు వెలసిన చోడలింగమునకీ కృతి సమర్పితము. అందుచే నిది 'చోడలింగమా' యనుమకుటముతో నున్నది. కణ్వుఁడు, అగస్త్యుఁడు, సీత, బౌద్ధావతారమున బుద్ధుఁడు స్థాపించిన లింగములు క్రమముగా కణ్వలింగము, అగస్త్యలింగము, సీతాలింగము, బౌద్ధలింగము అయినవి. కణ్వలింగముపై అగస్త్యలింగముపై ప్రత్యేకముగా వేఱ్వేరు కవులు వ్రాసిన శతకములు గలవు.

బౌద్ధలింగము శ్రీపర్వతక్షేత్రమునందు గలదని యీ గ్రంథమున చెప్పబడి యున్నది.

శ్రీపతి బౌద్ధవేషమును జేకొని
పుట్టు నిరంతరంబు వా
ణీపతి సేవితుండ నిను నెమ్మది
భక్తిమహత్త్వరూఢిచే
పాపున బౌద్ధలింగ మని పర్వత
మందున నిల్చి కొల్చి దే
వా! పరిశుద్ధయోగమునివంద్య
శరణ్యమ చోడలింగమా

111 పద్యము.

ఈ శతకకర్త యిప్పటికి రెండుశతాబ్దులు క్రిందటివాఁడు.

శతకకవుల చరిత్రలో 306 పుటలో "శ్రీపతి భాస్కరకవి' అనుశీర్షిక క్రింద నిట్లు గలదు. "శ్రీపతి భాస్కరకవి - ఈ కవి బౌద్ధమతపక్షపాతముఁ జూపుచు నొక "చిత్రశతకము" మనస్సును సంబోధించుచు వ్రాసెను...... చిత్రశతకము శుద్ధవేదాంతప్రతిపాదకమైన బౌద్ధశతక మనవచ్చును......" మఱియు "ఈ శతకము 17, 18 శతాబ్దులకుఁ బూర్వపుదై యుండవలె నేమో" అని దీని రచనాకాలము కూడ కొంత సందిగ్ధముగాఁ దెలుపఁబడి యున్నది. శతకాంతమున:

క. వృద్ధాచారశ్రుతిమత
పద్ధత్యనుభవనియుక్తి భాస్కరకృతి త
ద్విద్ధుల నాక్షేపించు ప్ర
బుద్ధుల కీ శతక మిచ్చు భుక్తిన్ ముక్తిన్.

అని యున్నది.

కాని పై శతకము బౌద్ధమతము గూర్చినది కాదు. ఈ కవి యధునాతనుఁడు. క్రీ. శ. 1910 ప్రాంతమున జీవించి యున్నాడు. ఈతఁడు విశాఖమండలములోని గుపిణి గ్రామవాస్తవ్యుఁడు - గొప్ప వేదాంతి. బాలాంత్రపు సూర్యనారాయణ యను పేరు గలవాడు. కొన్ని వ్యవహారికసంబంధములలో తగులుకొని, చిక్కులఁ పడి, తనపేరు శ్రీపతి భాస్కరశాస్త్రి యని మార్చుకొని రాజమహేంద్రవరములో నివసించేవాడు. ఈ వివరములు నేను కీ. శే. మానాయనగారి వలనను, ఆతని శిష్యుఁడగు కీ. శే. పుప్పల అప్పయ్యగారివలనను విని యున్నాడను.

శైవేతరములైన తెలుగు కావ్యములలోనచ్చటచ్చట బౌద్ధమతప్రశంస కానవచ్చుచున్నది.

కావ్యాలంకారచూడామణిలో విన్నకోట పెద్దన (క్రీ. శ. 1402 ప్రాంతము) యిట్లు వ్రాసి యున్నాఁడు.

షష్ఠోల్లాసము - సమయవిరుద్ధము.

క. అమరఁగఁ బులితోలును, మ
స్తమునం బలుజడలు దాల్చి సౌగతుఁ
హిమకరశేఖరు గుడి నన [డొప్పెన్
సమయవిరుద్ధార్థ మగుచుఁ జనుసత్కృతులన్.

183 పద్యము.

సుగతుఁ డనగా బుద్ధుఁడు. ఆ సమయాచారము ననుసరించువాఁడు సౌగతుఁడు.

సర్వజ్ఞ స్సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః - అని అమరము.

సుగతః-శోభనం గతం జ్ఞాన మస్య సుగతః - అని మంచి జ్ఞానము గలవాఁడు - అనియు -

* శతకకవుల చరిత్ర - 220-223 పుటలు.

సుప్తు అపునరావృత్యా మోక్షం గతః-లెస్సగా పునరావృత్తి లేక మోక్షమును పొందినవాఁడు-అని యీ శబ్దమునకు రెండు వ్యుత్పత్తులు.

నందిమల్లయ ఘంట సింగయకవుల ప్రబోధ చంద్రోదయములో బౌద్ధప్రశంస-

క. జవరా లగుకాపాలిని
కవుఁగిటఁ దన మేను గజఁగుఁ గజరులు వోఁగా
నవిరళసుఖమున హృదయం
బివతాళింపంగ బౌద్ధుఁ డిట్లని పలికెన్. (3-46)

సంస్కృతమూలమున :

భిక్షుః - సానందం పరిష్వజ్య రోమాంచ మభినీయ జనాంతికం అహో సుఖస్పర్శా కాపాలినీ - అని కలదు.

దశావతారములు – బుద్ధావతారము :

తెలుగుకావ్యాలలో బౌద్ధమతాన్నిగూర్చి ప్రత్యేకముగాఁ లేకపోయినను, శ్రీమహావిష్ణువు దశావతారములలోబుద్ధుఁ డొకయవతారముగా పరిగణితుఁ డైనకారణముచేత, దశావతార స్తవములలో బుద్ధప్రశంస కానవచ్చుచున్నది.

'మత్స్యకూర్మవరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామ శ్చ కృష్ణ శ్చ
బుద్ధః కల్కి రేవ చ.'

మత్స్యము, కూర్మము, వరాహము, నారసింహము, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బుద్ధ, కల్కి అనునవి దశావతారములు. ప్రప్రథమమున తెలుఁగు భారతములో శాంతి పర్వమున 2-38 మొదలు 2-48 వరకు భీష్మ స్తుతిలో దశావతార స్తుతి గలదు. అందులో మత్స్యాత్మ (2-39), కూర్మాత్మ (2-40), (2-41) వరాహ, నారసింహ (2-42) వామన (2-43) పరశురామ (2-44) శ్రీ రామ (2-45) హలముసలధర బలరామ (2-46) వాసుదేవ-కృష్ణ (2-47) కల్క్యాత్మని (2-48) అని పదియవతారములు పేర్కొనఁ బడినవి. ఇందు బుద్ధావతారము లేదు. దానికి బదులు బలరామావతారము గలదు. భీష్మస్తుతిలో సంస్కృతమూలము పరిశీలింపఁగా నందు దశావతార ప్రస్తావనయే లేదు.

కాఁగా తిక్కన వైదికమతవిరుద్ధ మగు బౌద్ధమతప్రసక్తి కృష్ణస్తుతిలో తెచ్చుట పాడిగా దని పరిత్యజించి యుండును.

తిక్కన వెనుక శ్రీనాథాది మహాకవులు దశావతార స్తవమును చేసినపుడు బుద్ధావతారమును చేర్చియే స్తుతించుచు వచ్చిరి. కాని యిందు చిత్ర మేమనఁగా, బుద్ధుని చేర్చినపుడు బలరామావతారముతో కలిపి పదునొకొం డైనను వానిని కవు లందఱును దశావతారములుగానే పరిగణించి యున్నారు. మఱియు బుద్ధావతారమును గూర్చినయైతిహ్యమందును, కొంత భేదమును పాటించి యున్నారు.

శ్రీనాథమహాకవి శృంగారనైషధములో దశావతారస్తుతి గావించినాఁడు. ఇది మూలములో నున్నదియే. 8-వ ఆశ్వాసములో 119 నుండి 141 పద్యములవఱకు నీస్తుతి గలదు. అందు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బలరామావతారము లైనవెనుక బుద్ధావతార మిట్లు వర్ణిత మైనది.

తే. ఏక, యద్వయవాది, త్రయీవిదూర
యనవగీత చతుర్విధ ఖ్యాతిమార్గ
పంచబాణారి! షడభిజ్ఞ! పరమపురుష
బుద్ధ! సంపత్పరంపరావృద్ధి యొసఁగు.
బుద్ధ! నీగట్టిహృదయసంపుటము దాఁకి
కుంఠితము లయ్యె మరునంపకోల లెల్ల
మొద్దు వోయి కదా యిప్పు మురవిరోధి
యలరు లెల్లను వర్తులాస్యంబు లయ్యె.
ముఖ్యచతురాననుఁడ వీవు మునిశరణ్య
గోఁచచతురాననుం డల కమలభవుఁడు
నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధదేవ! నిజము
శంభు సర్వజ్ఞుఁ డనుట లాక్షణికవృత్తి.

పై స్తుతిలోని విశేష మేమనఁగా నిది యంతయు బౌద్ధమతపరిభాషలో నున్నది.

సర్వజ్ఞ స్సుగతో బుద్ధో
ధర్మరాజ స్తథాగతః
సమంతభద్రో భగవాన్
మారజి ల్లోకజి జ్జినః
షడభిజ్ఞో దశబలో
ద్వయవాదీ వినాయకః
మునీంద్రః శ్రీఘనః
శాస్తా మునిః—

అని యమరకోశమున నుదాహృతము లైన బుద్ధుని పేళ్లలో నైషధమున కొన్ని పేర్కొనఁ బడినవి.

మొదటి పద్యమున సంఖ్యావాచకములు క్రమముగా చెప్పబడినవి.

అద్వయవాది:— అద్వయం జీవాత్మ పరమాత్మనో రభేదం వద తీతి అద్వయవాదీనపున-పు-జీవాత్మ పరమాత్మలకు నభేదముఁ జెప్పువాఁడు. వద వ్యక్తాయాం వాచి అని వ్యుత్పత్తి.

త్రయీవిమార:-- వేదప్రామాణ్యము నంగీకరింపకపోవుటచే వేదములకు మారమగువాఁడు.

అనవగీత చతుర్విధ ఖ్యాతిమార్గ:— 1. సత్ఖ్యాతి మార్గము సాంఖ్యమతము, 2. అసత్ఖ్యాతిమార్గము- వేదాంతమతము, 3. సదసత్ఖ్యాతిమార్గము-మీమాంసకమతము, 4. అనిర్వచనీయఖ్యాతి మార్గము -అద్వైతమతము- ఈ నాలుగుసిద్ధాంతముల నంగీకరింపనివాఁడు.

పంచబాణారి:—మారజి ల్లోకజిత్ జినః అని కలదు కదా! బుద్ధుని మారుని జయించుట ప్రసిద్ధవిషయము. రెండవపద్యమున నీ విషయము స్పష్టపడుచున్నది.

షడభిజ్ఞః:—షట్ అభిజ్ఞాః షడభిజ్ఞః— 1. దివ్యదృష్టి, 2. దివ్యశ్రోత్రము, 3. పూర్వనివాసానుస్మృతి, 4. పరచిత్తజ్ఞానము, 5. అప్రత్యక్షవిషయజ్ఞానము, 6. వియద్గమనాగమనాది లక్షణబుద్ధి అను నీయాఱు అభిజ్ఞలు కలవాఁడు.

మూడవపద్యమున, శంభు సర్వజ్ఞు డనుట లాక్షణికవృత్తి అనుటలో కూడ విశేషమున్నది. సర్వజ్ఞశబ్దము బుద్ధునికి పర్యాయపదముగా వాడబడినది కాని, అమరకోశమున శివునికి పర్యాయపదముగా వాడబడ లేదు.

పై వివరణమువలన దశావతారములలో బుద్ధావతార మొకటిగా పరిగణితమైనను, ఇచ్చట బుద్ధుడు త్రిమూర్తులకంటె నొక విధమగుప్రత్యేకవిశిష్టత గలయవతార మనియు, కేవలము బౌద్ధమతసిద్ధాంతముల ననుసరించి యీ స్తుతి కావింపబడె ననియు స్పష్టమగుచున్నది. మఱియు నిందు బుద్ధుని యాదర్శ స్వరూప మగు నాధ్యాత్మికవిశిష్టత గోచరింపజేయుచు నుదాత్తమై యొప్పుచున్నది.

భాగవతమున 'ఏకవింశతితమం బైనకలియుగాద్యవసరంబున రాక్షససమ్మోహనంబు కొఱకు మధ్యగయాప్రదేశంబున జినసుతుం డయి బుద్ధనామధేయంబునఁ దేజరిల్లి' అని ప్రథమస్కంధమునఁ గలదు.

పారిజాతాపహరణము:

'త్రిపురస్త్రీలఁ బతివ్రతామణుల
సారెంబుంశ్చలీవర్తనం,
బుపదేశం బొనరించిబేల్పఱచి
వధ్యుల్ గాని తద్భర్తలన్
ద్విపదర్మ్యాంబరు చూపుటింగలమునన్
వే త్రోచి పాటింపవే,
కపటశ్రీజిన రూపమున్
భువనరక్షా జాగరూకేక్షణా!

దశావతారచరిత్రమున కూడ బౌద్ధావతారమున నొకకథయే ప్రస్తావితమైనది.

ఆముక్తమాల్యదయందును, నాతరువాతి ప్రబంధచాటువులయందును, నీబుద్ధావతార ప్రసక్తి వేఱొక విధముగాగ లదు-చూడుఁడు.

ఆముక్తమాల్యద:

మ. తరుణత్వత్సృతి బాణపంచకమునం
దైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మక
జరద్బాణం బాకంటకన్ జెడన్
ద్వరఁ గావించితి వేటికో అహహా!
బుద్ధం బయ్యె నీభావ మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసాధ్యం
బౌటగాఁ గేశవా? (4-30)

ఇచట బుద్ధుని మారజిత్త్వము సూచితమైనను, మారుడు విష్ణుని కుమారు డని నిరూపించుటచే పాక్షికమైనది.

తెనాలిరామలింగకవికృతము లని గురుజాడవారును, ఎలకూచి బాలసరస్వతి కృతము లని ప్రభాకరశాస్త్రిగారును నిరూపించిన దశావతారస్తుతిలోను దీని కించుమించుగ ఛాయవలెనున్న సత్యవోలు భగవత్కవి దశావతారస్తుతిలోను త్రిపురదైత్యస్త్రీవిమోహనవర్ణనయే కలదు.

ఆంధ్రవాఙ్మయము తదితరదాక్షిణాత్య వాఙ్మయములవలె బౌద్ధమతమును సర్వముగా గ్రహింపలేక పోవుటకు కారణ మేమియో చెప్పలేము. కాని ఉత్తరాపథవాసులు బుద్ధుని అవతరమూర్తిగ పరిగణించిన తర్వాతనే ఆంధ్రులును తమ సాహిత్యములో నతని నవతారమూర్తిగా స్తుతించుట సంభవించియుండును. అందరును బుద్ధుని త్రిపురదైత్యస్త్రీల ప్రాతివ్రత్యభంగమునే పేర్కొను సంప్రదాయము మాత్రము గమనార్హము!

పరిసరసాహిత్యాలు :

# బౌద్ధంతో వికసించిన హిందీ

శ్రీ ఆలూరి బైరాగిగారు

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బౌద్ధధర్మప్రభావం భారతదేశంలోని అన్ని భాషల సాహిత్యాల్లోనూ కనుపిస్తుంది. హిందీ భాష ప్రథమస్వరూపం మనకు బౌద్ధసాహిత్యం ద్వారానే గోచరమౌతుంది. దీనిద్వారా హిందీ సాహిత్యచరిత్ర 300 సంవత్సరాలు వెనక్కు పోయింది. 'బౌద్ధగాన్ ఓ దోహా' 'థేరీ గాథ' మొదలైనవి హిందీభాషగా నిర్వచింపదగిన భాషారూపంలో లభించే ప్రప్రథమగ్రంథాలు. టిబ్బెట్‌లో ఎక్కడో మూలను పడిఉన్న వీటిని పరిశోధించి, వెలికి తీసుక వచ్చి, ఈవిధంగా హిందీభాషాచరిత్రను పొడిగించి, అమూల్యమైనసేవ చేసిన శ్రేయస్సు సుప్రసిద్ధబౌద్ధపండితులు త్రిపిటకాచార్యులు శ్రీరాహుల్ సాంకృత్యాయన్ గారికి దక్కుతుంది. సిద్ధుల గాథలు బౌద్ధసన్యాసినుల గాథలు ఈగ్రంథాల్లోని ఇతివృత్తం.

ఐతే సామంతయుగంలో బ్రాహ్మణధర్మ ప్రభావంవల్ల బౌద్ధసాహిత్యం అడుగంటి పోయింది. కొన్నివందల యేండ్ల చరిత్ర గలిగిన ఈ యుగంలో మనకు మచ్చుకొక్క బౌద్ధగ్రంథమైనా కానరాదు. అసలిటువంటి గ్రంథాలే రాయబడలేదో, లేక రాసినవి సద్ధర్మవిరోధులద్వారా నామరూపాలు లేకుండా నాశనం చేయబడ్డాయో మనమీనాడు చెప్పగలస్థితిలో లేము. ఏమన్నా కానివ్వండి. ఫలితం ఏమి జరిగిందంటే మళ్ళీ పందొమ్మిదవ శతాబ్దం అంతంవరకూ మనకొక్క బౌద్ధగ్రంథం కూడా కానరాదు.

తరువాత వచ్చిన నవజాగరణంలో కూడా జనులదృష్టి మొట్టమొదట పురాతన హైందవ సంస్కృతివైపే మరలింది. ప్రప్రథమంగా ప్రసిద్ధవిమర్శకుడు శ్రీరామచంద్ర శుక్ల ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన లాయిట్ ఆఫ్ ఆశియాను ఆధారంగా తీసుకొని 'బుద్ధ్‌చరిత్' అనే కావ్యం వ్రాశాడు. తరువాత శ్రీ మైథిలీశరణ గుప్తా బుద్ధుని జీవితాంశాలనే 'యశోధరా' అనేపేరిట కావ్యంగా వ్రాశాడు. ఈకావ్యం చాలా జనాదరణ పొందింది. మరొకాయన సిద్ధార్థ్ అనేకావ్యం వ్రాశాడు. విడిగా చాలామంది కవులు బుద్ధుణ్ని గురించి ఖండకావ్యాలు వ్రాశారు. వాటిలో జయశంకర్‌ప్రసాద్ వ్రాసిన 'అరీకరుణకీ శాంతకఛార్' చెప్పుకోదగియున్నది. అశోకుని జీవిత విశేషాలను గురించి కుణాలుని చరిత్ర గురించి చాలామంది ఖండకావ్యాలు, చిన్నకథలు, నాటకాలూ వ్రాశారు. జయశంకరప్రసాద్ వ్రాసిన 'కలింగ విజయ్' మంచి ఖండకావ్యం. ఉపగుప్త వాసవదత్తల మనోహరమైనకథను ఇతివృత్తంగా తీసుకొని చాలామంది చిన్నకథలూ నాటికలూ వ్రాశారు. జయశంకరప్రసాద్ వ్రాసిన 'అజాతశత్రు' బుద్ధుని సమకాలిక విషయాలు తెలిపే గొప్పనాటకం. జాతకకథలు హిందీలో అనువదింపబడి అనేకఖండాలుగా ప్రచురింపబడ్డాయి. ప్రచురణకర్తలు హిందీ సాహిత్య సమ్మేళన్, ప్రయాగ్. త్రిపిటకాల అనువాదం కూడా జరుగుతున్నది. హిందీభాషకు ఎంతో సేవ చేసినబౌద్ధభిక్షువులు శ్రీరాహుల్ సాంకృత్యాయన్, బధంత్ ఆనందకౌసల్యాయన్, శ్రీ భిక్షుధర్మ రక్షిత్ మొదలైనవారు. ముఖ్యంగా శ్రీరాహుల్ సాంకృత్యాయన్, ఆనందకౌసల్యాయన్ గారలు అనేక బౌద్ధగ్రంథాలు అనువదించి స్వయంగా రచించి హిందీభాషకు చాలా ఉపకారం చేశారు.

ఆమ్రపాలికథ ఇతివృత్తంగా తీసుకొని శ్రీ ఆచార్య చతురసేన్ శాస్త్రీగారు 'వైశాలీకీ నగరవధూ' అనేపేరు గలపెద్దనవల ఒకటి వ్రాశారు. ఇదే ఇతివృత్తాన్ని నాటకంగా వ్రాశారు శ్రీరామకృష్ణశర్మ బేనీపురీగారు. ఈకథ చాలా ప్రసిద్ధమైనది. చిన్నకథలరూపంలోనూ ఖండకావ్యాలరూపంలో గూడా చాలాసార్లు ఉపయోగించబడింది.

భారతప్రభుత్వానికి అభిరుచి కలిగినందువల్ల ఇప్పుడిప్పుడు హిందీలో బౌద్ధసాహిత్యం విరివిగా వస్తున్నది. ఇకముందు ఇంకా వృద్ధి జరుగుతుందని ఆశించవచ్చు.

(8 వ పుట తరువాయి)

గతించిన వందసంవత్సరాలకు వేసాలిలోని వజ్జికులమువారు దశవత్థూని దశవస్తువులవిషయంలో ప్రాచీనాచారం ఉల్లంఘిస్తూ వచ్చారు. ఈ దశవస్తువులలో బౌద్ధసాంఘికులు స్వర్ణరజతములను పరిగ్రహించకూడదు; మద్యపానం చేయకూడదు. ఈవిషయాన్ని విచారించి ఆచారనిర్ణయం చేయుటకు రెండవమారు బౌద్ధమహాసభ వైశాలిలో సమావేశమయింది. థేరులు ఈ దశవస్తువుల విషయమున ప్రాచీనాచారం ఉల్లంఘించిన సాంఘికులను బహిష్కరించారు; ధర్మం నిర్ణయించారు. పదివేలమంది భిక్షువులు థేర సంఘాన్ని విడిచిపెట్టి పోయినారు. వీరే అధిక సంఖ్యాకులుగా ఉండడంవల్ల ఈ వర్గంవారికి మహాసాంఘికు లని పేరు కలిగింది. అప్పటినుండి బౌద్ధసంఘం థేరు లని, మహాసాంఘికులని రెండు పక్షా లయింది. థేరులు శీలమునకు, నీతికి, ఆచారమునకు ప్రాధాన్య మిస్తే, మహాసాంఘికులు తత్వవిచారమునకు, లోకోపకారవిషయములకు ప్రాముఖ్యం ఇచ్చారు. థేర సంప్రదాయంలోని ఒకశాఖకు విభజ్యవాదమని పేరు. అశోకచక్రవర్తి ఈ సంప్రదాయంవారిని అధికంగా ఆదరించాడు. అశోకచక్రవర్తి కాలంలో పాటలీపుత్రనగరమూ మగధదేశమూ భారతదేశంలో బౌద్ధానికి కేంద్రాలయినవి. మౌర్యులకు తరువాత మగధను పాలించిన శుంగవంశజులు, కాణ్వవంశజులు బౌద్ధులను హింసించడంవల్ల థేరవాదులు సింహళగాంధారములకు, మహాసాంఘికులు తెలుగుదేశానికి వలస పోయినారు. మౌర్యసామ్రాజ్యం పతనమైనతరువాత హిందూదేశంలో బౌద్ధానికి ఆంధ్రదేశమే కేంద్రమయింది. మహాదేవథేరు డనేముని ఆంధ్రదేశానికి వచ్చి ఇచ్చట చైత్యకసంప్రదాయం స్థాపించాడు. మహాసాంఘికులలోని ఆరు సంప్రదాయములలో ఈ చైత్యకసంప్రదాయం ఒకటి. గోకులిక, ఏకవ్యవహారిక, ప్రజ్ఞప్తివాద, బహుశ్రుతీయ లోకోత్తరవాద సంప్రదాయములు మిగిలినవి. మహావస్తువులో ఉన్నట్లు మహాచైత్యపూజకు ఎక్కువ ప్రాముఖ్య మివ్వడంవల్ల నేమో ఈ సంప్రదాయానికి చైత్యక సంప్రదాయ మని పేరు వచ్చింది. చైత్యక సంప్రదాయంవారికి ధనకటకం అంటే అమరావతి కేంద్ర మయినది. ఈ చైత్యకులలో మరల పూర్వశైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థకము లని మళ్లీ నాలుగు సంప్రదాయము లేర్పడినవి. ఈ చైత్యకులు అంధకులు, ఆంధ్రదేశంలోని వారు. పూర్వశైల మన్నది ధనకటక మహాచైత్యమునకు తూర్పున, అపరశైలను ఆమహాచైత్యమునకు పడమట నున్న బౌద్ధసంఘముల పేరు. పూర్వశైలను ఇప్పటి గంటసాల, అపరశైల మిప్పటి నాగార్జునినికొండ కావచ్చునేమో. నాగార్జునినికొండ శాసనములలో బహుశ్రుతీయులు, అపరశైలీయులు, పూర్వశైలీయులు, రాజగిరికులు, విభజ్యవాదులు మొదలైన వేరు వేరు సంప్రదాయాలవారు ఉదాహృతు లయినారు. వీరందరు అక్కడివిహారాలలో ఉండినట్లు ఊహింపవచ్చును. టిబెట్టుదేశ ఐతిహ్యమును అనుసరించి పూర్వశైల అపరశైల నికాయములవారి ప్రాకృతభాషలో రచించిన ప్రజ్ఞాపారమిత అనేగ్రంథం ఉండేదనిన్ని, దీనిలోనే మహాయానమునకు సంబంధంచిన భావాలు బీజప్రాయంగా ఉండేవనీ, ఇవి మహాయాన సంప్రదాయం రూపొందడానికి చాలా తోడ్పడినవని పరిశోధకపండితు లంటారు. కనిష్కచక్రవర్తి నాలుగవతడవ బౌద్ధసభను సమావేశపరిచేనాటికే మహాయానమునకు సంబంధించిన భావాలు దేశ మంతటా పొటమరించి ఉన్నవి. వాటి కొకరూప మిచ్చి ఒక గొప్పసంప్రదాయం మహాయానంగా రూపొందించిన ఆయన నాగార్జునాచార్యులవారు. మహాయానం రూపొందడంతో బౌద్ధం ప్రతివ్యక్తికీ, ప్రతిగృహస్థుకూ అందుబాటులోనికి వచ్చింది. బౌద్ధం బహువ్యాప్త మయింది. అంతటినుంచి బౌద్ధంలో తత్వజిజ్ఞాస ఎక్కువయింది. నాగార్జునాచార్యులవారు తత్వవిచారము కావించి శూన్యవాదం ప్రతిపాదించారు. కాని దీనితో సాంఘికులకు తృప్తి కలుగలేదు. అపుడు మైత్రేయనాథుడు విజ్ఞానవాదమును ప్రతిపాదించారు. నిర్వాణం పొందినతరువాత మిగిలేది శూన్య మని నాగార్జునాచార్యులవా రంటే విజ్ఞాన మని మైత్రేయనాథు డన్నాడు. విజ్ఞానవాదమునకే యోగాచారవాద మనిన్ని పేరు. ఇంకను బౌద్ధంలో తత్వవిచారం ముదిరి విజ్ఞానానికి మహాసుఖం కూడా కలిసింది. ఈ మహాసుఖ

వాదంలోనుంచే వజ్రయానం ఆవిర్భవించింది. బౌద్ధం పొందినదశలలో ఇది కడపటిది. వజ్రయానం రావడంవల్ల బౌద్ధంలో సంఖ్యాతీతంగా దేవీదేవతలు వెలిశారు. విగ్రహనిర్మాణం ప్రబలింది. అమరావతిలో దొరకిన సింహనాద, పద్మపాణి, బుద్ధసంభవరత్నము లనేవిగ్రహాలు వజ్రయానానికి సంబంధించినవే. దీనిలో తాంత్రికపూజ, వామాచారం ప్రబలి బౌద్ధం ప్రచారం కోల్పోయింది. బౌద్ధం బాగా వర్ధిల్లిననాడు నాగార్జునకొండ, ధనకటకాలు గొప్ప బౌద్ధవిద్యాపీఠాలుగా ఉండేవి. వీటికి దేశాంతరాలనుంచీ, ద్వీపాంతరాలనుంచీ కూడా విద్యాసముపార్జనం నిమిత్తం బౌద్ధభిక్షులు వస్తూవుండేవారు. దేశంలోని ధనకటకాది స్తూపాలలోని శిల్పచిత్రాలు కావ్యశోభను సంతరించుకొన్నవి. తెలుగుదేశపు స్తూపాలు బౌద్ధాంధ్రులు బుద్ధభగవానునికి భక్తిసంభరితులై ఎత్తిన శిల్పకర్పూరదివ్యనీరాజనాలు.

మహాయానం మూలంగానే బౌద్ధంలో కళకు తావేర్పడింది. నాగార్జునాచార్య శ్రీపాదులు ఎంతటి తాత్త్వికవిచారశీలియో, ఎంతటి లోకహితైషియో అంతటి కళాప్రియుడు. ధనకటక మహాచైత్యంచుట్టూ శిల్పచిత్ర రత్నాలతో పొదిగిన మహాప్రాకారం నిర్మించినది ఆయనే అని టిబెట్టుదేశచరిత్రలు చెపుతవి. ఈ ప్రాకారంలోని ప్రతిశిల్పచిత్రమూ జీవం ఉట్టిపడుతూ నిన్ననో మొన్ననో చెక్కినట్లు కలకలలాడుతూ ప్రాతఃకాలంలో విరిసిన నవమల్లికాకుసుమం లాగ అచ్ఛస్వచ్ఛంగా ఉంటవి. ధనకటక మహాచైత్యప్రాకారంలోని శిల్పచిత్రాలే కాదు, నాగార్జునకొండ, గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి ఈ మొదలైనచోట్ల ఉన్న స్తూపశిల్పచిత్రాలు కూడా ధనకటక ప్రాకార శిల్పచిత్రాలకు తీసిపోయేవి కావు. తెలుగుదేశంలో బౌద్ధం అవతరించి తెలుగుజాతిని కళావంతము చేసింది; తెలుగుశిల్పికృతులలో అమృతం చిలికించింది. అందువల్లనే అంతకుపూర్వపు బౌద్ధక్షేత్రాలలో స్తూపశిల్పచిత్రాలు వట్టి నీరసప్రతిమలైతే తెలుగుమహాయాన మవతరించి ఆదిమ బౌద్ధము స్వరూపస్వభావములనే పూర్తిగా మార్చివేసింది. హీనయాన బౌద్ధుడు తన నిర్వాణమునకే తన సంసారదుఃఖవిమోచనమునకే తన అర్హత్పదమునకే కృషి చేసేస్వార్థపరుడు. మహాయానవాది అట్లు కాదు. అతనికి అవలోకితేశ్వరుడు ఆదర్శము. అతడు బోధిసత్త్వుడు. మహాయానములో బోధిసత్త్వులనేకులు ఉదయించారు. వేరువేరు మనఃపరిణతులు గల వేరువేరు వ్యక్తులకు నిర్వాణం సాధించడం కోసం తోడ్పడేటందుకు వచ్చినవారు బోధిసత్త్వులు. నిర్వాణం పొందుటకు సిద్ధంగా ఉండీ కూడా లోకంలోని ప్రతివ్యక్తీ నిర్వాణం పొందితేకాని తనకక్కరలేదని నిరాకరించి సర్వలోకహితైషియై ప్రవర్తించాడు బోధిసత్త్వుడు. ఇటువంటి బోధిసత్త్వులు జనులకు తోడ్పడుటకు సృజింపబడినవారు వందలూ వేలూను. అందుచేతనే మహాయానానికి బోధిసత్త్వయానమని కూడా పేరు వచ్చింది. బౌద్ధం విశ్వవ్యాప్తి పొందింది మన తెలుగుదేశంలో కృష్ణానదీతీరాన మహాయానం రూపొందిన తరువాతనే. అందువల్లనే నాగార్జునాచార్యులవారు బుద్ధుని తరువాత బుద్ధుడంతటివాడయినాడు. మహాయానం వచ్చి బుద్ధుణ్ని భగవంతుణ్ని చేసి అతనికి లోకోత్తరశక్తులు ప్రసాదించింది. బుద్ధపురాణం వెలిసింది.

పశుపక్ష్యాదులలోన మానవులలోఁ బల్మాఱు జన్మించి దు
ర్దశలం గుందెడిప్రాణికోటికిఁ గృతార్థత్వమ్ము సేకూర్చి స
ద్యశముం గాంచినబోధిసత్త్వుని పవిత్రశ్రీచరిత్రల్ దివా
నిశముం బాడుఁడు; కావ్యరాజములుగా నిర్మింపుఁడా సత్కవుల్!

—శ్రీ దాశరథి.

# ఉపమాలంకారము

శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

(గతసంచిక తరువాయి)

—: o :—

చక్రవాక స్తనసౌభాగ్యములు చూపి,
అరుణోత్పలాధరస్ఫురణ చూపి,
అతులమృణాళబాహావిలాసము చూపి
సౌగంధికాంగవాసనలు చూపి
లీలాతరంగవళిప్రకాశత చూపి
యరవిందచరణసుందరత చూపి
ఇంపు పుట్టించుచున్నది హృదయమునకు
ఇక్కొలకు వింత చూచితివే వయస్య
కలితయౌవనరూపరేఖావిలాస
విభ్రమోదార యగుప్రౌఢవేశ్యవోలె.

ఇందు వేశ్యాకాసారములకు సాధారణ ధర్మములు సమాసభేదాశ్రయముచే నుభయాన్వితములు.

ఒక్కొకచో పైవాని యథాసంభవ మిశ్రణము :—

విజయవిలాసమున,

ఆదరహాసచంద్రికలయందము
నాఫ్తులమీఁదఁ జిల్కన
త్యాదరశీతలేక్షణసుధారసధారయుఁ
జూడఁ జూడ నా
హ్లాదము గొల్పఁగాఁ గలకలా
మహిమంబుఁ దలంచి చూచినన్
మాదిరి సేయవచ్చు జననాథు
మొగంబును జంద్రబింబమున్.

ఇచ్చట ముఖచంద్రబింబములకు సాధారణ ధర్మము—'దరహాసచంద్రికలు, శీతలేక్షణ సుధారసము' అనుచో సమాసభేదాశ్రయము; 'ఆహ్లాదము' అనుగామి; 'కల—కలామహిమము' శ్లిష్టము.

నిజమునకు ధర్మభేదము లివ్వియే యని చెప్పవలను గాదు.

దూరమున నుంత్రు కాపట్యదోషమునను
ఖలుని విషమున దందశూకమునుబోలె
నాత్మహానికి వెఱచుచు నఖిలజనులు
సద్గుణునిఁ జేరఁదీసినచందముగను,

ఇట పూర్వార్ధమున బింబ ప్రతిబింబ భావాపన్నములైన విషదోషములు 'దూరమున నుంచుట' అను అనుగామి ధర్మమునకు హేతువులు.

'సద్గుణునిఁ జేరఁదీసినచందముగను.' అను విపరీతోపమయందు దోషగుణములకు క్రియాహేతుత్వము నాశ్రయించి బింబప్రతిబింబ భావము.

వాక్యమత్కృతికి పారము లేనందున ఇత్యాదు లనేకము లూహ్యములు.

పరమశాంతుఁ డితండు సర్పంబువోలె
మర్కటమువోలె నిశ్చలమానసుండు
భిదురమునుబోలె నత్యంతమృదులహృదయుఁ
డౌర! పొగడంగ వశమె మహాత్ము నితని.

ఇందు ఉపమానబలమువలన పేర్కొన్న సాధారణధర్మములు బాధితములై లక్షణవల్ల విరుద్ధధర్మములు లక్షితము లగుచున్నవి. వ్యంగ్యధర్మములు ధర్మలుప్తలలో బహుధోదాహృతములు.

ఇవ్వివిధభేదములచేత భిన్నమగు నీయుపమ వాచ్యములైన వస్త్వలంకారములకు, వ్యంగ్యములైన వస్త్వలంకార రసాదులకూ ఉపస్కారకమై విరాజిల్లుచున్నది.

వాచ్యవస్తూపస్కారిక :—

విశ్వసించియున్న వీరుని కపకార
మాత్మనాశకరము హరిని మేలు
కొలుపు నడవి చెట్టుకొమ్మను విరిచిన
సద్దువోలె వనగజమ్మునకును.

అడవి యేనుగు విరిచిన చెట్టుకొమ్మ సద్దు, నిదురించు సింగమును లేపి ఆ కరి మరణమునకు కారణమైనచందమున నమ్మిన వీరునికి విశ్వాసఘాతుకత్వము తనకే వినాశము గలిగించును.

ఇచ్చట ఉపమ ప్రకృతోపపాదకమై ఉపస్కారక మగుచున్నది.

మరి, 'ఇచ్చట విశ్వసించియున్న వీరునికి చేయు అపకారము ఆత్మనాశకరము' అను

ప్రకృతమగు ఉపమేయ వాక్యార్థము ఉపమా లంకారభాగమే గాని తద్భిన్నము గాదు. అట్టి తరి అలంకారము ఉపస్కరింపబడిన అలంకార్య మగుప్రకృతవస్తు వెయ్యది ? అంటే, అది వలదు లెస్స. దీనిఁ బరికించుము.

అనంతకృష్ణశర్మగారి గాథ :—

క్రొత్తజున్నుపాలఁ గుడిపినట్టి
యెనుపదూడవోలె నేల నిద్రించెదు
పగటిపూట నోడలఁ ప్రాలుమాలి.

జున్నుపాలు ద్రావిన యెనుపదూడ నిద్రించినట్లు కదిపినను హెచ్చరిక లేక పగటిపూట నీవు మజ్జెక్కి నిదురపోవుట, చెప్పకయే, 'వాఁడు=నీప్రియుఁడు, వలచి, వలపించి కేళీల రతులఁ దేలించినాఁడు' అని తెలుపుచున్నది.

అనుచో, నుపమ, ప్రథమ పాదార్థానుమాపక మై ఉపస్కారక మగుచున్నది.

'వారివాహసమానవాగణంబులతోడ'

ఇత్యాదులు ఇందు కుదాహృతులు.

వాచ్యఅలంకారోపస్కారిక :—

రామాభ్యుదయమున,

సాగరవిషంబు గ్రోలి ధూర్జటియుఁబోలె,
నా త్రివిక్రమగతి దివి నాక్రమించి,
విధియు బలె నాదిసృష్టి కావించి, కాలు
మొగులు దలఁపింపె నపుడు త్రిమూర్తిమహిమ.

ఇందు పాదత్రయ ప్రతిపాదిత మగునుపమ, తురీయ పాదమందలి స్మృతిమదలంకారమునకు ఉపపాదకము కాన వాచ్యాలంకారోపస్కారిక.

వ్యంగవస్తూపస్కారిక:—

నిగతము పగులకు నుపకృతి
కరణంబున కెపు లయినకరుణాలుల ని
ష్ఠురములుగఁ దోఁచు పలుకులు
కరము విరాజిల్లు మందుకణికలువోలెన్.

ఇందు, 'పరోపకార నిరతులైన కరుణాళుల పలుకులు కటుకు లని యెఱుగిక ఆ మేరకు మెలగువారికి పరిణామమున మేలొదవును అను వ్యంగ్యార్థమునకు 'మందుకణికలువోలెన్' అను ఉపమ ఉపస్కారిక,

వ్యంగ్యాలంకారోపస్కారిక :—

అంకమును బోలుమృగనాభిపంకతిలక
భాసురం బగునీమోము పంకజాక్షి!
చూచి యుల్లాసపుల్లచంచూపుటముల
చాపలముఁ జూపును చకోరశాబకములు.

కలంకమువంటి తిలకమును మోమున గని, చకోరశాబకములు చంచూపుటములు విచ్చి కౌముదీపానలాలసతను కనుబరచుచున్నవి' అను వాక్యార్థమువల్ల, చకోర శాబకములకు చంద్రభ్రాంతి వ్యంగ్యము. అందు, తిలకమున కలంకభ్రాంతి ఉపపాదకము. అది సాదృశ్యమూలకము గాన, 'అంకమును బోలు' అను వాచ్యోపమ ఉపస్కారకము.

ఇందు, 'చకోరశాబకములు చంచూపుట చాపల్యము చూపును అను వాక్యమునకు కారణము వ్యంగ్య మగుచంద్రభ్రాంతి. ఆ భ్రాంతి లేనిచో చకోరశాబకములకు చంచూపుట చాపలము అసంభావితము. కాన వ్యంగ్య భ్రాంతి ఉత్తరవాక్యవాచ్యార్థోపపాదక మై గుణీభూత మగుచుండె. 'ప్రౌఢోక్త్యైవ వ్యంగ్య భ్రాంతి మదలంకారే'-అను జగన్నాథుని వాక్యము చింత్యము.

రసోపస్కారకము :—

'నను గనుగొను నాసను—' అనుచో నిరూపితము ఐనను-విజయవిలాసములోని,

'అంటినప్రేమ జూపన్నవికి నప్పుడ
దోడ్కొని వచ్చి యల్లవా
లంటి నిజేశ్వరుఁగాంచ దన
గన్నుదెనుంగనఁ జేర్చి బాష్పముల్
కంటఁ దొలంగుచుండఁ దిరుగం దిరుగన్
గనుఁగొంచుఁ గ్రమ్మరన్
జంటఁ దొలంగి సంజను వె
సం జను జక్కవపెంటియున్ బలెన్.

ఉలూచి అర్జునుని మున వదలి విడువలేక విడిచి పోవుచున్నది. ఇందు జక్కవ పెంటిపోల్కి విప్రలంభ శృంగారమున కుపస్కారకము.

'రసాదులు' అనుచో ఆదిపదము రసాభాస భావాభాసాదులకు గ్రాహకము. 'చంద్ర దేశ్యము వదనము'—అనుచో రసాభాసోపస్కారకత్వము ప్రదర్శితము.

భావమునకు :—

పండి సుకుమారపుష్పతల్పమునయందు,
కాంతి మిగిలినజాబిల్లి కలను బోలి,
దాపునకు వచ్చియుండినదయితు నింతి
సత్కరించును ప్రేమవీక్షణముతోన.

‘ఆధివ్యాధి జన్యబలహానివల్ల గలిగి వైవర్ణ్యాంగ శైథిల్యాదులకు కారణ మగుదుఃఖవిశేషము గ్లాని.

కాంతునికై పరితపించి, కృశించి, పూఁబాన్పు చేరినకాంత సమీపించినదయితుని సత్కరించుటకుఁ గూడ చేతకానిదై వట్టి చూపుతోనే స్వాగతాదిసత్కార మొసగుచున్నది. అనుచో ధ్వన్యమాన మగుగ్లానికి ‘కాంతి మిగిలిన జాబిల్లి కళనుబోలి’ అను ఉపమ ఉపస్కారకము గాన భావోపస్కారిక.

త్రివిధోపస్కారిక :—

అచట కాసారనీరము సదివసించి
కమలములమధ్య నదిగో బకంబు కంటె
విమలతారకతాకాశవీథియందు
నిండుజాబిల్లివలె కనుపండు వయ్యె.

‘తమ కలయికకు సంకేతస్థాన మెయ్యది?’ అని తెలియగోరియు, పలువురియెదుట నడుగుటకుఁ గొంకుచున్న వలపుకానికి ఇంగిత మెరిగిన వగలాడి సంకేతమును తెలుప నాడిన నుడు లివి.

ఇచ్చట నకిదఘ్న మగు కాసారజలముల నున్న బకమునకు విమలవీథి నున్న జాబిల్లి పోలికతో, ‘బకము చంద్రునివలె నిశ్చలము’ అని తోఁచుచున్నది. మేఘాది ప్రతిబంధకము లేనందున ఆకాశము విమల మనుటచేత, చంద్రునికి స్వచ్ఛప్రకాశమే గాక నిశ్చలత్వమును దెలియుచున్నది. మేఘచలన మున్న చంద్రుడు చలించినట్లు తోఁచుట సాజము. కాన విమల విశేషణము.

తదుపమ బకమునకు నిశ్చలత్వ ప్రతిపాదకము. దానిచే నది నిస్తబ్ధ మనియు, అందువల్ల నాచోటు వివిక్త మనియు విదిత మగుచున్నది. అని వస్తుధ్వని. దీనిచేత, ‘నదియ తమకు సంకేత స్థల’మని సూచించుటచేత సూక్ష్మాలంకారధ్వని. దీనివల్ల పరస్పరరతి వ్యక్త మగుచున్నది. కాన రసధ్వని. వీనికి వాచ్యమగు ఉపమ ఉపపాదకము.

ఇట్టి యుపమ కేవల మాలారూప అయి సావయవ పరంపరితాది భేదములచేత నింకను పలుతెరగు లగుచున్నది.

ఒక్క యుపమేయమునకు ఒక్క యుపమానమే యైన అది కేవల; అనేకము లైన మాలారూప.

కేవల పలుమారు నిరూపిత. ఐనను మచ్చునకు అనిరుద్ధచరిత్రమున,

‘చిందరవందరై యసురసేనలు
డెందమునన్ భయాకులం
బంది పతంగపుంగవశతాంగ
రథాంగమహోగ్రధాటి నం
దంద యడంగినట్లు ఉదయార్కుని
రాక నడంగె చీకటుల్
గొందుల సందులన్ గుహల
గుట్టలఁ బుట్టల చాటుమాటులన్.’

మాలారూపయును ‘అతని నుతింప శక్యమె, పరమశాంతుఁ డితండు—’ అనుచో నిరూపితము ‘అతని నుతింప శక్యమె—’ అనుచో ధర్మమనుగామి. పరమశాంతుఁ డితండు—’ అనుచో అనుగామి యైనను లక్ష్యము.

మరొకటి :—

అవనికి స్వర్గ పిశితాశనాలయమ్ము
వదలి పోల్చె నపూర్వశోభావిభూతిఁ,
దపనుబింబవిముక్తచంద్రకలవోలె,
పావకోద్ధృతహాటకప్రతిమవోలె.

ఇందు అపూర్వశోభావిభూతిఁ బ్రకాశించుట అనుగామి ‘పిశితాశనాలయమునకు’, ‘తపన బింబ పావకములకు’ బింబప్రతిబింబభావము. ‘వదలి’, విముక్త, ఉద్ధృత’ పదములు ఏకార్థ ప్రయుక్తములు కాన వస్తుప్రతివస్తుభావము. విశేషము.

వేరొకటి :—భాగవతమున,

‘శారదనీరదేందుఘనసార
పటీరమరాళమల్లికా
హారతుషారఫేనరజతాచల
కాశఫణీశకుందమం
దారసుధాపయోధిసితతామర
సామరవాహినీశుభా
కారత నొప్పునిన్ను మదిఁ గానఁగ
నెన్నఁడు గల్గు భారతీ!’

తొలిమలి యుదాహృతులయందు ధర్మము భిన్నము. ప్రకృతమున ఉపమానము లన్నింటితోను సామ్యసంపాదకము ఒక్కటే అనుగామి ధర్మము.

ఇంకొకటి :—కవిజనమనోభిరామమున,

ధర నల్పులకు ప్రభుత్వము వచ్చిన మను
ష్యుల వికారపుఁ జాడ్కఁ జూచినట్లు
పల్లవుల్ దుగి లేమిపడి యింటిచాయ రా
మొగ లంజతల్లులు మూల్గినట్లు

పరదేశి యతిలోభపరునియింటికిఁ బోవఁ
దెగి కోతివలెను గద్దించినట్లు
వంతువానికి హీనవైశ్యులు దమలోన
నేకంబుగా కలహించినట్లు
తెరలి యొరుఁ డొక్కటిని రూక్ష
దృష్టిఁ జూచు :
గొలగొలను మాట్లు : గద్దించుఁ
దఱిమి తఱిమి :
కలసి కలహించు : జొంకృతి
కలకలముగ
జాగిలమ్ములు గోషభీషణము లగుచు.

ఇదియు నేకోపమేయమున కనేకోపమానము లుండుట మాలోపమ. 'అల్పులవోలె' అని ఉపమానమునకు వెనుకగా వాచకము ప్రయోగింపక, 'దీపదర్శము దర్శించి—' అన్నట్లు ధర్మరూపముగ పరిణమించు క్రియాజన్య విశేషణమె వెంట ప్రయుక్తమగుట, జాతిస్వభావోక్తి సంకరమగుట, యథాసంఖ్యాలంకృతిసంశ్లిష్టమగుట పూర్వోదాహరణముల కన్న విశేషము. మరియొక విశేష మేమన, ప్రథమ తృతీయ పాదముల యందు ఉపమానలుప్త అం దుపమానము గమ్యము గాని వాచ్యము గాదు. వాకొన్న 'అల్పులకు' షష్ఠ్యంతము గాన, 'ప్రభుత్వము వచ్చిన,' అనుచో అన్వితము గనుకనూ, ఉపమానముగ, 'మాంచినట్లు' తో అన్వయింపఁ జాలదు. అటులనే, 'అతిలోభపరుని' అను నదియూ. వీనియం దుపమానము కవిస్వేచ్ఛతో వదలఁబడినది. 'వారు' అని మరల సర్వనామముతో నైనను అనువదింప శక్య మై యుండెడిది. ఉపమానలుప్తా విభాగములో ఇట్టిది యును సంఖ్యాపూరకము. 'అతని నుతింప శక్యమె' అనునదియు ఇట్టి యుపమేయ లుప్తయే.

మరి, 'ప్రకృతోదాహరణమునందు మొదటి పాదమున ఉపమానలుప్త యయిన కానీ, మూడవపాదమున 'కోతివలెను గద్దించినట్లు–' అని ఉపమాన ముండగా లుప్త యెట్లగును అంటే, 'కోతి' ఉపమానముగ వివక్షితము గాదు; లోభపరుడే. అది గద్దించుటలో ప్రకారమును తెలుపు విశేషణము. 'అట్లు కా'దన్నచో, 'పరదేశి యతిలోభపరుని యింటికిఁ|బోవ–'అను అర్ధపాదము అనర్థక మగును. కాన ఉపమాన లుప్తయే.

పైవిశేషములకుఁ దోడు చెప్పఁబోవు భిన్నవచనరూప మగుఉపమాదోషమునూ ఇందు గలదు. ఐననూ

'పలుగుణముల మరుగగు దోషలవము
మచ్చయునుబోలె శశికిరణములన్.'
'పరదేశు లతిలోభపరుల యిండ్లకుఁ బోవ
తెగి కోతులటు గద్దించినటు—'

అని సవరించిన దోషము లేదు. కుక్కలకు లోభు లుపమానము కోతులు గాదు.

సావయవ, 'సమస్త వస్తు విషయ', 'ఏకదేశ వివర్తి' అని ద్వివిధ. అందు సమస్త వస్తు విషయ :—

కమల ద్వదనము భ్రమరత్
భ్రమరికములు నీరితప్రభయు కోకయుగత్
కిమనియకుచద్వయి గల
రమణీమణి సరసివోలె రమ్యం బయ్యెన్.

ఇందుపమానోపమేయములకుఁ బోలె వాని యంగములకూ పరస్పర సామ్యము వర్ణితము గాన సావయవ. ఉపమేయముల కన్నింటికీ ఉపమానములు పేర్కొనుటచే సమస్తవస్తు విషయ. ఇదియే :—

కమల ద్వదనము భ్రమరత్
భ్రమరక నివహము తరంగితవళులు కోకత్
కమనీయకుచంబులు గల
రమణీసౌందర్య మమరె రమణీయం బై.

తరంగితపదము తారకాదులకు వలె, 'ఇత్యక్' ప్రత్యయాంతము గాదు. ఆచారార్థ 'క్విప్' ప్రత్యయముపై 'ఇటీ, క్త' ప్రత్యయములచే నిష్పన్నము.

ఇందు అవయవగతోపమవల్ల, నుడువకున్ననూ, రమణికి కాసారసామ్యము ప్రతీయమానము. కాన ఏకదేశవివర్తి.

పరంపరితము శుద్ధము శ్లిష్టము అని ద్వివిధము. శ్లేష లేనిది శుద్ధము: కవిజనమనోరంజనమున,

'అలివేణులకు మనోహరము గాదే వీని
కెందమ్మిచాయల కేలుదోయి;
కీరవాణులకు నోరూరింపదే వీని
మాధురీకలితబింబాధరంబు;
మదచకోరాక్షుల కెద ప్రేమ గొల్పదే
వీని పూర్ణేందుబింబాననమ్ము;
నవకోకకుచలకు వలపు పుట్టింపదే
వీని మార్తాండతేజోనిరూఢి;

అహాహా ! వీని వసంతమోహనవిలాస
మేలతాంగుల నలరింప డెంచి చూడ;
ననుచు రాగరసార్ద్రాంతరంగ యగుచు
సుదతి కనురెప్ప వెట్టక చూచె నతని.

ఇందు కేలుదోయిని కెందమ్మితో పోల్చుటకు, అధరమును బింబముతో నుపమించుటకు, ఆననమును పూర్ణేందువుతో పురుడించుటకు, తేజమును సూర్యునితో సాటి సేయుటకు, నాయకుని వసంతునితో తులదూచుటకూ, కారణములు, వాణీవేణ్యక్షి కుచాంగములను, అలి కీర చకోర కోక లతలతో నుపమించుట. ఇట్టి పరస్పరాశ్రితము నే పరంపరిత మందురు.

మరియొకటి :—
జగతి దీపములను బోలు సజ్జనులకు
కౌరవేంద్రుఁడు మారుతకల్పుఁ డయ్యె.
చటులనిష్ఠురముష్టి కేసరిసమునకు
మేషశాబకసముఁడు సామీరి కయ్యె.

పూర్వోదాహరణమున ఉపమాన ద్వయమునకు అనుకూల్యము. ఇందు ప్రాతికూల్యము. వేణుల కలుఁలతోడి సామ్యము చెప్పకున్నను కరములకు తమ్ములతోడి సామ్యము గమ్య ధర్మము నాశ్రయించి ఉపపన్నము. కాని, సామీరికి కేసరి సామ్యము లేకున్న రారాజుకు మేషశాబకసామ్యము పొసగదు. కాన పరంపరితము. పూర్వోదాహరణమునందునూ ఈ పరంపరితము కవివివక్షాధీనప్రయోగ మై స్వాధికారమును విడువఁజాలదు.

ద్వితీయోదాహరణము రారాజున కుపమాద్వయ ముండుటచే మాలారూపము. పూర్వము కేవల.

వేరొకటి :—
బహుపథికచిత్త తిరుగకు పర్వతముల
వంటి కుచములఁ జొరరాని వనితకాయ
మందు, జ్ఞానస్వమును వనమందుఁబోలె
మరుఁడు హరియించుఁ బొంచి తస్కరుఁడు [వోలె.

ఇందు కుచములకు పర్వతోపమ కాంతాకాయమునకు కాంతారోపమ సావయవ. కాయమును కాంతారముతోడను స్మరుని తస్కరునితోడను, చిత్తమును పథికునితోడను, జ్ఞానమును ధనముతోడను ఉపమించుట పరస్పరాశ్రయము గాన పరంపరితము. కనుక నిది యుభయ సంకీర్ణము.

శ్లిష్టపరంపరిత :—
సరసమానసరాజహంసాయమాను
మంజునారీప్రతతికి ధర్మాయమాణు
కైరవాయిత మానవేక్షణములకును
రాజు నాతనిఁ దరమె వర్ణనము సేయ.

'రాజహంసాయమాను' అనుచో రాజునకు రాజహంసపోలిక సరసుల మానసమునకు రసముతోడి మానససరోవరముయొక్క పోలికకు సాధనము. అటులనే ధర్మముతోడి=ధనుస్సుతోడి పోలిక లతాంగులయెడ జ్యావల్లరీ సామ్యమునకునూ. విశేష్యమునందు ఉపమ విశేషణమునందు అభేదమును గాక సామ్యమును నిర్ణయించును. అటులనే రాజన్నప్పుడు రేనికి శ్లిష్టరాజపదార్థ చంద్రునితో సామ్యమును, 'కైరవాయిత మానవేక్షణములు' అను విశేషణోపమ నిర్ణయించును. అనేకోపమానము లుండుటచే మాలారూపము. ఇటులనే కేవల ఊహ్యా.

ఆశబ్దమునుచేత న్యూనాభేదరూపక మున్నట్లు న్యూనోపము:—భీష్మపర్వమున,
'చిచ్చరకన్ను మూసికొని చేతి
త్రిశూలము దాచి లీలమై
వచ్చిన రుద్రుచందమున
వ్రాలుదు లీవనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవానికి
నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి నెవ్విధిఁ గెలువ వచ్చు
మహాత్మ! యెఱుంగఁ జెప్పవే.'

భీష్ముఁడు రణంబున నిలిచి, మూడవకన్ను ముమ్మొనవాలు విడిచివచ్చిన రుద్రునివలె పగవారి గుండియ లవియఁజేయుచు, తీంద్రించిన నతని మార్కొను మగవాఁ డెవఁడు? మార్కొను టేమి? కాళ్ళు వడక కుది బడక ఎదుట నిలువగల ధీరుఁ డెవడు? అనుచో చిచ్చరకన్ను త్రిశూలము కొరవడిన రుద్రుఁ డుపమానము. కాన న్యూనోపమ.

వేరొకటి:—చాటువు,
'సోముఁడు లేనిరాత్రివలె
సూర్యుఁడు లేనిదివంబురీతి శ్రీ
రాముఁడు లేనయోధ్యవలె
రాజకులేంద్రుఁడు వాసిరెడ్డి సు
త్రాముఁడు గానరాని యమరావతి
పెంపఱెఁ గాలమానముగ

గామవిరోధికిఁ గడవరాదు గదా
మది శంక లేటికిఁ.'

ఇందనేకోపమానములు, సోమాదులకు బింబ ప్రతిబింబ భావమూ విశేషము.

ఇటులనే అర్థశ్లేషోపమయూ చెప్పనగును.
ఆముక్తమాల్యదయందు :—

'విదితపురందరాయుధం బైన కనక
శిఖరియును బోలె నెఱకల జిగులు దెసల
నింగి నీరెండ గాయ వేదాంగు వినత
సుతుని నతి గాంచి మగుడఁ దన్నతియుఁ
[గాంచి.'

విష్ణుచిత్తుడు గరుత్మంతుని గాంచు ఘుట్ట మిగి. ఆగరుత్మంతుడు కులిశాఘాతి నొందని మేరు నగంబు చందమున నెఱకలతో విరాజిల్లుచుండె ననుట అర్థశ్లేషోపమ.

'అతి విమలము నుడివలె మతి
మతివలె గతియు.—

అనుచో రసనోపమ ప్రదర్శిత పూర్వము. అని దిక్ప్రదర్శనము.

ఇట్టి నానారూప భిన్నమగు నుపమ యెప్పుడు సకలవాక్యార్థ ప్రధానముగ ధ్వనించునో అప్పుడలంకారము గాక ధ్వనిపద వాచ్యమగును. అచ్చట నలంకార వ్యపదేశము గౌణము.

అదియును 'శబ్దశక్తిమూల, అర్థశక్తిమూల' అని ద్వివిధ. పదములు మార్చిన నుపమాధ్వనికి ప్రతిబంధక మేర్పడు నేని, అది శబ్దశక్తిమూల. శబ్దపరివృత్తిసహ మేని అర్థశక్తిమూల.
శబ్దశక్తిమూల :—

ఆ కలానిధి ద్విజరాజు ప్రాకటముగ
సకలసుమనస్సులందును సమముగాను
స్వచ్ఛగోసంఘమును వెదఁజల్లఁ గొన్ని
మోదమునఁ బొంగుఁ నొక కొన్ని ముచ్చ
[ముడుఁగు.

'చంద్రుఁడు సమానముగ అన్నిపూలపైనను తన కిరణములను వెదఁజల్లుచున్నను, కొన్ని వికసించును: మరికొన్ని ముకుళించును' అను ప్రకృతార్థ వాచక 'కలానిధి, ద్విజరాజ, గో, సుమన.' శబ్దశక్తివల్ల, 'ఒకే గురువుకడ విద్యనభ్యసించుశిష్యులలో కొందరు విజ్ఞానవికాసము నొంద, మరికొందరు ప్రతిభావిహీనులగుచున్నారు' అని యర్థాంతరము స్ఫురించుచున్నది. ఆ యప్రకృతార్థమునకు అసందర్భతను పరిహరించుటకు ప్రకృతాప్రకృతములకు పోలిక ప్రధాన వాక్యార్థముగ నిర్ణయింపఁబడుచున్నది. కాన నిది యుపమాధ్వని.
మరొకటి :—కవిరాజమనోరంజనమున,

'సకలకరుడు సులక్షణచారుమూర్తి
భాన్వితుడు కళాకలాపాంచితుండు
కువలయాప్తుడు నుగ్రాంబకవిలసనుండు
నయ్యెనారాజు విష్ణుపదాశ్రయమున.'

ఇందు రాజునకు చంద్రుని సామ్యము ఉపమాధ్వని.
వేరొక్కటి :—వసుచరిత్రమున,

ఘనులఁ గొండలపాలు గాఁ జేసినకొఅంత,
ద్విజరాజు నెపుడుఁ గుందించు కొదువ,
కువలయంబు దినంబుఁ గూల్చునాడిక, బంధు
జీవ మామోదిగాఁ జేయనిసుడి,
కల్యాణగోత్రంబు గరిమ వంచినమూరు,
సరసుల నింకించు పరుసదనము,
దానికే ల్వసులక్ష్మిఁ బూనఁ జేయునిరట్టు,
తమ్ములఁ బంకాప్తి దార్చునగడు,
నలువ వారించుకొనియెఁ దన్నగరసతుల
సెలకులు ముద్దుమోములు సిడుదకన్ను
లలితమోములు బిగిచన్ను లరిదినాభు
లలసఁదోడలును మృదుపదంబులు నొనర్చి.

'ఆ పట్టణకాంతలకు నాయాయి యంగము లొనర్చి, బ్రహ్మ తనకు జనించినదోషములను దొలగించుకొనియె' అనువాచ్యార్థమువలన తత్తదంగము లాయాకస్తుసమంబు లని యుపమ ధ్వనించుచున్నది.

ఇందు ఘనములవంటి కురులు ఇత్యాది తోచుచున్నది. ఘనములనుటకు మాకు మేఘములన్నను, తమ్ములనుటకు తామరలన్నను ఉపమకు లోటుండదు. కాన పరివృత్తిసహము. కనుక అర్థశక్తిమూలక మనవచ్చును. కాని యిందు బ్రహ్మ తన కేర్పడిన దోషములను తొలగించుటకు నిర్దుష్టములు గుణవిశిష్టము లగునంగముల నిర్మించెను. కాన తాదృశావయవ సృష్టికి అతని కేర్పడినదోషము కారణము. ఆదోషము, 'గొప్పవారిని గుట్టలపాలు సేయుట, సోదరులను పాపముల ముంచుట' అను అన్యార్థమును గూడ నొసగజాలు, 'ఘనుల, తమ్ముల' అను పదములచేతనే కలుగును. 'మేఘ' 'సోదర' పదములచే గాదు. కనుక నిదియు సరంపరగ శబ్దశక్తిమూలక మనుట సమంజసము.

మరి, 'రసికజనమనోభిరామమందలి
చందమామకు లోనఁగం దొనర్చినతప్పు,
పసిడికిఁ దావిఁ గూర్పనికొఱంత,
దొండపంటికిఁ దీపి నిండఁ జేయని యట్టు,
తొగలఁ బెన్మడుగునఁ ద్రోచువాఁడు,
జక్కవ పులుఁగుల జత విప్పువాఁడిక,
మించుటద్దముల మాఱుం దీఁడు.
కరిశుండములకు వక్రత యుడుప నేరమి,
చివురులు గాకొఱఁ జేయుటన్న.
మలుపుకొనఁగాలు నద్దిరా జలజభవుఁడు
పూని యిమ్ముగ్ధతలిరాకుఁబోఁడి వదన
తను రదాంశుకలోచన స్తనకపోల
సక్థిపదయుగ్మకము సొంపెసఁగ నొనర్చి.

అనుపద్యమునను తలిరాకుబోఁడి వదనాదులకు చంద్రాదిసామ్యము ప్రతీయమానమగుచున్నది. అట శబ్దము పరివృత్త్యసహము గాదు. 'ద్విజరాజు' ఇత్యాదులు లేకున్నను ఉపమ ధ్వనించుచున్నదిగదా! ఇచ్చట మాత్ర మేల శబ్దశక్తి మూల యనవలయును."

అంటే, వసుచరిత్రము పద్యమువంటివి వ్రాయఁబూనుకొన్నకవి అందున్న రచనా వైదగ్ధ్యమును కనుబరచ లేదు. 'తన కేర్పడిన దోషములను జలజభవుఁడు మలుపుకొనఁగాలు' అనుచోట, అతని కేర్పడిన దోష మెయ్యది?

ద్విజరాజును కళంకించుట దోషమయినట్లు చంద్రునిలో కళంకొనర్చుట దోషమగునా? తమ్ములకు పంకాసక్తి కల్పించుట దోషమగును. తొగలను మడుగునఁ ద్రోయుట దోషమగునా? గట్టునన్ వైచుట దోషమగునా? కనుక కొన్ని దోషములు గావు. కొన్ని పైగా గుణములే. అట్టిచో జలజభవునకు సుందర సుకుమార కాంతావదన నిర్మాణమునకు వసుచరిత్రమునన్ ఉన్న కారణము రసికజన మనోభిరామమున కనిపించుటలేదు. కాన దీనిని దానితో సాటి సేయఁ జనదు.

అందుననూ దోషము - శబ్దశక్తిమూలకము. కనుకనే ఉపమ పరంపరగ శబ్దశక్తిమూల యనుట.

'కావచ్చు. కాని, యీ యుపమ ధ్వని యెట్లు? ఘనులవంటి కురులు ఇత్యాదులను నిర్మించిగదా నలువపై దోషముల వారించుకొనుట. అట్టితరి, 'అట్టివాని నొనర్చి 'నలువ దోషము వారించుకొనియె' అనువాచ్యార్థమున 'ఒనర్చు' క్రియకు కర్మీభూతము లైననే అవి కురుల నువిశేషణమైనవ్యంగ్యోపమ గుణీభూతమగును గాని ప్రధానము గాఁజాలదు. కనుక 'ఉపమా ధ్వని' యనుట తగదు.' అంటే,

గొప్పవారిని కొండలఁ దోలుటవలన నలువకు కొఱత యేర్పడినది. అది మేఘములవంటి కురులు గల నాగసతులను నిర్మించినంతమాత్రమున ఎట్లు తీరును? అందువల్ల వ్యంగ్యోపమను గుణీభూతమన్నను తదుపపత్తి సంభవించదు. కనుక ఒక తప్పు చేసినవాడు తన్నిష్కృతికై వేరొక సుకార్యం మొనరించినట్లు, బాంధవవధమాచరించినవాఁడు అశ్వమేధము సల్పినట్లు. ఇందునను వాచ్యార్థమాత్రముచేతనే నలువ దోషనిరాకరణము సమన్వయించుకొనవలయును.

తదుపరి కవి తాత్పర్యము ప్రధానముగ తన్నగర లలనామణులు ఏవంవిధములని తోచుచున్నది గాన ఉపమ ధ్వని యనుటకు బాధకము లేదు.

శబ్దశక్తిమూల :— "సాగరుఁ బడకు మోయి ప్రియాంగనా" అనుచో నిరూపితము.
మరొకటి సౌందరనందమున,

'అద్దములోని నీడయును
నద్దము దాల్చిన నాథుమోమునన్
ముద్దులు గుల్కు మీసముల పొల్పుఁ
గనుంగొను మట్టి ప్రియంవదం
బద్దిన యంగుళీనలయమ్మున
జెక్కుల పత్రభంగములన్
దిద్దుకొనం బొడంగె సుదతీమణి
నేర్పు మీఱ నవ్వుచున్.'

ఇందు, 'సుదతి నేర్చి కొనుటకు ఇంగిత మెరిగి మెలగు దయితుడు నందుడు మించుటద్దముఁ దాల్చి చెంత నిలువ, కస్తూరితో చెక్కుల మకరికాపత్రముల దిద్దుకొనుచున్నది' అను వాచ్యార్థమువల్ల నందరూపానురూపముగ నుండఁగోరిన సుందరి మీసముల ముద్దులొల్కు నాథుని మోమునుబోలె తన మోమును కస్తూరీ పత్రభంగ విరాజిత మొనర్చును' అని ధ్వనించుచున్నది. అందు మీసలకు కస్తురి పత్రభంగములకూ బింబప్రతిబింబభావము.

మరి, 'ఇది ధ్వని యెట్లు? 'వాఁడు, నీ మీసల వలె నేను నా మోమున పత్రభంగములు తీర్చుచున్నాను. నీ మీసలతోడి మోముతో పత్ర



భంగములను ... ము, ... ను' అను వ్యజ్యమాన ఉ... ... ల పోల్పు గనుంగొనుచున్ నేరుపు మీఱ నవ్వుచున్' అను వాచ్యార్థమునకు ఉపపాదకము. లేకున్న నవ్వునకు మీసముల పోల్పు కనుంగొనుటకు ఉపపత్తి లభింపదు. కాన గుణీభూతవ్యంగ్యము.' అంటే,

'ఆ ముద్దు లొల్కు మీసములను తద్విశిష్ట నంద వదనమును తానలంకరించుకొనునంత కైనను చూడక యుండలేదు' అనుటయు తాను తీర్చఁదలచినచోటికి ననుగుణముగ ఇంగిత మెరిగి నమ్రనబంటువలెనుండదమున అదు మమగఁబట్టుచున్నాడు' అనుటయూ వాచ్యార్థమున కుపపాదకములు. కాన ఉపమ ధ్వని యగుట కభ్యంతరము లేదు. ఇందు శ్లిష్టపదములు లేవు గాన ఉపమ అగళేశ్రమూల.

## ఉపమాదోషములు

ఇక నీయుపమకు సొబగును కుదించున వన్నియూ నుపమాదోషములు.

అవి :—కవిసమయ ప్రసిద్ధిలేమి. ఉపమానోపమేయములకు జాతిప్రమాణలింగ సంఖ్యలచే అనౌచిత్యము బింబప్రతిబింబ భావమున ధర్మన్యూనాధిక్యములు. అనుగామి ధర్మమున కాలాది వ్యత్యయము, మొదలగునవి. ఈ దోషములు సామ్యమూలకములైన రూపకాదుల యందునూ పరిహరణీయములు.

కవిసమయ ప్రసిద్ధిలేమికి :—

'కలికి నీ మోవి రమ్యము కలువవోలె.'

అనుచో ముఖమునకు కలువతోడి సామ్యమప్రసిద్ధము. రూపకమున, పుట్టపర్తి నారాయణాచార్యుల మేఘదూతమందు :—

'అని పనవు నిర్భాగ్య డార్ద్రదిప్రతిదినము
కన్నీటితో సఖియ తనువు గీతలు గీసి
నిట్టూర్పుపూలతో నిండుగాఁ బూజించి-
వాని యాతన యెడద బాధింపఁగా నంధ
కారపత్రములపై జోరీగ వ్రాసినది.'

ఇందు నిట్టూర్పునకు పూలుపమానము. అది యప్రసిద్ధము. ప్రకారాంతరములచేత కవి సాధింపనూలేదు. కాన దుష్టము.

'స్వర్గసన్నిభ మయ్యె నీ భారతమ్ము.'

అనుచో భారతమునకు స్వర్గోపమ అప్రసిద్ధము. కాని, 'పరమమహనీయరమ్యసుపర్వ మగుట.' సుపర్వులు-దేవతలు. సు+పర్వములు = భారత భాగములు అని శ్లేషోపపాదిత సాధారణ ధర్మమగునేని అప్రసిద్ధమయ్యును దుష్టముగాదు. అటులనే దుర్యోధనునకు మేషశాబక సామ్యము పరంపరితోపమవల్ల సాధితము.

జాతి ప్రమాణలింగ వచనానౌచిత్యము :—

ధర్మాధిక్యతయూ :—

'ఆచమించె నగస్త్యర్షి యబ్ధిజలము
పాలు గుటికెడు శ్వక్రుసిడాలివోలె.'

ఋషికి బిడాలిపోలిక, జాతిచే లింగముచే ననుచితము. అబ్ధిజలమునకు గుటికెడు పాలు పరిమాణముచేత న్యూనము. ఉపమాన విశేషణ మగుమీసాలకు తగినధర్మము ఉపమేయమున లేదు. కాన ధర్మాధిక్యత.

'ఆచమించె నగస్త్యర్షి యబ్ధిజలము
కటికచీకటి బాలభాస్కరునిఁబోలె.'

అనిన సుసంగతము.

'ఏగురెంచె నదిగో! ఇభరాజికైవడి
నల్లచీమచాలు నళిననేత్ర!'

అనునదియు పరిమాణాధిక్యమునకు.

కాలభేదమునకు :—

'సాగరజలమ్ము వోలె మీసాలపిల్లి
త్రాగుచున్నది పాలగస్త్యర్షి వోలె.'

ఇందు వర్తమానకాలిక క్రియ ఉపమానభూత ఋషికి అనన్వితము.

సంఖ్యా వ్యత్యయమునకు :—విజయవిలాసమున,

'బంగరుబొంగరాల పరిపాటి
చనుంగవ, మీలనూటి త
ళ్కుంగనుదోయి, చంద్రుప్రతికోటి
మొగం, బెలదేటిధాటి క
న్నుం గడుమేటి వేణి, పులినంబుల
సాటి పిఱుం దయారె! చి
త్రాంగదపాటి జోటి గలదా యని
మెచ్చు కిరీటి మాటికిన్.'

'పులినంబులసాటి పిఱుం' దను చో ఉపమానబహుత్వము. (సశేషము)

Edited and Published by T. Ramachandra, 2/583, Pycrofts Road, Madras-5.
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras - 21.

